దేశాన్ని 500 ఏళ్ళు వెనక్కి నెట్టిన

# బ్రిటిష్ యుగం



డా॥ జి.వి. పూర్ణచంద్

దేశాన్ని 500 ఏళ్ళు వెనక్కి నెట్టిన

# బ్రిటిష్ యుగం

విశాలాంధ్ర ఆదివారం సంచికలలో "మరోకోణం" శీర్షికగా వెలువడిన "ధారావాహిక"

డా॥ జి.వి.పూర్ణచంద్



శ్రీమధులత పబ్లికేషన్స్
డోర్. నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002

# BRITISH YUGAM

Written by :

**Dr. G.V. Purnachand, B.A.M.S.,**

Susruta Ayurvedic speciality hospital

Ist floor, Satnam Towers,

Opp. Buckinghampet Post Office,

Governorpet, Vijayawada - 520 002

Ph : 0866-5568185, Mobile : 94401 72642



1st Edition :

January, 2006

Price : **50/-**

Cover Design & Type Setting :

**SREE MADHULATHA GRAPHICS**

Arundelpet, VIJAYAWADA. Ph : 2438324

Printed At :

**VAASU OFFSET PRINTERS**

Arundelpet, Vijayawada-2.

Published by :

**Sree Madhulatha Publications**

28-3-49, Sanjeevaiah Colony,

Arundalpet, Vijayawada - 520 002

Ph : 2434320 (O), 2436936 (R)

Cell : 94401 72936

# అంకితం...




తెలుగు భాషా పరిరక్షణకు ఉద్యమించి,

కృష్ణాతీరంలో పచ్చదనం పరిమళించాలని పరితపించి

ఉద్యమించిన రథసారథి

**మండలి బుద్ధప్రసాద్** గారికి

(శాసనసభ్యులు, అవనిగడ్డ)

సస్నేహంగా...

(డా॥ జి.వి.పూర్ణచంద్)

# చారిత్రక వాస్తవాల అధ్యయనంలో ఇది మరోకోణం...

చరిత్రను అనేకమంది అనేక కోణాల్లోంచి పరిశీలించారు. ఎవరి కోణం లోంచి వారు తమ పరిశీలనలు కొనసాగించారు. డా॥ జి.వి.పూర్ణచంద్ గారిది "మరో కోణం" శ్రీయుతులు పి.వి.పరబ్రహ్మశాస్త్రి, డా॥ వి.వి.వి.కృష్ణశాస్త్రి, ఐ.కార్తికేయశర్మ, కె.కృష్ణమూర్తి, డా॥ టి.వి.జి.శాస్త్రి, డా॥ నేలటూరి వెంకటరమణయ్య, డా॥ వి.కామేశ్వరరావు, కొమర్రాజు లక్ష్మణరావు, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, తిరుమల రామచంద్ర, రాంభట్ల... ఇలా ఎందరో చరిత్ర అధ్యయనపరులు తెలుగువారికి ప్రాతఃస్మరణీయులైనారు.

తమ చరిత్రను తెలుసుకొనని జాతి చరిత్ర హీనమే అవుతుంది. చరిత్రని తెలుసుకోవడమే కాదు, చరిత్రలోంచి పాఠాలు కూడా నేర్చుకోగలిగి వుండాలి. చరిత్ర నేర్పుతున్న పాఠాలే సమాజాన్ని మరో మలుపు తిప్పగలుగుతాయి.

"దేశాన్ని 500 ఏళ్ళు వెనక్కి నెట్టిన బ్రిటిష్ యుగం" గురించి అధ్యయనం చేసిన డా॥ జి.వి.పూర్ణచంద్ గారికి ఒక ప్రత్యేకమైన దృష్టికోణం వుంది.

వృత్తిరీత్యా వైద్యుడైనా, ప్రవృత్తిరీత్యా ఆయన కవి, చిత్రకారుడు కూడా! పరిశోధనా మనస్తత్వం వున్నవాడు. ప్రాచీన శాస్త్రాల్ని, అనేక ఆధునిక శాస్త్రాల్ని కూడా అధ్యయనం చేసినవాడు. జటిలమైన శాస్త్ర విషయాల్ని సామాన్య పాఠకుడికి అందేలా సులువైన శైలిలో చెప్పడం చాతనైన వాడు. దాదాపు 45 గ్రంథాలు రాసిన అనుభవం వున్నవాడు. సామాజిక నిబద్ధత కల్గినవాడు. నూరుశాతం అభ్యుదయవాది.

అనేక దిన, వార, మాసపత్రికల్లో ధారావాహికంగా ఎన్నో శీర్షికలు నిర్వహించిన డా॥ జి.వి.పూర్ణచంద్, ఒక ఏడాది కాలంగా విశాలాంధ్ర దినపత్రిక ఆదివారం అనుబంధంలో "మరోకోణం" పేరుతో భారతదేశంలో విదేశీ పాలన గురించి ఎన్నో వ్యాసాలు ప్రచురించారు. అవి పాఠకుల్ని విశేషంగా ఆకర్షించాయి.

అభ్యుదయ దృక్పథం కలిగిన వ్యక్తి చరిత్రని పరిశీలించేప్పుడు ఎలా స్పందిస్తాడో ఈ వ్యాసాలు చదివితే అర్థం అవుతుంది.

పోర్చుగీసులు హిందువుల మీద జుత్తు పన్ను విధించిన సంగతి వివరించేటప్పుడు మొఘల్ చక్రవర్తులు మహమ్మదీయులైన భారతీయుల్ని చిన్న చూపు చూసిన సంగతి విశ్లేషించినప్పుడు, అగ్రవర్ణాల సంస్కర్తలు దళిత వర్గాలపై పెదవి సానుభూతిని మాత్రమే

ప్రదర్శిస్తున్నారని చెప్పవలసి వచ్చినప్పుడు పూర్ణచంద్ గారి దృష్టికోణం తెలుస్తుంది. ఆయనది స్పష్టమైన అభ్యుదయమార్గం!

"ప్రపంచం అంతా ఒక గ్రామం" (GLOBAL VILLAGE) గా మారిన నేటి సమాజంలో అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని సంతరించుకోగలిగిన దేశాలు- జాతులు పురోగమించ గలుగుతాయి. మన సమాజాన్ని ఈ మేరకు సాంకేతికంగా అభివృద్ధి చేయాలనుకోవడంలో ఎలాంటి అభిప్రాయ బేధమూ లేదు. కానీ, ఇదే అదనుగా సంస్కరణల పేరుతో తిరిగి బహుళజాతి కంపెనీల పెత్తనం మన మీదకు సునామీ కన్నా భయంకరంగా విరుచుకుపడే పెనుముప్పు ఏర్పడబోతోంది. ఈ పరిస్థితుల్లో విదేశీ పాలకుల పాలనా విధానం వలన గతంలో, దేశం 500 ఏళ్ళు వెనక్కి పోయిన సంగతిని ప్రజలకు గుర్తు చేయడం చరిత్ర పరిశీలకుడిగా తన బాధ్యతగా డా॥ పూర్ణచంద్ భావించారు. ప్రజలు జాగరూకులైతేనే దేశాన్ని రక్షించుకోగలుగుతారని ఆయన ఆశించారు.

అందుకు గతంలో జరిగిన సాక్ష్యాలను తవ్వి బైటకు తీసి సశాస్త్రీయంగా నేటి తరానికి అందిస్తున్నారాయన.

ఆలోచించవలసిన బాధ్యత పాఠకుడిది. చైతన్యవంతులు కావలసిన బాధ్యత కూడా పాఠకులదే!

సరయిన సమయంలో వెలువడిన సరి అయిన రచనగా ఈ గ్రంథాన్ని భావిస్తున్నాను! రచయిత డా॥పూర్ణచంద్‌ని అభినందిస్తున్నాను.

**- ఎస్.రామకృష్ణ**

అసిస్టెంట్ డైరెక్టర్, ఎ.పి. స్టేట్ ఆర్కైవ్స్, హైదరాబాద్

# సహకరించినందుకు వందన సహస్రాలు

**చ**రిత్ర నేర్పుతున్న పాఠాల్ని పరిశీలించేందుకోసం "మరో కోణం" అవసరం అని విశాలాంధ్ర దినపత్రికలో, ఆదివారం అనుబంధంలో ఈ వ్యాసాలు నాతో రాయించిన అభ్యుదయ రచయిత, విశాలాంధ్ర సంపాదకవర్గ సభ్యుడు శ్రీ ముత్యాల ప్రసాద్ గారికి, విశాలాంధ్ర సంపాదక వర్గానికి కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాను.

విజయవాడ సాహితీవనంలో తులసీదళం లాగా "చినుకు" సాహిత్య మాసపత్రిక వెలువడుతోంది. ఈ పత్రికలో కూడా బ్రిటిష్ యుగానికి సంబంధించిన కొన్ని విశేషాలను ధారావాహికగా ప్రస్తావించాను. వాటిని కూడా ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది. చినుకు సంపాదకులు శ్రీ నండూరి శ్రీ రాజగోపాల్‌కు ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను.

ఈ గ్రంథ రచనకు సమాచారాన్ని క్రోడీకరించుకోవడానికి తోడ్పడిన వ్యక్తి శ్రీ అక్కిపెద్ది ఆంజనేయులు. ఆయనకు ఏమిచ్చినా కృతజ్ఞత తీర్చినట్లు కాదు. వారికి నమస్సృతులు.

"ఆర్కయివ్స్"ని తెలుగులో "దండ కవిలల గుడి" అనవచ్చేమో...! దస్తావేజుల భాండాగారం అది! ఆ ప్రాచీన పత్రాల మహాసముద్రం లోకి దూకితే మామూలు స్థితికి రావడం కష్టం. అన్ని డాక్యుమెంటరీ రికార్డులు అక్కడ భద్రంగా వున్నాయి. సమాచార సేకరణ కోసం అక్కడకు వెళ్ళిన ప్రతీసారీ ఎంతో ఆదరించి సహకరించే పెద్దలు, శ్రీ ఎస్.రామకృష్ణ- అసిస్టెంట్ డైరెక్టర్, ఎ.పి. స్టేట్ ఆర్కయివ్స్, తార్నాక, హైదరాబాద్- ఈ పుస్తకానికి రాసిన ముందుమాటలు, ఈ గ్రంథం ద్వారా అందవలసిన సందేశాన్ని చక్కగా విప్పి చెప్పాయి. వారికి నా కృతజ్ఞతలు చెప్పుకోవడానికి మాటలు చాలడం లేదు.

"చరిత్ర"కు పాఠకులు లేరని సర్వత్రా భావిస్తున్న తరుణంలో ఈ పుస్తకాన్ని ప్రచురించేందుకు సాహసంగా ముందుకు వచ్చిన ప్రియమిత్రులు, ప్రచురణకర్త లయన్ వి.యల్.నరసారెడ్డి గారికి స్నేహపూర్వకమైన అభివాదాలు.

జన చైతన్యాన్ని రగలించేందుకు చరిత్ర తోడ్పడాలని భావించిన ఈ అందరి సహకారంతోనే ఈ గ్రంథం రూపొందింది. కనీసం ఒక కొత్త ఆలోచనని ఈ పుస్తకం కలిగించ గలిగినా మా శ్రమ నేరవేరినట్టే భావిస్తాను.

తెలుగు భాషా పరిరక్షణ కోసం శ్రమిస్తూ, కృష్ణాడెల్టాలో పచ్చదనం పరిమళించేలా ఉద్యమిస్తూ ప్రజా చైతన్యం కోసం పరితపిస్తున్న అవనిగడ్డ శాసనసభ్యులు, శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి సస్నేహంగా ఈ కృతిని సమర్పిస్తున్నాను.

మీ..

(జి.వి.పూర్ణచంద్)

# విషయసూచిక

# చెన్నపట్నం నిర్మాతలు తెలుగువారే

"ప్రళయ కావేరి మైలాపురంబుగర్మి,
బీరమున బోర నది మట్టుబెట్ట దండ్రి
పేర దన్మధ్యభూమిని బుధువిభూతి
నలవరిచె చెన్న పట్టణ మయ్యనృపతి-"

ఈ పద్యం 'ఉషాపరిణయం' అనే కావ్యంలోది. ఇందులో చారిత్రక ప్రాధాన్యత కల్గిన అంశాలు చాలా వున్నాయి.

1. ప్రళయకావేరి నెల్లూరు జిల్లాలో వుంది. 1610లో ఈ ప్రాంతాన్ని "పాల్‌కట్" అని పిలిచారు బ్రిటిష్ వాళ్ళు. బహుశా ఇది పోర్చుగీసువారి అపభ్రంశపు ఉచ్చారణ ఫలితంగా ఏర్పడి, పులికాట్‌గా మారింది. అసలు పేరు ప్రళయ కావేరి. పాల కావేరి అనేది వ్యవహారనామం.
2. ఈ ప్రళయ కావేరి పరగణాలో మైలాపురానికి పాలకుడుగా వున్నవాడు అయ్యనపతి. అయ్యప్పనాయుడిగా ఇతను ప్రసిద్ధుడు.
3. ఈ అయ్యప్పనాయుడు తండ్రి దామెర చెన్నప్పనాయకుడు. ఆయన సహాయం తోనే వేలూరులో తిరుగుబాటు అణిచివేయ గలిగాడు వెంకటపతి రాయలు. విజయనగర ప్రభువులకున్నంత ఖ్యాతి, ప్రతిష్ఠ ఆరోజుల్లో ఈ తెలుగు యోధుడు దామెర చెన్నప్ప నాయుడికి వుండేవి.
4. చెన్నప్పనాయుడికి ఇద్దరు కొడుకులు, పెద్దకొడుకు దామెర వెంకటప్పానాయుడు, పులికాట్ (సూళ్ళూరుపేట) నుంచి కడలూరు దాకా వున్న ప్రాంతానికి పాలకుడుగా వుంటూ వేలూరు ప్రభువుల దగ్గర ప్రధానమంత్రి పదవిని కూడా చేస్తున్నాడు.

5. ప్రధానిగా వున్న 'వెంకటప్పానాయుడు తన తండ్రి చెన్నప్పనాయుడి పేర ఉత్తర ఆర్కాట్‌లో 'చెన్నసాగరం' అనేపేరుతో పెద్ద తటాకాన్ని తవ్వించాడు.
6. చెన్నప్పనాయుడి రెండో తమ్ముడు అయ్యప్పనాయుడు. ఈయన పూనమల్లి రాజధానిగా మైలాపూర్‌కు ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. తన అన్నగారు తండ్రి పేరున తటాకం నిర్మిస్తే, ఈ అయ్యప్పనాయుడు ఏకంగా చెన్నపట్నమే నిర్మింపచేశాడు.

పై పద్యాన్ని విశ్లేషిస్తే అందులో ఇన్ని చారిత్రక అంశాలు దొరుకుతాయి. అయ్యప్పనాయుడు అచ్చమైన తెలుగురాజు. ఈయన చెన్నపట్నాన్ని కట్టించదలచింది బ్రిటిష్ వాళ్ళకి దానం చెయ్యాలనే ఉద్దేశ్యంతో కాదు. అయ్యప్పనాయుడు యువకుడు. ముందు చూపు వున్నవాడు.

డచ్‌వారు, పోర్చుగీసులూ వర్తక వాణిజ్యంలో పోటీలు పడి, తమ ప్రజలకష్టాల్ని దోచుకుంటున్నారనీ, తమకంటూ మంచి ఓడరేవులూ, ఓడలూ లేకపోవడం చేతనే కదా... స్వంతంగా ఎగుమతులు చేసుకోలేక వీరిపై ఆధారపడవలసి వస్తోందనీ భావించి, తమ నౌకాబలం అభివృద్ధి కోసం చెన్నపట్నం కట్టించాలనే ఆలోచన చేశాడు అయ్యప్పనాయుడు, నిజానికి ఇది ఒకప్పుడు కృష్ణదేవరాయలు చేసిన ఆలోచనే.

'మున్సిపల్ సిటీ'ని పట్నం అనీ, మున్సిపల్ కార్పొరేషన్‌ని నగరం అనీ ఇవ్వాళ మనం పిలుస్తున్నాం. కానీ, మొదటి నుంచీ 16వ శతాబ్దిలో చెన్నపట్నం ఏర్పడే వరకూ 'పట్నం అనే మాటకి ఓడరేవు అనే అర్థమే వుండేది. ప్రాచీన ఓడరేవు పట్నాలు మచిలీపట్నం, నర్సీపట్నం, కాకినాడ పట్నం, విశాఖపట్నం ఇవన్నీ చెన్నపట్నం కన్నా ముందుగానే ఏర్పడి, బ్రిటిష్‌వారికి, ఇతర విదేశీయులకీ స్థావరాలుగా వున్న ప్రాంతాలే!

వస్త్ర పరిశ్రమ విస్తృతంగా వున్న సముద్ర తీరప్రాంతంలో ఓడరేవు పట్నాలు ఏర్పడి, విదేశీ వర్తక వాణిజ్యాలు ముమ్మరంగా సాగాయి.

నెల్లూరు నుంచి మద్రాసు దాకా వున్న ప్రాంతంలో పల్లెకారులు ఎక్కువ. బట్టలు నేసే వృత్తి ప్రధానంగా జీవిస్తున్న గ్రామాలు ఇవన్నీ. వీరి పరిస్థితి మెరుగవ్వాలంటే, మంచి ధరకు విదేశీ కొనుగోలుదారులు కావాల్సిందే! అందుకోసం అయ్యప్పనాయుడు ఒక ఓడరేవుని కట్టదలుచుకున్నాడు.

సముద్రతీరంలో ఓ ప్రాంతాన్ని ఎంచుకుని చెన్నపట్నం అని పేరుపెట్టాడు. ఓడల రాకపోకలకు అనువుగా వుండేలా దాన్ని తీర్చిదిద్దాడు. వర్తకులు రావడం మొదలైతే వారికి సౌకర్యాల కోసం అనేక వసతులు ఏర్పరచడానికి సహజంగానే వ్యాపారులు ముందుకొచ్చారు. అనేక మంది పనివారి అవసరం కూడా ఏర్పడుతుంది కదా... వీరందరి నివాసాల కోసం దగ్గరగా ఓ ఊరు ఏర్పడుతుంది కూడా!!


తొలినాటి మద్రాస్ ఓడరేవు

అదిగో అలా ఏర్పడిన వూరే- మాదరాజు అనే సామంతుడిపేరుతో మాదరాజు నగరం! ఈ మాధరాజు నగరమే బ్రిటిష్ వారి నోట్లో పడి మద్రాస్ నగరంగా మారిందని పరిశోధకులు భావిస్తున్నారు.

చెన్నపట్నం అయినా, మద్రాస్ నగరం అయినా ఇద్దరు తెలుగు వీరుల స్మారక చిహ్నాలుగా ఏర్పడ్డవే! రెండు పేరుల్తోనూ ప్రసిద్ధిచెందాయి. దాని చారిత్రక ప్రాధాన్యతని తుడిచేసి తమిళ నగరంగా దాన్ని మలచడం కోసమే చెన్నయి అనే పేరుని ద్రవిడ ప్రభుత్వాలు వ్యాప్తిలోకి తెచ్చాయి. తెలుగుదనం చెన్నపట్నంలో లేకుండా చేయడానికే ఈ కుతంత్రం!

* * * * *

1927మార్చి 14వ తేదిన ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలోని ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేసే విషయాన్ని మొట్టమొదటిసారిగా చర్చ జరింగింది.

పిల్లలమర్రి ఆంజనేయులు ఆతీర్మానం మీద మాట్లాడుతూ, ఇప్పుడు మనందరం కూర్చుని చర్చిస్తున్న ఈ సభాస్థలి -మద్రాసు నగరాన్ని ఈస్టిండియా కంపెనీకి ఒక తెలుగురాజు దానంగా ఇచ్చిన ప్రాంతం- ” అని చారిత్రకంగామద్రాసు తెలుగువారి నేలగా నిరూపించే ప్రయత్నం చేశాడు.

అప్పట్లో చాలా మంది తెలుగువారి క్కూడా తాము అరవలమని చెప్పుకోవడం ఒక ఫ్యాషన్‌గా వుండేది. ఎందుకంటే దేశరాజకీయాల్లో అరవవారికున్న ప్రాధాన్యత తెలుగు వారికి లేదుకాబట్టి.

'సత్యమూర్తి' అనే తెలుగు శాసనసభ్యుడు, చరిత్ర పరిశోధకుడు, మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో చరిత్రోపన్యాసకుడు వెంటనేలేచి ఛీ!ఛీ! జాతికంతా అవమానకరమైన పనిచేసిన ఆ రాజు పేరు స్మరించకండి-' అన్నాడు. విషయం పక్కదారి పట్టింది. ఆంధ్రరాష్ట్రమూ అప్పుడు ఏర్పడలేదు. మద్రాసూ తెలుగువారికీ దక్కలేదు.

విచిత్రం ఏమంటే, మద్రాసుని బ్రిటిష్ వారికి ఇచ్చిన రాజు తెలుగువాడనే సరికి తెలుగు వారికి చాలా అవమానం అన్పించింది! కానీ, గాంధీ మహాత్ముని పిలిచి, తమిళులు 1939లో మద్రాసు త్రిశత వార్షికోత్సవం జరుపుకున్నారు. అది తమిళ నగరంగా సగర్వంగా స్వంతం చేసుకోగలిగారు.


సెయింట్ మేరీస్ చర్చ్, చెన్నై

నిజానికి ఇంగ్లీషు వారు భారతదేశంలో మొట్టమొదటిగా స్థావరం ఏర్పరచుకొన్నది మద్రాసులో అనడం పొరబాటు. 1611 నాటికే మచిలీపట్నంలో స్థావరం పొందారు. 15వ శతాబ్దం చివరినాటికే ఉత్తరభారతదేశంలో బ్రిటిష్ స్థావరాలు అనేకం వెలిశాయి. మద్రాసు వాటిలో ఒకటి!కానీ, బ్రిటిష్ వారి రాకతో ఈ ఊరు దశ తిరిగింది. గొప్ప నగరంగా ఎదిగింది. రాజధానిగా నిలిచింది. చివరికి తెలుగువారికి సంబంధం లేనిదిగా మిగిలింది!

ఒక విధంగా చూస్తే, మొదటి నించీకూడా, ఆంధ్రులు రాజకీయంగా చాలా దురదృష్టవంతులు. ఎన్నో అత్యవసర సమయాల్లో తెలుగు వారు మూకుమ్మడిగా గాంధీకి అండంగా నిలబడ్డారుకానీ, గాంధీ తమిళులకిచ్చిన ప్రాముఖ్యత తెలుగువారికివ్వలేదు.

దక్షిణ భారతదేశంలో తొలితరం, స్వాతంత్ర్యయోధులు గాజుల లక్షీనరసుసెట్టి, పి. రంగయ్య నాయుడు, పిట్టి త్యాగయ్యశెట్టి- వంటి రాజకీయ ప్రముఖులు నూరుశాతం తెలుగువారే. తిలక్‌కన్నా ముందే స్వాతంత్ర్యం జన్మహక్కుగా పోరాడిన యోధులున్నారు. ఆనాటి మద్రాసులోని తెలుగువారిలో! గాంధీ ఇచ్చిన ప్రాముఖ్యతరీత్యా తమిళ బ్రాహ్మణుల పలుకుబడి కాంగ్రెస్‌లో హెచ్చిన తర్వాత తెలుగువారి ప్రాధాన్యత క్షీణించటం మొదలయ్యింది.

ప్రకాశం మంత్రివర్గం ఏర్పడకుండా ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఆరోజున గాంధీ, రాజగోపాలాచారీ కలిసి నిర్వహించిన పాత్ర, సీల్డ్‌కవర్ రాజకీయాలు, ఇప్పటికీ కాంగ్రెస్ పాలకులకు శిరోధార్యంగా నిలిచిన అంశాలే! అది వేరేకథ. దాని గురించి విడిగా చర్చిద్దాం.

మద్రాసు తెలుగువారిదే... బ్రిటిష్ వారి నుంచి కాంగ్రెస్ వారివరకూ అన్ని రాజకీయ పక్షాలూ అంతో ఇంతో తెలుగువారికి మద్రాసు దక్కకుండా చేసినవాళ్ళే! ఆ వివరాలు కొద్దిగా పరిశీలిద్దాం.

(1) మద్రాసు నగరం తమిళ ప్రాంతాలన్నింటికీ దూరంగా, తెలుగు పల్లెలకు దగ్గరగా వున్న తెలుగువారి నగరం.

(2) స్వాతంత్ర్యం వచ్చేనాటికి మద్రాసులో తెలుగు బ్రాహ్మణులు, వైష్ణవులు, దేవాంగులు, పద్మసాలీలు, పద్మనాయకులు, బలిజలు, కమ్మనాయుళ్ళు, రెడ్లు, ఉప్పు బలిశెట్లు, కోమట్లు, బేరిశెట్లు భారీ సంఖ్యలో వున్నారు.

(3) స్వాతంత్ర్యం వచ్చినప్పుడు మద్రాసు నగర మేయర్ తామరుపాకం సుందరరావు నాయుడు స్వచ్ఛమైన తెలుగువాడు. ఆయన తెలుగులోనే సంతకం చేసేవాడు.

(4) ఈ స్టిండియా కంపెనీవారు ఫోర్ట్‌సెయింట్ జార్జిని చెన్నయ్ పట్నంలో కట్టినపుడు ఇక్కడున్న వర్తకులు (పెద్ద శెట్లు-) తెలుగువాళ్ళు! బ్రోకర్లు తెలుగువాళ్ళు!!

అలాగే, ఇంగ్లీషు వారికి దుబాసీలు బేరితిమ్మన్న, కాశీ వీరన్న తెలుగువాళ్ళు! ఆనాటి కరణాలు తెలుగువాళ్ళు చావడిలో కూర్చుని సివిల్ క్రిమినల్ కేసులు విచారించిన ఆనాటి అదికార్లు-కనకపిళ్ళ, పెద్దినాయుడు... వీరంతా కూడా తెలుగువాళ్ళే! అప్పట్లో బ్రిటిష్‌వారికి కూలిపనులు చేసి పెట్టిన కార్మికవర్గం, పల్లెకారు, వీరంతా కూడా తెలుగువాళ్ళే. తమిళుల ప్రాబల్యం చాలా తక్కువ!!!

(5) భౌగోళికంగా మద్రాసు నగరం కోస్తా జిల్లాలకు, రాయలసీమ జిల్లాలకూ మధ్యన వున్న ప్రాంతం. నెల్లూరి తెలుగు చోడరాజులు కంచివరకూ గల ఈ ప్రాంతాన్ని పాలించారు. వారికన్నా ముందునాటి- పల్లవులతొలి నివాస స్థానం కృష్ణాతీరం పల్నాడు అనీ, వీళ్ళు మౌలికంగా తెలుగు వారనీ నిరూపించేందుకు చాలా ఆధారాలున్నాయి.

కాకతీయ చక్రవర్తుల ఏలుబడిలో ఈ మద్రాసుప్రాంతం చాలా కాలం వుంది.

విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత, ఆ రాజ్యానికి వారసులుగా వున్న చంద్రగిరి పాలకుల సామంతుడు తెలుగురాజు-దామెరఅయ్యప్పనాయుడు ఈస్టిండియా కంపెనీకి ఈ నేలని దానంగా ఇచ్చినప్పటి అప్పటి దానశాసనాలన్నీ కౌళ్ళకు సంబంధించిన రికార్డులన్నీ తెలుగుభాషలోనే వున్నాయి.

(6) బందరులో తీవ్రమైన కరువు పరిస్థితులు ఏర్పడినందువలన అక్కడ ఓడరేవులో వర్తకవాణిజ్యాలు సాగకపోవడంచేత, పొట్టచేత్తో పట్టుకొని వచ్చి మద్రాసులో స్థావరం పొంది ఓడరేవు పట్టణం నిర్మించుకున్నారు. అంతేకాని బ్రిటిష్ వారికి మద్రాసు తొలిమజిలీ ఎంతమాత్రమూ కాదు. వారికి ఆశ్రయం యిచ్చిన తెలుగు రాజు దేశద్రోహికాదు.

* * * * *

క్రీ.శ. 1611.

పులికాట్‌లో స్థావరంకోసం భూమ్యాకాశాలు ఏకం చేసేంత హడావుడి ప్రయత్నం చేసిన బ్రిటిషర్లు అక్కడ చేతులు కాలాక, తిరిగి మచిలీపట్నం చేరి బుద్ధిగా వ్యాపారం చేసుకోవడం మొదలు పెట్టారు.

ఈలోగా గోల్కొండ సుల్తాన్ బందరుకీ, నెల్లూరుకీ మధ్యన పెద్దపల్లి అనే ఓడరేవులో ఇంగ్లీషువాళ్ళు వాణిజ్య కూడలిపెట్టుకోవడానికి కొన్ని షరతులతో అనుమతించాడు. దీన్ని ఆనాటి బ్రిటిషర్లు 'పెట్టపోలి' అని పిలిచారు. ప్రస్తుతం ఇది నిజాంపట్నం ఓడరేవుగా వ్యవహారంలో వుంది. స్థావరం యిచ్చాడుగాని గోల్కొండ సుల్తాన్ అబ్దుల్లా, వాళ్ళని ప్రశాంతగా వుండనీయలేదు. అందుకని ఈ సుల్తాన్‌లగోల లేని హిందూరాజ్యంలో ఎక్కడైనా చోటుదొరుకుతుందేమోనని వెదకడం మొదలుపెట్టారు. ఎక్కడికి వెళ్ళినా డచ్చివాళ్ళు, పోర్చుగీసులూ వీళ్ళని ముందుకు సాగనీకుండా కట్టడి చెయ్యసాగారు. 1616లో పశ్చిమ తీరంలో కాలికట్‌లోనూ క్రంగనూరులలోనూ కొంతప్రవేశం సంపాదించుకోగలిగారు. కానీ వాటివలన అంతగా ప్రయోజనం కన్పించలేదు.

1619లో తప్పనిసరి పరిస్థితిలో పులికాట్‌లో పాత కక్షలు మరచిపోయేలా డచ్‌వారితో రాయబారాలు సాగించి ఎలాగైతేనేం వారితో కలిసి వ్యాపారం పంచుకోవడానికి ఒప్పించ గలిగారు. కానీ, పరస్పర విశ్వాసం లేని కారణంగా ఈ బలవంతపు బాంధవ్యం కొనసాగలేదు.

1622లో జాన్సన్ అనే బ్రిటిష్ అధికారి తంజావూరు నాయకరాజు బ్రిటిష్ వారిద్వారా వ్యాపార లావాదేవీలు నిర్వహించడానికి సిద్ధంగా ఉన్నాడంటూ ఒక వర్తమానం

పంపించాడు. దాని ఆధారంగా లండన్ నుంచి తంజావూరికి 52వేల రియాల ఖరీదైన సరుకులతో ఓడనొకదాన్నీ, కొందరు అధికారుల్నీ పంపించారు. ఐదింట నాలుగువంతులు మిరియాలు, మిగిలినవి నూలు వస్త్రాలు వుండాలనే నిర్ణయంతో ఈ ఓడ కారైకల్ చేరింది. అక్కడినుంచి ఓడ అధికారులు తంజావూరు నాయకరాజుని కలిశారు.

కానీ, అప్పటికే డేనిష్ వర్తకులు ఈ కారైకల్ ఓడరేవుని తమ వినియోగార్థం యిస్తే సంవత్సరానికి 7వేల "రియా"లు లంచం యిచ్చేందుకు అన్నీ మాట్లాడి పెట్టివుంచారు. అంతకన్నా ఎక్కువ నాయకరాజుకీ ఇవ్వలసి రావడంతో బ్రిటిష్‌వాళ్ళకి ఇది లాభసాటి వ్యాపారంగా కన్పించలేదు. అందుకని మూడువేలకు మించి ఇవ్వం- ఇష్టమైతే ఇవ్వండి- లేకపోతే లేదు- అన్నారు. నాయకరాజు కుదురదు పొమ్మన్నాడు. దాంతో ఓడ వెనక్కి తిరిగి బందరు దిశగా తరలిపోయింది.

1628దాకా ఇలానే సాగింది ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ కథ. అయితే, గోల్కొండ సుల్తాన్ కన్నా హిందూరాజులే తక్కువ లంచం అడుగుతున్నారన్నది బ్రిటిష్‌వాళ్ళ అనుభవంలోని విషయం!

1628లో సుల్తాన్ ఓడరేవు సుంకం రెట్టింపుచేసి బ్రిటిష్ వాళ్ళపట్ల మరింత కఠినంగా వ్యవహరించడం మొదలుపెట్టాడు. పులికాట్ దగ్గర ఎక్కడో ఒకచోట ఎలాగైనా స్థావరం కల్పించుకొనే తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి.

మధ్యలో కొద్దికాలం పెద్దపల్లి నెల్లూరు మధ్యన ఆర్ముగం ఓడరేవులో కొంత వ్యాపారం చేద్దామని ప్రయత్నించారు. స్థానికంగా వున్న హిందూరాజు 'ఆర్ముగముదలి'అందుకు ఇంగ్లీషు వాళ్ళకీ సహకరించాడు కూడా కానీ చిన్నఓడరేవు కావడాన లాభసాటిగా వ్యాపారం సాగలేదు. తిరిగి బందరే గతి అనుకున్నారు.

1630నాటికి ఎంతోకొంత వ్యాపారాన్ని మచిలీపట్నం, పెద్దపల్లి (నిజాంపట్నం), మోటుపల్లి (గుంటూరుజిల్లా) ఆర్మగాం ఓడరేవుల్లోంచి చేస్తూనే వున్నారు. కాని ఎక్కడా వారి ఖర్చులకి తగినంత వ్యాపారం రాకుండా వుంది. గోదావరిజిల్లా నరసాపూర్, వీరవాసరంలలో కూడా కొంతమేర వాణిజ్య స్థావరాలు పొందగలిగారు. అయినా అదనపు ఫలితాలేమీ కన్పించలేదు.

అసలే అరకొరగా వ్యాపారం నడుస్తుంటే సరిగ్గా యిదే సమయానికి నెల్లూరు మొదలు విశాఖపట్నందాకా వున్న ఆంధ్రసాగర తీర ప్రాంతాల్లో తీవ్రమైన కరువు పరిస్థితులు ఏర్పడ్డాయి. చేనేత కార్మికులు ఆకలి బాధ తాళలేక వేలాదిమంది మరణించడమో, తరలిపోవడమో జరిగింది. బందరు కేంద్రంగా వున్న వస్త్ర పరిశ్రమ కనీసం పదవంతుకు దిగజారిపోయింది. పారిశ్రామికంగా 90 శాతం ఉత్పత్తి పడిపోయిందన్న మాట!

ఉత్పాదకులు నశించిపోయారు. కనీసం 10సంవత్సరాలపాటు కొనసాగిన ఈ కరువుకు ఆనాటి పాలకుల తీవ్రమైన నిర్లక్ష్యమే కారణం. ముఖ్యంగా విజయనగరం కడపటిరాజుల్ని గోల్కొండ సూల్తానుల్నీ యిందుకు బాధ్యుల్ని చేయాలి. గోల్కొండ సుల్తాన్‌కి పర్షియా దేశపు గుర్రాలను లంచంయిచ్చి బందరులో తమ స్థావరానికి ఢోకా లేకుండా కొంత హామీ పొందారు బ్రిటిషర్లు. స్థావరం వుండి గానీ, వ్యాపారం లేకుండా పోయింది. కూటికి లేని ప్రజలు బ్రిటిష్ వస్తువులేం కొనగలుగుతారు?

1637 నాటికి కోస్తా ఆంధ్ర పరిస్థితి మరింత దిగజారింది. ఇంకో లాభసాటి స్థావరం కోసం తప్పనిసరిగా వెతుక్కోవాల్సిన అవసరం ఏర్పడింది- ఆంగ్లేయులకి! అదిగో... అదే సమయానికి దామెర అయ్యప్పనాయుడు తన తండ్రి పేరున కొత్తగా నిర్మించిన చెన్నపట్నం ఓడరేవు వారి కళ్ళలో పడింది.

ఇతని అన్న దామెర వెంకటప్పనాయుడుని ఆనాటి ఇంగ్లీషు రికార్డుల్లో లార్ట్ జనరల్ ఆఫ్ కర్నాటక అనీ, గ్రాండ్ వజీర్ టుదికింగ్ అనీ వ్యవహరించారు. 'కర్నాటక' అని ఆనాటికి పిలిచింది నెల్లూరు జిల్లా ప్రాంతాన్నేగానీ, మైసూరు రాజ్యాన్ని కాదు. ఆ తర్వాత వచ్చిన ఆర్కాట్ నవాబుని కూడా కర్నాటక నవాబు అనే పిలిచారు. అతని ఏలుబడిలోనే మద్రాసు నుంచి బెజవాడదాకా వుండేది. శ్రీనాథుడు వర్ణించిన కర్నాటక నెరజాణలు నెల్లూరు స్త్రీలేగాని, మైసూరు రాజ్యం స్త్రీలు కాదని పండితులు అంటారు. అలాంటి కర్నాటక లార్డ్ జనరల్ దామెర వెంకటప్ప నాయుడు కాళహస్తి, పూనమల్లి పాలకుడుగా ఈ సముద్ర తీరప్రాంతాన్ని పాలిస్తూ తండ్రి పేరున చెన్నపట్నం ఏర్పడటానికి కారణం అయ్యాడు.

ఓడరేవు పేరు చెన్నపట్నమేగాని, మద్రాసు పట్నం అనే పేరున తమ రికార్డుల్లో ఎక్కువగా రాశారు. ఇది గమనార్హం. వెలుగోటి వంశీకులైన రాజుల్లో 'మాదరాజు' పేరుతో ముగ్గురు రాజులు కన్పిస్తారు. ఈ కథాకాలానికి ఈ ముగ్గురూ పూర్వీకులే! ముగ్గురూ ప్రసిద్ధులే, వీరిలో ఎవరి పేరుతోనైనా మాదరాజుపట్నం ఏర్పడి వుంటుందనీ, మద్రాసు పట్నంగా బ్రిటిషువారు దాన్ని వ్యవహరించివుంటారని పరిశోధకులంటారు. 'మదరసా', 'మద్ర' అనీ ఇతర పేర్లు కూడా మద్రాసు అనడానికి కారణమయ్యాయనే వాదనలున్నాయి.

* * * * *

క్రీస్తు శకం 1640 ఫిబ్రవరి 20వ తేదీ...

బ్రిటిష్ వారు తట్టా బుట్టా సర్దుకుని కొత్తగా నిర్మించిబడిన చెన్నపట్నం ఓడరేవుకు వచ్చారు.

ఓడనిండా సరుకుని ఓడలోనే వుంచుకుని, తట్టలూ, బుట్టలూ తీసుకుని పడవుల్లో చెన్నపట్నం తీరానికి బయల్దేరారు.

తట్టాబుట్ట అని పదే పదే అనడం ఎందుకంటే, సగటు బ్రిటీష్ పౌరుడి జీవనం ఆనాటి సగటు భారతీయుడి జీవనం కన్నా మరీ గొప్పదేమీ కాదని గట్టిగా, చెప్పడానికే, తెల్లగా ఉండటం, గడగడా ఇంగ్లీషులో మాట్లాడటం అనే రెండు లక్షణాలు వాళ్ళని మనకన్నా అధికుల్ని చేశాయి. అంతే.

సముద్రం ఒడ్డున చిన్న చిన్న గుడారాలు వేసుకుని, కుంపట్లు రాజేసుకుని ముందు ఆకలి తీర్చుకునే ప్రయత్నాలు ప్రారంభించారు.

రాజుగారికి రాయబారాలు పంపుకోవాలి! ఇక్కడ వుండేందుకు అనుమతించమని విన్నపాలు చెప్పుకోవాలి. ముందు ఆయన దర్శనం కావాలి. తమ విన్నపం వినేందుకు తగిన సమయం నిర్ధారణ జరగాలి. అందుకు నెలలు కూడా పట్టవచ్చు. అప్పటికే మూడు వారాలు గడిచిపోయాయి.

ఈలోగా 12-3-1640న సముద్రంలో అంతకు మునుపు కనీవినీ ఎరుగనంత ఉధృతమైన తుఫాను చెలరేగింది. బ్రిటిష్ అధికారులు స్థానికంగా వున్న కొందరు నల్లవాళ్ళని సాయంగా మాట్లాడుకుని ఓడల్ని సురక్షిత ప్రాంతాలకు తరలించేందుకు తీసుకు పోయారు. అందరూ ఓడమీదకు చేరేసరికి తుఫాన్ మరింత ఉధృతం అయి బలమైన గాలులు వీచి ఓడలు అదుపు తప్పి కొట్టుకు పోసాగాయి. మూడురోజులు సముద్రంలో దిక్కు తెలియకుండా తిరిగి, చెంగల్పట్టు జిల్లా మధురాంతకం తాలుకాలో అలంపరై అనే సముద్రతీర గ్రామం వైపు చేరుకున్నారు.

చావు బతుకులతో దోబూచులాడి, తుఫాన్ తగ్గి మబ్బులు తెల్లవారిన తర్వాత, ఒడ్డుకు వెళ్ళి ఆహారం దొరుకుతుందేమోనని ప్రయత్నించవలసిందిగా నల్లవాళ్ళని కోరారు ఓడలోని బ్రిటీషర్లు.

అప్పుడు ఆ నల్లవాళ్ళు 'అమ్మో వాళ్ళు మా వాళ్ళు కాదు- మలబార్లు. అక్కడ మమ్మల్ని చూస్తే చంపేస్తారు'- అన్నారట!'

బ్రిటీషర్లు చెన్నపట్నంలో తమ చేదు జ్ఞాపకాల్ని రికార్డు చేస్తూ ఈ సంగతి కూడా రాసుకున్నారు.

'రామచంద్రుని వెంకటప్ప' అనే రచయిత, పరిశోధకుడు మద్రాసు పట్నం పుట్టు పూర్వోత్తరాలను చర్చిస్తూ ఈ సంఘటనని ఉదహరించి, అర్థవంతమైన వివరణలు కొన్ని ఇచ్చారు.

1. బ్రిటిషర్లకు సహాయకులుగా వెళ్ళిన నల్లవాళ్ళు ఎవరు?
2. నల్లవాళ్ళు చూసిన మలబార్లు ఎవరు?
3. మలబార్ల ప్రాంతంలోకి వస్తే నల్లవాళ్ళని చంపేస్తారని ఎందుకు భయపడ్డారు?

ఈ మూడు ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలకోసం వెంకటప్పగారు అన్వేషించారు.

వాస్కోడిగామాగాని, అతని తర్వాత వచ్చిన పోర్చుగీసులు గాని, అరేబియా సముద్రంలోంచి కేరళ రాష్ట్రం మలబారు తీరం వెంబడే ప్రయాణించారు. క్రమేణా బంగాళాఖాతం తమిళ ప్రాంతాల్లోకి వచ్చినప్పుడు ఇక్కడి ప్రజలు మాట్లాడుతున్న భాష కూడా వాళ్ళ చెవులకి మళయాళ భాషలాగానే విన్పించింది. అందుకని తమిళుల్ని కూడా మలబార్లనే పిలిచారు. పోర్చుగీసుల రాక నుంచి, ఇప్పుడు మనం చెప్పుకుంటున్న ఈ కథా కాలానికి కనీసం నూటపాతిక సంవత్సరాలు గడిచాయి.

ఈ నూట పాతికేళ్ళలో తమిళుల్ని కూడా స్థానిక ప్రజలు మలబార్లుగానే పిలవసాగారు.

ఇంకా ఎగువకి ఉత్తరంగా ప్రయాణించి నప్పుడు పోర్చుగీసులకి వేరే భాష మాట్లాడుతున్న తెలుగువారు కన్పించారు. ఇంతంత తక్కువ దూరాల్లోనే ఇన్ని రకాల భాషలు మాట్లాడే ప్రజలు కన్పించడం పోర్చుగీసులకి వింతనిపించింది.

కేరళలోనూ, తమిళప్రాంతాల్లోనూ ఆది క్రైస్తవాన్ని పుచ్చుకున్నవారు కన్పించారు కానీ, తెలుగు ప్రాంతాల్లో వాళ్ళకి క్రైస్తవ మతం ఛాయలు కూడా కన్పించలేదు... అందుకని, 'మతాంతరులు' లేక మన మతం తెలీనివారు అనే అర్థంలో 'జెంటూస్' అని పిలవడం మొదలు పెట్టారు.

పోర్చుగీసుల తర్వాత వచ్చిన డచ్‌వారు, ఫ్రెంచివారు, బ్రిటిషర్లు కూడా తెలుగువాళ్ళని జెంటూలని, తమిళుల్ని మలబార్లనీ అదే పేర్లతో వ్యవహరించారు. 18వ శతాబ్దాని కొచ్చేసరికి, తెలుగు వారిలోనూ క్రైస్తవులు పెరగడంతో, జెంటూస్ అనడం ఆపి, తెలుగూస్ అనే అనడం మొదలు పెట్టారు. అంతేకాని, బ్రిటిష్ వాళ్ళు తెలుగువాళ్ళని జంతువులు అని పిలిచారని కొంతమంది రాసింది వాస్తవం కాదు.

చెన్నపట్నంతో ప్రారంభించి విశాఖపట్నం వరకూ తెలుగువారి ఓడరేవుపట్నాలు, అంతకు దిగువన వున్నవన్ని మలబార్లుగా, పిలువబడిన తమిళుల ఓడరేవు పట్నాలు, మలబార్ల ఓడరేవుల్లోకి జెంటూలుగాని, జెంటూల ఓడరేవుల్లోకి మలబార్లుగాని వచ్చేవారు కాదనీ, ఈ ఇద్దరి మధ్య జాతి వైరం ఉందనీ, ఈ తుఫాన్ కథ మనకు తెలుపుతోంది.

చెన్నపట్నం దగ్గరి తెలుగు కూలీలు తమిళ ప్రాంతానికి వెళ్ళడానికే సాహసించక పోయేసరికి, చచ్చినట్టు, బ్రిటిష్ వాళ్ళే తెల్లజెండా ఎత్తుకుని భిక్షాటనం చేస్తూ వెళ్ళారని ఈ కథ చెప్తోంది.

తెలుగువారి నగరం చెన్నపట్నం అనడానికి ఈ బ్రిటీష్ వారి రికార్డులు కన్నా మించిన సాక్ష్యాలు అక్కరలేదు. ఆ వచ్చిన కూలీలు అరవలే అయినట్లయితే, మరో అరవ ప్రాంతానికి వెళ్ళడానికి ఎందుకు సంకోచిస్తారని వెంకటప్పగారు చెన్నపట్నం తెలుగు పట్నం అనే పుస్తకంలో రాశారు. ఈ పుస్తకం 1947లో మద్రాసులోనే అచ్చయింది.

* * * * *

"...వర్షంపు టెవ్వన్ రుజన్ హోవళ్లన్ దిగు నన్య భూప్రజల రాజాయాయి. జాత్యోచితిన్ బ్రోవంగా దగు..." అని ఆముక్త మాల్యదలో- "ఆశ్రయించి వచ్చిన అన్యదేశీయుల్ని జాతి ఔచిత్యాన్ని బట్టి ఆదరిచడం రాజనీతి-" అని కృష్ణదేవరాయలు స్వయంగా పేర్కొన్నాడు.

ఈ ఒక్కసాక్ష్యం చాలు, విజయనగర సామ్రాజ్యపు రాజనీతిలో పోర్చుగీసులతో ప్రారంభించి, బ్రిటిష్ వారి వరకూ తమను ఆశ్రయించిన వారిని ఆదరించడమే లక్ష్యంగా పెట్టుకున్నారనడానికి, అందువలన భవిష్యత్‌లో పేనుపెత్తనం సాగిస్తారని బ్రిటిష్ వాళ్ళ గురించి అనుమానించే ఆస్కారం లేదు వాళ్ళకి! అలాంటి అనుభవం కూడా లేదు. ఆనాటి విజయనగరం పాలకులకి!

మొఘలు చక్రవర్తులు శౌర్యంతోనూ, దౌష్ట్యంతోనూ దేశాధికారాన్ని ఆక్రమించారే కాని, వ్యాపార స్థావరాలు ఇవ్వమని అర్జీలు పెట్టుకుని వచ్చిన వాళ్ళుకాదు. వీరికీ వీరికీ మౌలిక తేడా.

అయితే, అప్పటికే గోవా రాష్ట్రాన్ని స్వాధీనం చేసుకున్న బుడత గీచుల కథ, పుదుచ్చేరిని స్వాధీనం చేసుకున్న ఫ్రెంచివారి కథ, పుదుచ్చేరిని స్వాధీనం చేసుకున్న ఫ్రెంచివారి కథ విజయనగర పాలకులకు కనువిప్పు కలిగించక పోవడమే భారత చరిత్రకు జరిగిన పెను అపకారం!! అందుకు మూల్యం చెల్లించింది మూడు వందల సంవత్సరాలపాటు భారతీయ తరాలు!! ఈ నాటికి మనల్ని వదలని భావదాస్యం దీని పుణ్యమే!! చరిత్ర నేర్పుతున్న పాఠాల్ని నేర్చుకోవడానికి సిద్ధంగాలేని నేటి పాలకులు విజయనగర ప్రభువులు చేసిన తప్పిదాన్నే చేస్తున్నారు.

సముద్రం వెంబడీ, షుమారు 20మైళ్ళ పొడవు ఐదారు మైళ్ళ వెడల్పు కలిగిన పట్టణం, తండియార్‌పేట, రాయపురం, జార్జిటౌన్, చింతాద్రిపేట, మైలపూరు, మంగలబాకం, మాంబళం... ఇవి ఈ మహానగరం ఏర్పడక మునుపే అక్కడున్న చిన్న

చిన్న పల్లెలు. ఇవన్నీ కలిసి ఈ మహానగరం ఏర్పడింది. కోడంబాకం, సైదాపేట, అడయారు ఇవన్నీస్వాతంత్ర్యం వచ్చిన తరువాత మద్రాసు నగరంలో కలిసిపోయి పేటలుగా మారిన వూళ్ళు. 1931లో గ్రేటర్ మద్రాస్ ప్లాన్‌ని ఆమోదించిన తర్వాత ఇలా ఎక్కువ పేటలు ఏర్పడ్డాయి. వీటిలో తెలుగు వారి వూళ్ళూ వున్నాయి. తమిళుల వూళ్ళూ వున్నాయి.

ఈనాటి మద్రాస్ నగరం వరకూ వున్న ప్రాంతం అంతా వేలూరు రాజా నరసింహ పెద్దభార్య ఓబియమ్మకు అరణంగా వచ్చిన ప్రాంతం. (కొండమ్మ అనే పేరు కూడా కన్పిస్తుంది). ఆవిణ్ణి పాలకావేరి రాణీ అని పిలిచేవాళ్ళు. చాలా కాలం ఆవిడ బ్రిటిష్ వాళ్ళకు ప్రవేశాన్ని తిరస్కరించి, పుల్‌కాట్‌లో అడుగు పెడితే వూరుకోనని హెచ్చరించింది కూడా. ఆమె దేశభక్తిని మనం తలచుకొంటున్నామా ఎప్పుడైనా?

విజయనగర సామ్రాజ్యపు అంతేవాసిగా వున్న ఉదయగిరి చక్రవర్తి నరసింహరాయలు ఒక బంగారు రేకు మీద బ్రిటిష్ వారికి పులికాట్‌లో అనుమతి మంజూరు చేస్తూ రాసిన పత్రాన్ని తీసుకొని మిస్టర్ ఫ్లోరిన్ అనే కంపెనీ అధికారిని వెంటపెట్టుకుని 'వెంగలి' అనే ప్రతినిధి వేలూరు సంస్థానానికి వచ్చినట్లు బ్రిటిష్ రాకార్డుల్లో వుంది.

వేలూరు సామంతరాజు వెంకటపతి రాయలుకు చంద్రగిరి సార్వభౌముడి ఆజ్ఞను పాలించక తప్పలేదు. సకల రాజమర్యాదలు చేసి, ఫులికాట్ ప్రాంతంలో తమకు అనువైన చోట స్థావరం ఏర్పరచుకోవడానికి అవకాశం కల్పించాడు. పాలకావేరి రాణికి కూడా ఎదురు మాట్లాడే అవకాశం లేకపోయింది.

ఇది జరిగింది 1611జులై 29న, నాలుగు నెలలు తిరక్కుండానే, అక్టోబరు 25న, వేలూరురాజు వెంకటాద్రి నాయుడు అకస్మాత్తుగా మరణించాడు. పులికాట్ రాణి ఓబియమ్మ సహగమనం చేసింది.

దాంతో బ్రిటిష్ వాళ్ళకి పులికాట్‌లో స్థావరం ఏర్పరచుకునే ధైర్యం చాల్లేదు. రాణిని, రాజునీ మోసగించి, పై నుంచి ఫర్మానాలు, సిఫార్సులతో బ్రిటిష్ వాళ్ళు ఇక్కడ చేరాలనే ప్రయత్నంలో వున్నారన్న సంగతి ప్రజలకు తెలిసిపోయింది.

ఈ కారణంగానే మద్రాసు ఓడరేవు సంగతి అలా వుంచి- మచిలీపట్నం ఓడరేవుని తమ స్థావరంగా ఏర్పరచుకోవాల్సి వచ్చింది. బ్రిటిష్ వారికి,.

బ్రిటిష్ వాళ్ళు ఎక్కడికివెళ్ళినా ఫ్రెంచి, డచ్చివారితో పోరాటాలు, పోటీలు ఎక్కువ కావడంతో, అడ్డదారుల్లో సుల్తానుల్నీ, రాజుల్ని లోబరుచుకొని తమ ఆధిపత్యం నిలబడేలా బలమైన స్థావరాలు ఏర్పరచుకోవాలనే ఆలోచనలోకి వచ్చారు. నిజానికి ఫ్రెంచి, డచ్చి కూడా చేస్తున్నది అదే!

ఫ్యాక్టరీ అంటే, కేవలం తమ వస్తువులు అమ్ముకునే ఒక స్థావరం అని మాత్రమే అర్థం. మచిలీపట్నంలో ఫ్యాక్టరీని నిర్మించి ఫ్యాక్టర్‌లను నియమించుకునారు. అంటే, అక్కడ వాణిజ్య కూడలిని ఏర్పరచుకొని, వ్యాపార ప్రతినిధుల్ని నియమించుకున్నారని, ఈ ఫ్యాక్టర్లు కొనుగోళ్ళు అమ్మకాల వ్యవహారాలు చూస్తారని అర్థం.

ఇలా ప్రారంభమైన "స్థావరం" ఆలోచనలు, మారుతున్న పరిస్థితుల్లో క్రమేణా అధికారుల్ని చేతిలో పెట్టుకొని, పెత్తనం చెలాయించాలనే ఆలోచనకు దారితీసింది. అది కూడా సాధించుకోగలిగాక, అధికారమే చేజిక్కించుకోవాలనే ఆలోచనకు బీజం వేసింది. ఫలితం మూడు వందల సంవత్సరాల దాస్యానికి దేశం బలయిపోయింది.

అడుగు నేలనడిగి దేశం అంతా ఆక్రమించిన బ్రిటిష్ వామన మూర్తులు బుడత కీచుల్ని ఈ విద్యలో మించిపోయారు. బ్రిటిష్ వారి విశ్వరూపాన్ని చూసి, పోర్చుగీసులు, డచ్‌వారు, ఫ్రెంచివారు మౌనంగా నిష్క్రమించారు.

ఇప్పుడు బ్రిటిష్‌వారి ఉక్కుపాదం మచిలీపట్నం నుంచి చెన్నపట్నం వైపు సాగుతోంది...!!

* * * * *

క్రీ.శ. 1639

మద్రాసులో స్థావరం దొరకడమే బ్రిటిష్ మహాయుగానికి నాందీ పలికినట్లయ్యింది.

ఈ విజయాన్ని సాధించినవాడు, ఆంగ్లేయులు ఫొటోకట్టి పూజించుకోవలసిన వాడూ"ఫ్రాన్సిస్ డే..."

అయ్యప్పనాయుడు, అసలు పాలకుడైన తన అన్నగారు వెంకటప్పా (వెంకటాద్రి) నాయుడు (వెంకట **III**) ద్వారా అందించిన దానపత్రం వివరాలు ఈస్టిండియా కంపెనీ రికార్డుల్లో వున్నాయనీ, అసలు పత్రం పోగొట్టుకుంటే దాన్ని అప్పట్లోనే నకలు సృష్టించి స్థానిక పాలకులతో ఎండార్స్ చేయించారనీ అంటారు. సరే, దానపత్రంలో వివరాల పరిశీలన చేద్దాం.

1. మద్రాసుపట్నంలోగానీ, దగ్గరలో ఎక్కడైనా గానీ, బ్రిటిష్ వాళ్ళు ఒక ఓడరేవుని తమ కనుకూలంగా కట్టుకోవచ్చు. దానికి మొదట్లో అయ్యే కొంత ఖర్చుని భరించడం ద్వారా వెంకటాద్రి నాయుడు ఆర్థిక సహాయం చేస్తారు. తర్వాతి ఖర్చంతా వాళ్ళే భరించాలి.
2. ఈ ఓడరేవు పైన ఇంగ్లీషు వారికి పూర్తి అధికారం వుంటుంది.
3. ఓడరేవుని అభివృద్ధి చేసిన కారణంగా కస్టమ్స్ ఇతర రెవిన్యూలలో సగం వాటా ఇంగ్లీషు వారికి వుంటుంది.

4. ఈ మద్రాస్ పట్నం నుంచి సరుకులు ఎగుమతి దిగుమతులు చేసుకోవడానికి ఎలాంటి కస్టమ్స్ డ్యూటీలు వుండవు.
5. అయితే, సరుకుని తమ రాజ్యంలోకి తెచ్చి అమ్మకాలు జరిపేటప్పుడు మాత్రం తగిన రుసుము చెల్లించవలసి వుంటుంది.
6. చేనేత పనివారికీ, డైయింగ్ పనివారికీ బ్రిటిష్ వారు తగిన అడ్వాన్సులిచ్చి ఉత్పత్తి బాగా జరిగేలాగా వారిని ఆదుకోవాలి. బ్రిటిష్ వారిచ్చిన సొమ్ముకు రాజుగా తాను పూచీ వుంటాడు.
7. ఇంగ్లీషు వాళ్ళు తమ స్వంత నిత్యావసరాల కోసం వాడుకునేందుకు కావలసిన సరుకులు కొనుగోలు చేయడానికి అమ్మకం పన్ను మినహాయింపు వుంటుంది.
8. మద్రాసుపట్నం ఓడరేవులో ఆగిన ఏ ఓడకయినా, ఈ ఓడరేవు కారణంగా ఎలాంటి అపకారం జరిగినా, సరుకు పాడయిపోయినా నష్టపరిహారం చెల్లించబడ్తుంది.
9. సముద్రం పొడవునా $3\frac{3}{4}$ మైళ్ళ పర్యంతం బ్రిటిష్ వారు సర్వహక్కులతో ఓడరేవుగా ఉపయోగించుకోవచ్చు.

సముద్రం నుంచి ఒకమైలు పశ్చిమం వరకూ నేలమీద అధికారాన్ని కూడా ఇచ్చాడు. అంటే $1\times3\frac{3}{4}$ చదరపు మైళ్ళ మేర, సముద్రతీరంలో అధికారాన్ని బదలాయించా డన్నమాట!

వెంకటప్పా నాయకుడు ఈ దానపత్రంలో పేర్కొన్న సంగతులు పరిశీలిస్తే మనకు ముఖ్య విషయం ఒకటి తెలుస్తుంది... అది, తమదేశీయులైన చేనేత పనివారి, అద్దకం పనివారి ప్రయోజనాలకోసమే మద్రాసులో ఆంగ్లేయులకు ప్రవేశం కల్పించి, అనేక మినహాయింపులిచ్చారని!అంతేగాని, వారిని ఈ దేశం పెత్తనం చేయించే అంగీకారాలేవీ ఆ దానపత్రంలోలేవు. అలాంటి అనుమానాలు కూడా ఆ నాటికి వాళ్ళలో కలిగివుండవు.

కేవలం డచ్, పోర్చుగీసు వ్యాపారులు స్వలాభాపేక్షతో సాగిస్తున్న వాణిజ్యదోపిడీని నిరోధించడానికి, వారికి పోటీగా ఆంగ్లేయుల్ని ప్రోత్సహించినట్టు స్పష్టంగా కన్పిస్తుంది.

చంద్రగిరి సిహాసనాన్ని 1646లో శ్రీరంగనాయుడు **III** వారసుడుగా వచ్చాడు. అతను మరికొంత భూమిని ఆంగ్లేయులకిచ్చి, అతని పూర్వికులు ఇచ్చిన దానాన్ని సమర్థిస్తూ, కొత్త ఫర్మానా బంగారు రేకుమీద రాయించి ఇచ్చాడు. అంటే, ఈ ఏడేళ్ళ కాలంలో ఆంగ్లేయుల పనితీరు బాగానే వున్నదని మనకు అర్థం అవుతోంది. చేనేత పనివారికి మేలు జరగడమే ఆనాటికి వారి ప్రధాన లక్ష్యం! 140 ఏళ్ళ తర్వాత 1775లో

బ్రిటిష్ వాళ్ళు స్పినింగ్ జెన్నీ మరమగ్గం కనుగొన్న తర్వాత కదా...కథ మారింది? అందాకా, బ్రిటిష్ వాళ్ళు బుద్ధిమంతులే!!

25-10-1639న బందరు నుంచి ఏజెంట్ & కౌన్సిల్ వారు మద్రాసులో స్థావరం సంపాదించుకునే విషయమై తమ ప్రయత్నాల గురించి వివరిస్తూ, దామెర వెంకటప్పా నాయుడు ఆశిస్తోన్న ప్రయోజనాల్ని విశ్లేషించారు.

1. వెంకటప్పనాయుడు ఆంగ్లేయులతో కలిసి విదేశీ వాణిజ్యం చేపట్టడం ద్వారా తన దేశీయులకు చేతినిండా పని దొరుకుతుందని ఆశిస్తున్నాడు.
2. తన కోసం మంచి పర్షియన్ గుర్రాలు కావాలని కోరుకుంటున్నాడు.
3. మన నావికుల సహకారంతో అతను తన స్వంత నౌకని పర్షియా దేశానికి పంపి అమ్మకాలు కొనుగోళ్ళు చేసుకోవాలని కోరుకుంటున్నాడు.
4. మనం మద్రాసులో సురక్షిత కోటని నిర్మించడానికి అతను పూర్తి సహకారాలు అందించగలనని చెప్తున్నాడు. బదులుగా, శత్రువులు తనపై దాడికి పంపి తలపడినప్పుడు ఈ కోట అతనికి రక్షణగా వుండాలని అభిలషిస్తున్నాడు.

ఇలా సాగుతుందా విశ్లేషణ! మరో వంద సంవత్సరాల తర్వాత కదా... ఇప్పుడు వేసుకుంటున్న సామ్రాజ్యవాద, వలస వాదాల పునాదుల మీద ఆంగ్లేయులు పోర్చుగీసుల్ని, ఫ్రెంచి వాళ్ళనీ తలదన్ని, తమ రాజభవనాలు నిర్మించుకున్నారు...! అప్పటిదాకా వారు ఇంచుమించు మంచి బాలురే.

1646లో శ్రీరంగ నాయుడు **III** ఇచ్చిన ఫర్మానాలో కూడా మరికొన్ని ముఖ్య విశేషాలున్నాయి.

1. మద్రాసు పట్నాన్ని తనపేరుతో శ్రీరంగరాయపట్నంగా వ్యవహరించాలని ఆయన కోరాడు.
2. "ఆర్మగాం" ని వదిలివేసి మీరు మా శ్రీరంగరాయపట్నానికి (మద్రాస్‌కు) వచ్చి ఇక్కడ కోట కట్టుకుని వర్తకవాణిజ్యాల్ని ఓడరేవుకు తీసుకువచ్చారు. అందువలన మిమ్మల్ని మరింత ప్రోత్సహించాల్సిన అవసరం, అలాగే, మా పేరుతో వున్న ఈ నగరాన్ని మరింత అభివృద్ధి పరచాల్సిన అవసరం ఎంతయినా ఉంది.
3. మీ కంపెనీ ద్వారా మీరు ఏ వస్తువులు అమ్మకానికి తెచ్చినా, వాటిపైన ఎలాంటి సుంకమూ లేకుండా స్వేచ్ఛగా మీరు వ్యాపారం చేసుకోవచ్చు.
4. ఈ ఓడరేవులో ఇతరేతరా వసూలయ్యే అన్ని సుంకాలలోనూ మద్రాసుపట్నం గ్రామంలో వసూలయ్యే అద్దెల్లోనూ సగం వాటా మీకు ఇచ్చేందుకు అంగీకరిస్తున్నానన్నాడు.
6. అలాగే మీ ఖర్చుల నిమిత్తం ప్రక్కనే ఉన్న నక్కలనేల (Jackal Ground) మీకు దానం చేస్తున్నానన్నాడు.

7. అంతేకాదు, "మీరు మరింత సమర్థవంతంగా వ్యాపార లావాదేవీలు నిర్వహించడం కోసం ఈ నగరం పాలనా బాధ్యతల్ని కూడా మీకే అప్పగిస్తున్నాను." అని ప్రకటించాడు.

8. ఇరుగు పొరుగూ ఎవరైనా ఈ నగరంలో మీకు ఎలాంటి ఇబ్బందులూ కల్గించకుండా మా రక్షణ వుంటుందని హామీ ఇస్తున్నాను. అందుకయ్యే ఖర్చు మీద మీకు ఎలాంటి సుంకం విధించమని కూడా తెలియజేస్తున్నాను.

9. ఈ నగరం పూర్తిగా మా సంరక్షణలోనే వుంటుంది. దీనిపైన పూనమల్లి ప్రభుత్వానికిగాని, ఇతర నాయక రాజులకి గానీ ఎలాంటి అధికారాలూ వుండవు. మీ సరుకులు 'పూనమల్లి' దేశ పాలనలో వున్న ప్రాంతాలకు వెళ్ళినప్పుడు, అక్కడ సుంకాలలో సగం మాత్రమే మీరు చెల్లించే విధంగా అనుమతిస్తున్నాను.

10. ఈ "కౌలు" పైన నమ్మకంతో మీరు సంతోషంగా మీ వర్తకవ్యాపారాలు కొనసాగించండి. మీకు ఎవరివలన ఏవిధమైన అపకారం కల్గినా మీ కష్టనష్టాలు, మీ మంచీ చెడులూ మావిగా భావించి, మీకు న్యాయం జరిగేలా చూడగలము. సూర్యచంద్రులున్నంత కాలం ఈ ఓడరేవు. ఈ కౌలూ నిలిచివుండుగాక.

ఇలా, ఈ ఇద్దరు వెంకటపతి రాయలూ, శ్రీరంగరాయలూ- ఏడు సంవత్సరాల వ్యవధిలో రాయించి ఇచ్చిన దానపత్రాలకు (ఫర్మానా) తర్జుమా ఈస్టిండియా కంపెనీ రికార్డుల్లో వున్నాయని, ఒక పత్రానివే మూడు తర్జుమాలు దొరుకుతున్నాయనీ, ముగ్గురువేర్వేరు అనువాదకులు తర్జుమాచేయించడం వలన కొద్దిపాటి తేడాలతో వున్నాయనీ మద్రాసు చరిత్ర రాసిన పరిశోధకులంటారు.

ఇక్కడ మరీ ముఖ్యంగా గమనించవలసిన అంశం ఏమంటే, ఈ మూడుతర్జుమాలలో రెండింటిలో శ్రీరంగ రాయపట్నం అన్నీ, మూడవదానిలో చెన్నపట్నం అనీ కన్పిస్తుంది.

శ్రీరంగ రాయలు రాజ్యానికి వచ్చిన తొలి రోజుల్లో వూరి పేరు మార్చి తన పేరు పెట్టినా, కాలక్రమంలో, ప్రజలు పాతపేరునే వాడడం దీనికి కారణం కావచ్చు-లేదా, రాజవంశీకుల మధ్య ఏర్పడిన గొడవలు సర్దుమణిగి కొంత ప్రశాంతత ఏర్పడిన తర్వాత మూడో దానపత్రాన్ని శ్రీరంగరాయలే రాయించి వుండవచ్చు. ఇలాంటి వూహాగానాలను చరిత్ర పరిశోధకులు అనేక రకాలుగా చేశారు. మూడొందల అరవై ఏళ్ళ క్రితం సంగతుల్ని ఊహలకు వదిలేయడం తప్ప ఆధారాలు వెదికినందువలన ఇంత వరకూ కొత్తగా వొనగూరిన ప్రయోజనం ఏదీ కన్పించలేదు.

శ్రీరంగరాయల వారు దయచేయించిన రాజశాసనం.

1. ఇది తెలుగు సార్వభౌముడైన శ్రీరంగరాయల వారు దయచేసిన రాజశాసనం.

2. చెన్నపట్నం అనే నగరం...
3. "ఇందలి దేవాదాయ బ్రహోదాయములు అవిచ్ఛిన్నంగా అమలు జరపాలి.
4. మరిన్నీ, ఈ స్థలాన్ని ఎల్లప్పుడునూ తెలుగుపట్నంగా గౌరవప్రపతష్టులలో చూచుకుంటూ వుండవలెను..." ఇలా వ్రాసి వున్నట్లు "చెన్నపట్నం తెలుగుపట్నం" అనే పుస్తకంలో రామచంద్రుని వెంకటప్ప అనే పరిశోకులు రాశారు. తాను తెలుగు సార్వభౌముణ్ణనీ, తన పట్నం ఎన్నటికీ తెలుగు పట్నంగానే గౌరవ ప్రపత్తూలలో వుండాలనీ దానపత్రంలో రాసిన శ్రీరంగరాయని శాసనాన్ని ధిక్కరించింది. ఆంగ్లేయులా... స్వాతంత్ర్యానంతరం చెన్నపట్నాన్ని తమిళపట్నంగా మార్చిన తమిళ కాంగ్రెస్ నేతలా అనే ప్రశ్నని అడిగేందుకు ఈ నాటి తరానికి హక్కుంది. ఏ హక్కును ఆసరాగా తీసుకొని అరవవారు ఆనగరాన్ని కైంకర్యం చేశారో నిలదీసే హక్కుకూడా మనకుంది!

ఇదలా వుంచుదాం...

1648-1649లలో గోల్కొండ సుల్తాన్‌లకీ, ఆరు ఆంధ్రసాగర జిల్లాలోని హిందూ రాజులకీ మధ్య తీవ్రమైన యుద్ధాలు జరిగాయి. కోస్తా ఆంధ్రని అంతవరకూ కరువు రాక్షసి పీడిస్తే, ఆ తర్వాత ఫ్యూడల్ రాక్షసులు పీడించడం మొదలు పెట్టారు. మచిలీపట్నం ఓడరేవు కథ మళ్ళీ మొదటికొచ్చింది. ఈ ఓడరేవు నుంచి ఆంగ్లేయులు వాణిజ్య కార్యకలాపాలు పూర్తిగా నిలిపేయక తప్పని పరిస్థితి ఏర్పడింది.

అప్పటికీ మద్రాసు ఓడరేవు పట్నంలో "ఫోర్ట్ సెయింట్ జార్జి" పేరుతో కోటని నిర్మించి, పటిష్టమైన స్థితికి చేరుకున్న ఆంగ్లేయులు బందరు నుంచి మకాం మార్చేశారు.

ఫలితంగా రెండు లాభాలు కలిగాయి.

1. బందరులో సుల్తానులు పీడవదిలింది. మద్రాసులో హిందూరాజులపైన పెత్తనం చేయడానికి అవకాశం ఏర్పడింది.
2. బందరులో చేనేత పనివారికి ఇవ్వవలసిన లక్షలాది వరహాలు ఎగ్గొట్టి మద్రాసుకు దుకాణాలు తరలించేయగలిగారు. బందరులో చేనేత కార్మికుల బతుకు బజార్న పడింది.

ఒక వరహా అంటే మూడున్నర రూపాయలు, 7 షిల్లింగులతో సమానం... ఆ రోజుల్లో.

అదీ సంగతి!!

# ఇండియాని భూతద్దంలో చూపించిన పోర్చుగీసులు

ప్రాచీన నాగరిక దేశాలు - ముఖ్యంగా ఆసియా దేశాలు భారత దేశానికి ఎంతో రుణపడి ఉన్నాయి. పర్షియా నుంచి చైనా సముద్రందాకా, సైబీరియా మంచుఖండం నుండి జావా బోర్నియోల దాకా...ఇండియా, తన నాగరికతను పంచింది. తన జ్ఞానాన్ని పంపించింది. తన సాహిత్య సంపదను పంచింది. తన ఆధ్యాత్మికతను పంచింది.

అప్పుడు మనం ఇచ్చే అంచున ఉన్నాం. ఇప్పుడు పుచ్చుకునే అంచున (Receiveng end) వున్నాం! 'శతాబ్దాలుగా పరిణమిస్తున్న జీవన చక్రంలో ప్రపంచంలోని నాలుగో వంతు మానవ జాతులు భారతీయత కారణంగానే ప్రభావితులైన వారని 'సిల్వైన్ వెలీ' అనే చరిత్రకారుడు అంటాడు.

'ప్రపంచచరిత్రలో భారతదేశం పోషించిన పాత్రను ఎత్తిచూపించి గణనీయమైన స్థానాన్ని పొందే హక్కు మనకుంది. మనల్నీ, మన చరిత్రని శతాబ్దాలుగా చరిత్రకారులు నిర్లక్ష్యం చేశారు. మానవీయతను వ్యాప్తిచేయడంలో భారతీయులు నిర్వహించిన పాత్రను చాటిచెప్పిఘనమైన దేశాల సరసన భారత్‌ను నిలిపే చర్యలు తీసుకోవాలి...' అని డిస్కవరీ ఆఫ్ ఇండియాలో నెహ్రూ చెప్పిన మాటలు ఆలోచించవలసినదే.

* * * * *

వాస్కోడిగామా భారతదేశానికి సముద్ర మార్గాన్ని కనిపెట్టాడంటున్న కాలం వరకూ ఆఫ్రికా దేశాలతోనూ, ఈజిప్టుతోనూ, ఇరాన్, ఇరాక్‌లతోనూ భారతదేశానికి క్రీస్తుపూర్వం నుంచి సముద్రమార్గాన జరిగిన వర్తక వాణిజ్యాల గురించి తెలిసినా తెలియనట్లే వుంటారు చరిత్రకారులు. ఎవరైనా వాటిని ప్రస్తావిస్తే ఇంకా నిరూపణకావాలి కదా అంటారు. నిరూపించే ప్రయత్నాలు చెయ్యరు. ఇతరులు చేస్తే వాటిని అంగీకరించరు. చరిత్రపరంగా భారతదేశానికి జరుగుతున్న అన్యాయం ఇది!


వాస్కోడగామా

సరే, వాస్కోడిగామాతోనే మొదలుపెట్టి మనమూ కొన్ని విషయాలు ముచ్చటిద్దాం.. వలస రాజ్యాలు స్థాపించుకుని అక్కడి సంపదను కొల్లగొట్టి తమ దేశాన్ని బలోపేతం చేసుకోవాలనే అఖండదేశభక్తి పోర్చుగీసీయులనే బుడతకీచులకే ముందు కలిగింది. ఫ్రెంచి, డచ్చి బ్రిటిషర్లని ఆ మార్గాన ప్రోత్సాహించింది వీళ్ళ చర్యలే.

ఈ చర్యలకు పితామహుడనదగినవాడు పోర్చుగీసు యువరాజు హెన్రీ! ఈయనకు నావికాయనం అంటే, తగని మోజు! సముద్రం మీద ఇతని మనుషులు వెళ్ళినప్పుడల్లా ఏదో ఒక కొత్త ప్రాంతాన్ని చూడటం, కొంత సంపద కొల్లగొట్టుకురావడం చేసేవాళ్ళు. ఇతనిది ప్రధానంగా బానిసల వ్యాపారం. స్వయంగా సముద్రం మీదకు ఎప్పుడూ వెళ్ళలేదట. కానీ, ఇతని వ్యాపారానికి సముద్రం ఆవలిగట్టే హద్దు!

తన వ్యాపారం సజావుగా సాగడం కోసం తన చుట్టూ చాలా మంది మేధావుల్ని పెట్టుకున్నాడు. గణితశాస్త్రవేత్తలు, ఖగోళ శాస్త్రవేత్తలు, వైద్యులు, వ్యాపారులు... ఈ మేధావుల అండతో ఒక పరిశోధనాశాలని కూడా నెలకొల్పాడు. ఆఫ్రికా నుండి ఇండియాకు సముద్రమార్గాన్ని కనిపెడితే, తూర్పుదేశాల సంపదని కైవసం చేసుకోవచ్చుననేది ఇతని కల!

అతని కలలు రూపుదిద్దుకోవడానికి పూర్వమే అతను మరణించినా, 1485లో కాంగోతీరాన్ని, 1487లో కేప్ ఆఫ్ గుడ్‌హోప్‌నీ చేరుకోగలిగారు ఇతని వారసులు.

1498 మేనెల 20వ తేదీన వాస్కోడిగామా 'కొచ్చిన్' ఓడరేవుని చేరి, భారతదేశానికి సముద్రమార్గాన్ని తానే కనిపెట్టినట్లు ప్రకటించుకున్నాడు. 1502లో పోప్ అలెగ్జాండర్ - IV ఇతన్ని సముద్రయానానికి లార్డ్‌గా గుర్తించి గౌరవించారు.ఎందుకంటే, ఆయన కనిపెట్టిన ఇండియా గురించి అప్పుడే ఖండాంతర ప్రజలకు అంతో ఇంతో తెల్సింది కాబట్టి.

పోర్చుగీసీయులు ఇండియాలో కోటానుకోట్లు ఏకఛత్రాధిపత్యంగా సంపాదించేసుకుంటున్నారన్న దుగ్ధ యూరోపియన్ వ్యాపారుల్లో కలకలం లేపింది. ఇండియా సంపదని యూరోపియన్లకు భూతద్దంలో చూపించినట్లయింది చివరికి పోర్చుగీసుల నిర్వాకం!

* * * * *

గోవాని ఆరోజుల్లో 'గోవ రాష్ట్రం' అని పిలిచేవాళ్ళు. అది పోర్చుగీసుల నోళ్ళలో పడి 'గోవా'గా మారింది.

సరిగ్గా ఈ సమయంలో బిజాపూర్ సుల్తాన్ ఆదిల్‌షా దక్కన్‌కు సుబేదార్‌గా వున్నాడు. ఈ గోవా అతని ఆధీనంలో వుంది. ఎక్కడో గోల్కొండ దగ్గరున్న ఆదిల్‌షాకు సమాచారం అందేలోపు ఆల్బుకేరక్ గోవామీద దాడిచేసి, మొదటిగా పంజిమ్ (ఈనాటి పనాజి)ని

సాధించాడు. ఆసియాలో పోర్చుగీసుల మొదటి స్థావరం ఈ పంజిమ్ అయ్యింది. క్రమంగా గోవా రాష్ట్రం మొత్తాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

."గోవా ప్రజలందరికీ ఈ రోజు నుండి పోర్చుగీసు రాజు డామ్ మానుయేలు మాత్రమే ప్రభువు" అని ప్రకటించాడు.


పురాతన గోవా చర్చి

కానీ, సుల్తాన్ ఆదిల్‌షా కొడుకు ఇస్మాయిల్ ఆదిల్‌ఖాన్ ఇది తెలిసి పెద్దపెట్టున సైన్యంతో వచ్చిఆల్బుకేరక్‌నీ అతని బుడతకీచుల గుంపునీ బైటకు గెంటి గోవాని తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. ఈ ఆదిల్‌ఖాన్‌ని పోర్చుగీసులు "ఇడల్కాన్" అని పిలిచేవాళ్ళు. వాళ్ళదృష్టిలో ఇడల్కాన్ చాలా క్రూరుడు.

ఐదు నెలలు తిరక్కుండా అల్బుకేరక్ మరిన్ని ఓడల్లో మందీ- మార్బలాన్ని వెంట బెట్టుకొని వచ్చి, గోవాని మళ్ళీ జయించాడు. ఆ తర్వాత 450 ఏళ్ళ వరకూ పోర్చుగీసుల్నించి గోవాని ఎవ్వరూ తప్పించలేక పోయారు. ఆల్బుకేరక్ గోవాలో ముస్లిం అనేవాడే లేకుండా శాశ్వతంగా నిర్మూలించాడు. రకరకాల వృత్తులు చేసే కార్పెంటర్లు, టైలర్లు, షూ మేకర్లు, వంటవాళ్ళు... ఇలా వయసులో వున్న వివిధ వ్యక్తుల్ని గోవాకు పిలిపించాడు.

పోర్చుగీసుల ఈ గోవా రాష్ట్రంలో ముస్లిం కనిపిస్తే చాలు పనిష్‌మెంట్ పేరుతో చంపించడం, అతని భార్యల్ని, కూతుళ్ళనీ తెచ్చి ఈ పోర్చుగీసు పనివాళ్ళకిచ్చి పెళ్ళి చెయ్యడం- ఇదీ గోవాలో ఆల్బుకేరక్ దినచర్య. అతను హిందువుల జోలికి వెళ్ళనేలేదట! ఎందుకంటే, హిందువులు నల్లగా ఉంటారు. పోర్చుగీసులకు పుట్టేపిల్లలు పోర్చుగీసుల్లా తెల్లగా వుండాలి కదా! హిందూ స్త్రీల మాన, ప్రాణాల్ని వాళ్ళ నల్లనిరంగు అలా ఆ మేరకు కాపాడగల్గింది.

గోవాలో మొట్టమొదటి క్రైస్తవసామ్రాజ్యాన్ని నిర్మించాలనేది ఆల్బుకేరక్ పట్టుదల, పోర్చుగీసీయుల కాలనీగా అది అభివృద్ధిచెందాలనేది ఆయన కోరిక! ఇది జరిగిన ఐదువందల ఏళ్ళ తర్వాత ఈనాటికీ గోవాలో పోర్చుగీసీయుల అలవాట్లు, ఆచారాలు, క్రైస్తవం అన్నీ యథాతథంగా కొనసాగుతూనే వున్నాయి. కానీ, గోవా ప్రజలు మాత్రం అచ్చమైన భారతీయుల్లానే వాళ్ళు జీవిస్తున్నారు. పోర్చుగీసీయులుగా లేకపోవడమే ఇక్కడ ముఖ్యవిషయం!

ఆల్బుకేరక్ అలా నిర్మించిన క్రైస్తవ సామ్రాజ్యానికి విజయనగర రాజులు శుభాకాంక్షలు తెలిపారు. రాయలు మరో అడుగు ముందుకేసి, దక్కన్ సుల్తాన్ "ఇదల్కాన్" తమపైన దాడిచేస్తే సాయపడే బప్పందం మీద గోవా దగ్గరగా వున్న భత్కల్ ప్రాంతంలో పోర్చుగీసులు వాణిజ్య కేంద్రం (ఫ్యాక్టరీ) నెలకొల్పుకోవచ్చని అనుమతినిచ్చాడు.

ఆ తర్వాత ఆల్బుకేరక్‌ని అడ్డుకునే నాథుడే కరువయ్యాడు. మల్బార్ తీరంలో ముస్లింలను సంపూర్తిగా నిర్మూలించాడు. ఎర్రసముద్రంమీద అరబ్బీల ఆధిపత్యాన్ని తొలగించి, పోర్చుగీసుల అధిక్యాన్ని నిలబెట్టాడు. పర్షియన్ గల్ఫ్‌మీద దాడిచేసి ఆర్ముజ్‌ని స్వాధీనం చేసుకున్నాడు. అక్కణ్ణించి అరేబియా గుర్రాల్ని ఓడలపైన తెచ్చిగోవాని ఆసియా లోనే పెద్ద గుర్రాల మార్కెట్‌గా అభివృద్ధి చేశాడు. గోవాలో వున్న కర్మాగారాలు, ఆయుధాగారాలు, షిప్‌యార్డులు, నాణాలముద్రణా కేంద్రాలు వజ్రాలతోపాటు ఆసుపత్రుల్ని కూడా ఏర్పాటుచేశాడు. ఆసియాలో క్రైస్తవ మిషనరీ మొదటి హాస్పిటల్ ఈ గోవాలోనే ఏర్పాటయింది.

ఇంత అభివృద్ధిని గోవాలో ఆల్బుకేరక్ వంటిచేత్తో సాధించాడు- అతని శత్రువులకి ఇది కంటకింపుగానే వుండేది. పోర్చుగీసు ప్రభువు మాన్యుయేలుతో సంబంధం లేకుండా ఇదంతా ఆల్బుకేరక్ స్వంత వ్యవహారంగా అయిపోయిందనీ, తానే పోర్చుగీసు ప్రభువుగా చెప్పుకొంటున్నాడనీ అంత:శత్రువులు రాజుకి ఆల్బుకేరక్ పైన రకరకాలుగా నూరిపోశారు. రాజు తక్షణం ఆల్బుకేరక్‌ని గవర్నర్ పదవిలోంచి తప్పించాడు.

అప్పటికే ఆల్బుకేరక్ ఆరోగ్యం బాగా దెబ్బతింది. అనేక యుద్ధాల్లో తగిలిన గాయాల నుంచి ఆయన కోలుకోలేకపోయాడు. గోవాకు బైట, సముద్రం ఒడ్డునే వున్న ఒక ఓడలో 1515లో ఆల్బుకేరక్ మరణించాడు.

ఈ లోగా పోర్చుగల్ రాజు తన తప్పు తెలుసుకొని ఆల్బుకేరక్‌ని తిరిగి గవర్నర్‌గా నియమించడం జరిగింది. కానీ, ఈ ఆదేశాలు అందేసరికే ఆయన మరణించాడు. ఆల్బుకేరక్ వీలునామా ప్రకారం అతని భౌతిక కాయాన్ని గోవాలోనే ఖననం చేశారు. కానీ, చనిపోయే ముందు, పోర్చుగీస్‌లోని తన జన్మభూమికి చేరాలనే కోరిక వ్యక్తపరచినట్లు తెలిసి 50 ఏళ్ల తర్వాత సమాధిలోని అతని అవశేషాల్ని పోర్చుగల్ తరలించారు.

వేలమైళ్ల దూరంలో ఒంటిచేత్తో ఆగర్భ శత్రువులైన ముస్లింలు పాలించే దేశంలో ఒక గొప్ప క్రైస్తవ రాజ్యాన్ని నిర్మించి, 450 సంవత్సరాలు పోర్చుగీసుల ఆధీనంలోనే అది వుండేలా గట్టి పునాదులు వేసిన విజేత ఆల్బుకేరక్ కథ గోవా చరిత్రలో ముడిపడి సాగింది.

ఆనాటి గోవాకి దక్షిణాన్నుంచి బీజాపూర్ దక్కన్ సూల్తానులు పైనుంచి మొఘల్ చక్రవర్తి ఇంకా అనేకమంది ముస్లిం పాలకులు, అవతల సముద్రంమీద అరబ్బీలతో నిత్య

పోరాటాలు... ఇంత వ్యతిరేకత చుట్టూకమ్ముకొని వున్నా, గోవాలో ముస్లింలు లేకుండా ఊచకోత ఎలా కోయగలిగాడు ఆల్బుకేరక్ అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం.

ఒక కోణంలోంచి కన్పించే వాస్తవం ఏమంటే మొగలాయి చక్రవర్తులుగానీ, సామంతరాజులు గానీ, ఉన్నతాధికారులుగానీ, సుల్తాన్‌లుగానీ, అత్యధిక శాతం విదేశీయులే కావడంతో, ముస్లింలుగా మారిన భారతీయులపట్ల వారికి గల చిన్నచూపు కారణంగానే ఆల్బుకేరక్ ఈ ముస్లిం నరమేధానికి సాహసించి వుంటాడనిపిస్తుంది.

* * * * *

క్రీ.శ. 1498

ఆఫ్రికా క్రింది అంచున వున్న కేప్ ఆఫ్ గుడ్‌హోప్‌ని చుట్టుకుంటూ కొచ్చిన్‌కు చేరిన వాస్కోడగామా, తనను కలిసిన వారికి చెప్పింది. ఒక్కటే- 'ఇండియా నుంచి మాకు రెండు కావాలి- ఒకటి క్రైస్తవులుగా మారే భారతీయులు. రెండు భారతదేశపు సుగంధద్రవ్యాలు. - అనీ.




ఇండియాలో పోర్చుగీసులకన్నా పూర్వమే అబిసీనియన్లు వ్యాపారం చేసేవారు. ఈ అబిసీనియన్లు ఇండియాలో క్రైస్తవమతమే లేదని చెప్పిందినమ్మి, ఆ మిషతో ఇక్కడికి బయల్దేరారు- ఈ విధంగా పోర్చుగీసులు.

కానీ, పోర్చుగీసులకు కొచ్చిన్‌లో మొదటగా ఎదురయింది క్రైస్తవులే. ఈ క్రైస్తవుల్ని చూసి నిర్ఘాంతపోయాడు వాస్కోడగామా.

కొచ్చిన్‌లోని ఈ క్రైస్తవులు క్రీస్తు శకం 4వ శతాబ్దినాటికే, పాలస్తీనా ప్రభావంతో క్రైస్తవులుగా మారినవారి సంతతి! అంటే తొలినాటి క్రైస్తవానికి సంబంధించిన వాళ్ళన్నమాట! వీళ్ళని నెస్టోరియన్ సిరియన్ క్రిస్టియన్లంటారు. అంటే సాంప్రదాయక శుద్ధ క్రైస్తవులని!

నిజానికి, యూరోపియన్లకు ఎంతో ఇష్టమైన సుగంధద్రవ్యాల్ని అరబ్బ్‌లు హిందూ మహాసముద్రంలోంచి ఎర్రసముద్రంలోకి- అలెగ్జాండ్రియా మీదుగా వెళ్ళి తురుష్కులకి అమ్మేవాళ్ళు. తురుష్కులు వెన్నీస్ నగరానికి తీసుకుపోయి అక్కడ అమ్ముకునే వారు. అక్కణ్ణించి వెనీస్ మర్చెంట్‌లు యూరోప్ అంతా యాలకులు, మిరియాలు, లవంగాలు, దాల్చినచెక్క...వగైరా భారతీయ అటవీసంపదని అమ్ముకునే వాళ్ళు.

ఇలా, కొన్ని తరాలుగా అప్రతిహతంగా సాగుతున్న ఈ వ్యాపారంలోకి పోర్చుగీసులు మొదటిసారిగా 1498లో ప్రవేశించారు. రాగి, వెండి, బంగారం ఇచ్చి, బదులుగా సుగంధద్రవ్యాలు, కాటన్ బట్టలు, నీలిమందు కొనుగోలు చేయడానికి రంగం సిద్ధం అయింది. ఓడల్లోనే వుండి వ్యాపార లావాదేవీలు నడిపేళ్ళు. అరబ్బ్ వ్యాపారుల్ని దెబ్బకొట్టి భారతీయుల్నించి నేరుగా వీటిని ఓడల్లోకి తెప్పించుకోవాలనేది వాళ్ళమొదటి పథకం! "అఫోన్స్ ఆల్ బుకేరక్" భారతదేశానికి పోర్చుగీసు గవర్నరుగా ఓడలో బయల్దేరి వచ్చాక 1505లో ఈ వ్యాపారం పదింతలయ్యింది.

క్రీ.శ.1510-

'తిమోజా' అనే భారతీయుడు అరబ్బుల ఆనుపానులన్నీ బాగా ఎరిగినవాడు. ఆల్బుకేరక్ అతన్ని చేరదీశాడు. ఈ 'తిమోజా' ఆల్బుకేరక్ దృష్టిని గోవా మీదకు మళ్ళించి, దీన్ని జయించి స్వాధీనం చేసుకుంటే, మల్బార్ సముద్రతీరం పొడుగునా ముస్లింలు అనేవారు లేకుండా చెయ్యవచ్చునని హితోపదేశం చేశాడు. అలా మొదలయ్యింది పోర్చుగీసుల కథ. తిమోజా తిమ్మరుసు ఏజెంట్ అయివుంటాడనీ, తమ శత్రువుల మీదకు ఈ విధంగా పోర్చుగీసుల్ని ఉసిగొలిపి కాగలకార్యం వారి చేత చేయించాడనీ అంటారు.

## 'భారతీయులపై పోర్చుగీసులు విధించిన జుత్తు పన్ను కథ'

ఒక చేత్తో శిలువనీ, ఇంకోచేత్తో కత్తినీ పుచ్చుకుని భారతదేశంలోకి వ్యాపారం నెపంతో వచ్చిన పోర్చుగీసులు భారతీయులకు చేసిన అవమానాల్ని చరిత్ర మరిచిపోలేదు! మరిచిపోకూడదు కూడా!! గోవా చరిత్రలో ECCLESIASTICAL తరహాలో అందించిన పోర్చుగీసుల అవమానకర పాలన 1705 నుంచీ 1840 వరకూ చీకటి అధ్యాయమే! బ్రిటిషర్ల దురంతాలకూ పోర్చుగీసులకూ పోలికేలేదు. పోర్చుగీసులవి రాక్షసాలు, పైశాచికాలు కూడా!

ఇంతకీ, ఎక్లెసియాస్టికల్ పాలన అంటే, మొత్తం అధికారాన్ని క్రైస్తవ మిషనరీలకు అప్పగించడం అని నిఘంటు అర్థం. క్రైస్తవ మత ప్రచారానికే భారతదేశంలోకి వస్తున్నాం అని చెప్పి మరీ వచ్చిన పోర్చుగీసులు, భారతీయుల్ని క్రైస్తవంలోకి రప్పించడం కోసం ప్రయోగించిన హింస, కల్గించిన అవమానాలు దారుణమైనవే!

1704-1841 మధ్యకాలంలో పోర్చుగీసులు గోవాని పాలించిన తీరు గురించి స్టడీస్ ఇన్ ద ఫారిన్ రిలేషన్స్ ఆఫ్ ఇండియా అనే గ్రంథంలో రెవరెండ్ టి.ఆర్.డిసౌజా "The XENDDI TAX" అనే వ్యాసం రాశాడు. ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కయివ్స్ వారు ఇతిహాస్ జర్నల్‌లో ఈ వ్యాసాన్ని ప్రచురించారు. ఈ వ్యాసంలో రెవరెండ్ డిసౌజా కొన్ని ఆశ్చర్య కరమైన వాస్తవాల్ని వెలువరించాడు. గోవాలో హిందువుగా చావడం కన్నా క్రైస్తవుడిగా బతకడం మంచిదనే నిర్ణయాన్ని భారతీయుల్లో వ్యాపింప చేయడం లక్ష్యంగా పోర్చుగీసులు పాలించారు అనేది అందులో ముఖ్యమైన అంశం. మొదట ముస్లింలుగా మారిన భారతీయుల్ని, హిందువుల్ని వేధించడం ప్రారంభించారు. వేధించడం అంటే, కర్కశంగా చంపడమే!

1498లో పోర్చుగీసులు భారతదేశంలోకి ప్రవేశించారు. 1505లో గోవాలో పోర్చుగల్ పాలనని ప్రారంభించారు. అక్కణ్ణించి పోర్చుగల్ వ్యాపారులకు ఎదురులేని స్థితి ఏర్పడింది. అంతకుమునుపు బలహీనంగా వున్న పోర్చుగల్ రాజు 1700 సంవత్సరం వచ్చేసరికి బాగా బలసంపన్నుడయ్యాడు. క్రైస్తవ మిషనరీలు రాజు దగ్గర తమ పలుకుబడిని చెలాయించసాగాయి. దాని ప్రభావం భారతదేశం పైన ప్రసరించింది. పోర్చుగల్ క్రైస్తవుల కేంద్ర స్థానం అయ్యింది గోవా.

పోర్చుగల్ మిషనరీల్లో వయసులో చిన్నవాళ్ళు, తీవ్రవాద మనస్తత్వం కల్గిన వాళ్ళు ఆ రోజుల్లో ఎక్కువ. రాజు దగ్గర వారికున్న పలుకుబడితో గోవాను పాలించే రాజ ప్రతినిధుల్ని

(వైస్రాయిలు) బెదిరించి తమ గుప్పెట్లో పెట్టుకునే ప్రయత్నాలు చేశారు. దాని ఫలితమే దాదాపు 135 సంవత్సరాలపాటు హిందు వ్యతిరేక పరిపాలనని చవి చూడవలసి వచ్చింది.

ఆనాటి యువ పోర్చుగల్ క్రైస్తవ మతాధిపతులకు హిందువు అంటే అసహ్యం. వాళ్ళు నెత్తిన 'సిగ' పెట్టుకోవడం, పంచ కట్టుకోవడం, గంధం బొట్టు పెట్టుకోవడం... ఇవన్నీ చాలా ఇబ్బంది కల్గించే విషయాలుగా వుండేవిట!

వీళ్ళ మూలాన క్రైస్తవమతంలోకి మతమార్పిడి పొంది వచ్చేవాళ్ళకి, వచ్చిన వాళ్ళకీ చాలా ఇన్ కన్వీనియంట్‌గా వుందని ఒక మతాధికారి పోర్చుగల్ రాజుకు ఉత్తరం రాశాడు. వీరు పంచకట్టుకుంటే, వారికి కలిగే ఇన్‌కన్వీనియన్స్ ఏమిటో అర్థం కాదు-

1567లో గోవాలో ఎక్లేసియాస్టికల్ కౌన్సిల్‌ని ఏర్పాటు చేసి దాని నేతృత్వంలో గోవా పాలన జరిగేట్లు చేశారు. ఈ ఎక్లేసియాస్టికల్ కౌన్సిల్ చర్చికి మాత్రమే బాధ్యత వహిస్తుంది. రాజుకుగాని, ఎన్నికయిన ఏ ఇతర సంస్థలకు గానీ అది జవాబు చెప్పుకోవాల్సిన పనిలేదు. ఎక్లేసియాస్టికల్ సొసైటీ వాళ్ళు ఈ విధమైన వేషధారణలో వుండే హిందువులన్నా, మెళ్ళో జంధ్యం వేసుకున్న బ్రాహ్మణులన్నా చాలా అసహ్యించుకొని వేధించడం అక్కడొక నిత్యకృత్యంగా వుండేది.

నెత్తిమీదకి జుట్టంతా తెచ్చి నారదుడి తలకట్టు లాగా గుండ్రంగా 'శిగ' చుట్టు చుట్టుకొనేవాళ్ళు ఆ రోజుల్లో గోవాలో హిందువులైన మగవాళ్ళు. ఈ రకం వేషాన్ని వదులుకోవలసిందిగా ఆదేశించారు. వదులుకోలేనివారు జుత్తుమీద పన్ను చెల్లించాలని ప్రకటించారు. ఔరంగజేబు ఇలానే 'జిజియా పన్ను' విధించాడు. దాన్నే "జిండ్డీ పన్ను ("XENDDI TAX") అన్నారు పోర్చుగీసులు. క్రమేణా ఈ జుత్తు పన్నుని భారతీయులైన ముస్లింల మీద కూడా విధించారు. వాళ్ళు అసహ్యంగా గడ్డం పెంచుకొంటారు కాబట్టి దానిపైనా "పన్ను" అన్నారు. నిజానికి వాస్కోడగామా గాని, అల్బుకేరక్‌గాని, ఇంకా ఇతర పోర్చుగల్ ప్రముఖులంతా గడ్డంతో వున్నవారే! అయినా, ముస్లింల గడ్డం అంటే వాళ్ళకి అసహ్యం.

ఎక్లేసియాస్టికల్ కౌన్సిల్ హిందూ ఆచారాల్ని అదుపులో పెట్టడం కోసం కొన్ని "డిక్రీలు" చేసింది. విగ్రహారాధన మంచిది కాదంది. గంధం బొట్టు పెట్టుకుని మగవాళ్ళు రోడ్డు మీద తిరగకూడదని పేర్కొంది. "ఒంటిమీద ఆ విభూది మార్కులేమిటీ... అసహ్యంగా!" అనేవాళ్ళు. సిగతరిగిన వాడికి గౌరవం ఇచ్చేవాళ్ళు. క్రైస్తవుడిగా మారిన వ్యక్తి క్రైస్తవుడు కాని హిందూ క్షురకుడితో తల పని చేయించుకోకూడదని ఒక నియమం పెట్టారు. "పోర్చుగీసు బార్బర్లుండగా ఆ హిందూ మంగలితో నీకేంపని అని?" అడిగేవాళ్ళు.

15-16 శతాబ్దాలు ఆయుర్వేద శాస్త్రానికి కూడా క్షీణయుగమే! ఆయుర్వేద వైద్యుణ్ణి 'కవిరాజు' అని పిలిచేవారు. ఈయన నాడి చూసి పరీక్షించి మూలికలతోనూ రసౌధాల

తోనూ వైద్యం చేసేవాడు. కానీ గాయాలు తగిలినప్పుడు దుష్ట వ్రణాలు తొలగించేందు కోసం వైద్యం చేసేవాడు కాదు. అలాంటివన్నీ చిన్న శస్త్ర వైద్యుడిగా ఆ గ్రామంలో నాయీ బ్రాహ్మణుడు తోడ్పడేవాడు. అతని భార్య పురుళ్ళు పోసేది. అందుకని, వైద్యుడు రాజైతే, క్షురకుడు 'మంత్రి' అనీ, అతని భార్యని "మంత్రసాని" అనీ పిలిచేవాళ్ళు. ఇది కాక, నాయీ బ్రాహ్మడు హిందూ మతానికి చెందిన పెళ్ళిళ్ళు, పేరంటాళ్ళు, వూరేగింపులు, ఉత్సవాలన్నింటిలో ప్రముఖపాత్ర పోషిస్తాడు. అందుకని హిందూ క్షురకుల మీద కూడా పోర్చుగీసులు తమ ఏహ్యాన్ని ప్రదర్శించారు.

జుట్టు పన్ను కట్టినా సరే తలపాగా విధిగా ధరించాలని ఉత్తర్వులు చేశారు- నెత్తిన సిగ కన్పించకుండా వుండాలని! బ్రాహ్మలు జంధ్యాన్ని లోపలే దాచుకోవాలి. బైటకు ప్రదర్శించకూడదన్నారు. చొక్కా లేకుండా తిరగకూడదన్నారు!

1606లో ప్రొవిన్షియల్ కౌన్సిల్ ఇలాంటి నేరాలకు, 50 సర్దారులు- అంటే సుమారు 25 రూపాయిలు ఫైన్ కూడా విధించి. క్రైస్తవం తీసుకో! ఈ బాధలన్నీ వుండవు అనేవాళ్ళు. వాళ్ళే అధికారులు, వాళ్ళే ప్రభువులు. వాళ్ళే మతాధిపతులు. ప్రభుత్వానికి, క్రైస్తవానికి తేడా లేకుండా పోయింది. అక్కడ మతమే ముఖ్యం! ప్రభుత్వం దాన్ని అనుసరిస్తుంది... అంతే!

ఒక హిందువు క్రైస్తవం స్వీకరించగానే ఒక జెస్యూట్ బ్రదర్ నెత్తిన 'శిగ' కత్తిరించేసే వాడట. కత్తిరించిన ఆ శిగని ఒక చెట్టుకు వ్రేలాడదీసి, దాన్ని రాళ్ళు పెట్టికొట్టి గేలిచేస్తూ ఆనందంగా నృత్యాలు చేసేవాళ్ళట.

...అప్పటి చీఫ్ రెవెన్యూ కంప్ట్రోలర్ పోర్చుగల్ రాజుకు ఇదంతా వివరిస్తూ ఒక ఉత్తరం రాశాడు. ఇక్కడ కన్వర్షన్ పద్ధతులు చాలా హింసాత్మకంగా వున్నాయనీ, బలవంతంగా మతమార్పిడి చేస్తున్నారనీ, వాళ్ళకి ఇష్టం లేకపోయినా కావాలని ఆవు మాంసం తినిపిస్తున్నారనీ, హిందూమతంలో 'పాపం'గా భావించే పనులన్నీ చేయిస్తున్నారనీ, హిందువుల్ని పెడ్తున్న బాధలకన్నా, క్రైస్తవం పుచ్చుకున్న వాడు పడ్తున్న బాధలు మరీ ఎక్కువగా వున్నాయనీ ఆయన ఆ ఉత్తరంలో పేర్కొన్నాడు. కానీ, రాజు మత పెద్దలకు దాసుడు. ఏ చర్యా తీసుకోలేదు.

గోవాలో 1701 నాటికి పరిస్థితులు మారాయి. ఖజానా అడుగంటి పోయింది. పన్నులు మరింతగా విధించక తప్పలేదు. కట్టగల్గిన వారి మీద ఎక్కువ పన్నులు వెయ్యాలనే అర్థశాస్త్ర నియమాన్ని పాటించాలని నిర్ణయించారు. ఫలితంగా పోర్చుగీసులు 10%, స్థానికులు 5% ఆస్తిపన్ను కట్టాలని ఉత్తర్వులు చేయవలసి వచ్చింది.

దీని మీద పెద్ద దుమారం రేగింది. వైస్రాయి మీద క్రైస్తవ మతాధిపతులు రాజుకు ఫిర్యాదు చేశారు. రాజు మతానికే ప్రాధాన్యత యిచ్చాడు. పోర్చుగీసుల పన్నును 5%గా తగ్గించారు. హిందువుల మీద కొత్త పన్నులు విధించారు. భారతీయులైన మహమ్మదీయుల్ని కూడా జుట్టు పన్ను పరిధిలోకి తెచ్చారు. స్వర్ణకారుల మీద, రిటైల్ మరియు హోల్‌సేల్ షాపుల మీద, బ్రోకర్ల మీద 3 శాతం పన్ను విధించారు. ఆస్తులు లేని క్రైస్తవుల్ని పన్నులోంచి మినహాయించారు.

హిందువుల్లో ఆస్తులు లేని రైతు కూలీల్లాంటి బీద ప్రజలు తమ పైన విధించిన జుట్టు పన్నుకు కూడా ఇలానే మినహాయింపు ఇవ్వాలని కోరారు. 1732లో ఈ విషయమై తర్జనభర్జన జరిగింది. జెండ్డీ పన్ను జుత్తు మీద వేసిందిగానీ, ఆస్తిమీద కాదు కాబట్టి జుట్టు పెంచుకున్నందుకు పన్ను కట్టాల్సిందేనని తీర్మానించారు.

పన్నులు వసూలు చేసి పెట్టేందుకు మహాజన్‌ల వ్యవస్థ వుండేది ఆ రోజులలో! 'మాజన్స్' అనే వాళ్ళు ఈ పన్ను కలెక్టర్లుగా వుండేవాళ్ళు.

1734లో ఆ మహాజన్లని తొలగించి పోర్చుగీసు కలెక్టర్లని నియమించారు. పన్నులు ఎవరికి వాళ్ళే స్వచ్ఛందంగా కట్టాలన్నారు. 7000 నుంచి 10,700 వరకూ పన్నుల వసూలు మొత్తాన్ని పెంచారు. కర్కువా, సిద్దాలో అనే రెండు గ్రామాల ప్రజలు తిరుగుబాటు చేశారని, వారిని క్రూరంగా అణిచేశారు. హిందువు హిందువుగా వుండకూడదనే ఖచ్చితమైన నిర్ణయాన్ని అమలుపరిచారు.

1840 డిసెంబర్ 18న గవర్నర్ జనరల్ పరిస్థితిని సమీక్షించి, హిందువుల ఆధిక్యాన్ని దాదాపుగా హరించి వేయగలిగామని, గోవాని క్రైస్తవ రాజ్యంగా మార్చగలిగామనీ ప్రకటించాడు.

వచ్చే జనవరి 1 నుంచీ జుత్తు పన్ను కట్టేవాడే లేకుండా చేశామన్నాడు. అయినా, హిందువుల్ని క్రైస్తవులుగా మార్చడంలాంటి చిన్న విషయానికి ఇంత క్రూరమైన, హేయమైన, హాస్యాస్పదమైన రీతిలో వ్యవహరించవలసిన అవసరం లేదని కూడా అన్నాడు. అయితే, పోర్చుగల్ జాతీయులు గానీ, క్రైస్తవులు గానీ భారతీయతకు కల్గించిన అవమానం పట్ల ఆవగింజంత విచారం వెలిబుచ్చలేదు. తాను కాబట్టి జాలి తలిచి వదిలేస్తున్నట్లు ప్రకటించాడు.

ప్రభుత్వ పాలనాయంత్రాంగం వ్యవహారాల్లో 'మతం' జోక్యం చేసుకున్న ప్రతిసారీ ఇలానే జరిగింది. క్రైస్తవం, ఇస్లాం మతాలేకాదు శైవం, వైష్ణవం, ఆఖరికి జైనం, బౌద్ధం కూడా పాలనా వ్యవహారాల్లో తలదూర్చిన సంఘటనలే భారతదేశంలో ఎక్కువ!!

# విదేశీయులతో మొఘల్ చక్రవర్తుల స్వదేశీ పాలన


జహంగీర్, అక్బర్, షాజహాన్

క్రీ.శ.1526 నుంచి 1707 :

బాబర్‌నుంచి, మొఘల్‌సామ్రాజ్య విధ్వంసకుడు ఔరంగజేబు దాకా... వీళ్ళంతా ఏనాడూ ఈ దేశపు చక్రవర్తులుగా గానీ, ఈ దేశీయులకు పాలకులుగా గానీ వ్యవహరించిన పాపాన పోలేదంటారు. చరిత్ర విషయాలెరిగిన పండితులు.

మధ్యలో అక్బర్ ఒక్కడే... ఈ మొఘల్ చక్రవర్తుల్లో భారతీయులు అత్యధికంగా గౌరవించే వ్యక్తి...కొంతలో కొంత స్వదేశీ... మిగిలిన వాళ్ళంతా ఈ దేశాన్ని పాలించే విదేశీయులుగానే మెలిగారు.

విదేశీయుడు వచ్చి ఈ దేశపు సంపదని కొల్లగొట్టుకుని తన దేశానికి తీసుకుపోయినా, ఈ దేశీయుడే ఈ దేశాన్ని కొల్లగొట్టి ఆ డబ్బుని విదేశాల్లో దాచుకున్నా పెద్ద తేడా ఏమీ వుండదు. మొఘల్స్ నుంచి బ్రిటిషర్ల దాకా చేసింది అదే! వీళ్ళు మొదటి కోవకు చెందుతారు. నేటి స్వతంత్ర భారతంలో మేటి పాలకులు చాలామంది రెండో కోవకు చెందిన పాలకులు అందుకే సగటు భారతీయుడు స్వాతంత్ర్యం పూర్వానికి, స్వాతంత్ర్యం తర్వాతకీ పెద్దతేడా తెలియడంలేదంటే ఎవరూ తప్పు పట్టాల్సిన పనిలేదు.

మెజారిటీ ప్రజలకు అన్యాయమే జరిగినప్పుడు పాలకులుగా వున్న వ్యక్తుల, లేక ప్రభుత్వాల దృష్టి కోణం ప్రజా వ్యతిరేకంగా నడిచిందనేది వాస్తవం.

1526లో బాబర్ చేతిలో ఓటమి పాలైన ఢిల్లీ చక్రవర్తి 'ఇబ్రహీం లోడి' కానీండి, 1530లో బాబర్ తర్వాత అధికారంలోకి వచ్చిన హుమాయున్ కానీ అతని తరువాతి షేర్‌షాగానీ, 1545లో తిరిగి అధికారంలోకి వచ్చిన హుమాయూన్ గానీ, ఈ కోవలో ప్రయాణించినవాళ్ళే! నవంబర్ 23, 1542న సింధ్‌లోని ఉమర్‌కోట్‌లో జన్మించిన అక్బర్ 1556 జనవరిలో హుమాయూన్ మరణం తర్వాత అధికారంలోకి వచ్చాడు. ఈ దేశపు పౌరుడిగా, ఈ దేశం బాగోగుల కోసం కృషి చేయాలనే దీక్ష వున్న ఏకైక పాదుషా అక్బర్ మాత్రమేనని ప్రశంసిస్తారు. పరిశోధకులు.

జిజియా పన్ను రద్దు చేసి, హిందూ ముస్లింల మధ్య, ఇతర మతాలమధ్య సయోధ్య సాధించడం కోసం దీక్ష వహించిన వాడు అక్బర్. భారతీయులైన హిందువులకు మొట్టమొదటగా తన ఆస్థానంలో ఉద్యోగాలిచ్చాడు. అయితే, పర్షియా తదితర ప్రాంతాల నుండి తెచ్చుకున్న ఉద్యోగుల సంఖ్య భారతీయులైన ఉద్యోగుల సంఖ్యకన్నా ఎక్కువగా ఉన్నప్పటికీ, ఉద్యోగాల నియామకంలో భారతీయుల్ని కూడా అంతో ఇంతో విశ్వాసంలోకి తీసుకున్నవాడు అక్బర్ మాత్రమే!

అక్బర్ ఆస్థానంలో, 70శాతం ఉద్యోగుల్లో ఎక్కువ పర్షియన్లే. వారి తర్వాత ఆఫ్ఘన్‌లు కొద్దిమంది వున్నారు. కొంతమంది ఇతరదేశాల వాళ్ళూ ఉన్నారు. మిగిలిన 30శాతం మందిలో హిందువులు, భారతీయులైన ముస్లింలూ వుండేవారు!

విదేశీ అధికారుల అండతో అక్బర్ ప్రవేశపెట్ట దలిచింది సుస్థిరమైన మొఘల్ సామ్రాజ్యానికి కావాల్సిన మోడల్ అడ్మినిస్ట్రేషన్ విధానాన్ని...!

ఇక్కడ ఎవ్వరినో తప్పుపట్టవలసిన పనిలేదు. మొఘల్ సామ్రాజ్యం పూర్తిగా పతనమయ్యేనాటికి కూడా వారి ఉద్యోగుల్లో 70నుండి 90శాతం మంది విదేశీయులే వున్నారన్నది ముఖ్యవిషయం.

దక్కన్‌లో అంటే ఈనాటి తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ భూబాగాల్లో మొఘల్స్‌కు సుబేదార్లుగా వ్యవహరించిన నిజాము ఉల్‌ముల్క్‌లాంటి విదేశీయులైన నవాబులు కూడా స్థానికులైన హిందువులకు బదులుగా ఉత్తర భారతదేశంలోంచో, మరో విదేశంలోంచో మహమ్మదీయ ఉద్యోగుల్ని పిలిపించుకున్నారు. స్థానికంగా వున్న మహమ్మదీయులెవర్ని దగ్గరకు చేరదీయలేదు!

నిజాం నవాబుల కాలంలో స్థానికహిందువులకూ, ముస్లింలకూ ఎలాంటి ఉద్యోగ అవకాశాలు ఇవ్వకుండా బైట వారిని తెచ్చి పెట్టడం కారణంగానే, ముల్కీ నిబంధనలు వంటివి ఆ రోజుల్లోనే ఏర్పడ్డాయి.

మనల్ని పరిపాలిస్తూ, మనశిస్తులమీద, మన ఉత్పత్తులమీద జీవించే ఈ సామ్రాజ్యాధీశులు మనల్ని విశ్వాసంలోకి తీసుకోకుండానే కనీసం ఐదువందల ఏళ్ళు పరిపాలించారు... కేవలం మనల్ని! ఇందుకు అక్బర్ కూడా ఏమీ మినహాయింపు కాకపోవచ్చు. ఇక్కడ "మనం" అనడంలో భారతీయులైన మహమ్మదీయులు కూడా వున్నారు.

నిజాం ఉల్‌ముల్క్ (మీరకముద్దీన్) మధ్య ఆసియా నుంచి ఔరంగజేబు సైన్యంలో చేరి వంశానికి మూలపురుషుడయ్యాడు. అతని వ ంశీయులు నిజాం నవాబులుగా స్వాతంత్ర్యం వచ్చేవరకూ ఈ తెలుగునేలని, తెలంగాణాని పరిపాలించగలిగారు.

అలాగే, ఔథ్ నవాబు సాదత్‌ఖాన్ మెసపొటేమియా నుంచి వచ్చి ఔరంగజేబు సైన్యంలో చేరి ఇక్కడ తన రాజవంశాన్ని ప్రతిష్టించాడు.

భారతదేశ చరిత్రలో చివరి 500 సంవత్సరాలు చీకటి రోజులు కావడానికి వీళ్ళంతా కారకులే!

అక్బర్ ఈ వ్యవస్థకు బీజాలు వేసినవాడేకానీ, తొలగించే ప్రయత్నాలు చేసినవాడుకాదు. 1605లో అతని తర్వాత అధికారానికి వచ్చిన జహంగీరు, నిత్య మధుపానమత్తుడు. పాలనావ్యవహారాల్లో రాణి నూర్జహాన్ తరచూ జోక్యం చేసుకుంటూ వుండేది...ట!

'బ్రిటిష్ డొమినియన్ ఇన్ ఇండియా అండ్ ఆఫ్టర్' గ్రంథంలో కులకర్ణి ఈ విషయాలు ప్రస్తావిస్తూ అక్బర్, జహంగీర్ల కాలంలో, విదేశీ వ్యాపారులు భారతదేశంలోకి ప్రవేశించడానికి అంతగా ఆరాటపడటానికి 'ఇక్కడ విదేశీయులకు పెద్ద పీట వేయబడును' అనే సిద్ధాంతం నడుస్తూ వుండటం కూడా ఒక కారణం అంటాడు.

అక్బర్ పోర్చుగీసువాళ్ళని ఎక్కువగా ఆదరించాడు. సర్వమత సమానత్వం పేరుతో ఫా[illegible]డుతున్న ప్రాపకం కోసం పోర్చుగీసు వాళ్ళు క్రైస్తవమతాధికారుల్ని తీసుకువెళ్ళి, [illegible]ంచి కార్యం సాధించుకురావాలని ప్రయత్నించారు.

ఇదంతా గమనిస్తూనే వున్నారు ఆంగ్లేయులు.

ఎలిజబెత్ రాణి తర్వాత రాజు'జేమ్స్-I' నుంచి అక్బర్ పేరుతో ఒక వర్తమానం రా[illegible]చుకుని'విలియం హాకిన్స్' అనే వర్తకుల రాయబారి ఆగ్రా వైపు బయలుదేరాడు. అతని రాకతో భారతదేశం చరిత్ర మరో మలుపు తిరగబోతుంది...

# విజయనగర రాజులు
# పోర్చుగీసులతో కుదుర్చుకున్న ఒప్పందాలు

ఆల్బుకేరక్ గోవాలో పోర్చుగీసుల రాజ్యం వ్యవస్థాపించిన తర్వాత, కృష్ణదేవరాయలు తన రాయబారిని పంపి అర్ముజ్ నుంచి తెచ్చిన గుర్రాలు ఒక వెయ్యి వరకూ కొనడానికి కావాలని, కానీ ఈ గుర్రాల్ని వచ్చినవి వచ్చినట్టు తనకు మాత్రమే అమ్మాలి గాని, ఇంకో రాజు ఎవ్వరికీ ముఖ్యంగా ముస్లింలకు అమ్మకూడదని ఒక బేరం పెట్టాడు.

కృష్ణరాయలు సాయం అభిలాషించిన ఆల్బుకేరక్ ఈ ఒప్పందానికి సరేనని అలాగే అమ్మాడు. మరో మూడేళ్ళు గడిచాయి. 1524లో రాయలు వెయ్యి గుర్రాల కోసం ఆర్డరు పెట్టాడు. అదే షరతు మీద అయితే కొంటానన్నాడు.

ఇదిలా వుండగా పోర్చుగీసులు గోవాని ఆక్రమించుకున్న తర్వాత గోవా మీద ఆశలు పూర్తిగా వదిలేసుకున్న బీజాపూర్ సుల్తాన్ ఆదిల్‌షాకి జ్ఞానోదయం అయ్యింది. రాయలు పోర్చుగీసులకు దగ్గరవడం మరీ ప్రమాదకరం అని గుర్తించాడతను! అందుకని రాయలకన్న పదివేలు ఎక్కువ ధర ఇస్తానంటూ పై బేరానికి వచ్చాడు ఆదిల్‌షా!

ఆల్బుకేరక్ దగ్గర మొదటగా రాయలు కొన్నది వెయ్యి గుర్రాల్ని పదివేలకే! రెండోసారి కొనుగోలుకు ఇరవైవేల వరకూ పెట్టడానికి రాయలు ముందుకొచ్చాడు కానీ, ముప్పై వేలు ఇస్తానని ఆదిల్‌షా ఎదురొచ్చాడు. అదీ పరిస్థితి!

అప్పుడు ఆల్బుకేరక్‌కి అసలు విషయం అర్థం అయ్యింది. ఇండియాలో హిందువులు, ముస్లింలు ఐక్యమత్యం లేకుండా ఇలానే వుంటే, ఈ దేశంలో పదిరూపాయలు వస్తువుని ముప్ఫయి రూపాయలకు అమ్ముకోవచ్చని!

ఆల్బుకేరక్ రాయలుకు చెప్పిన సమాధానం ఇది.

1. బీజాపూర్ సుల్తాన్, "పై పోటీ"కి వచ్చి ఇస్తానన్న పైకం మీరే ఇస్తే ఈ గుర్రాలన్నీ మీకే! సుల్తాన్‌కు వీటిలో ఒక్కటి కూడా అమ్మం.
2. ముప్పై వేల క్రుజడోలకు ధరని నిర్ణయించడం అయ్యింది. ఇప్పటికప్పుడే పైకం చెల్లించి గుర్రాల్ని తీసుకువెళ్ళాలి.
3. వీటిని గోవానించి మీ స్వంత ఖర్చుతో, మీ మనుషుల్నే పంపి మీ స్వంత బాధ్యత మీద మీరే తీసుకువెళ్ళవలసి వుంటుంది.

కృష్ణరాయలకు గజబలం, అశ్వబలాలే ప్రధానం కాబట్టి, అంత ధరకీ సిద్ధం అయ్యాడు-తప్పలేదు.

రాయలు తర్వాత సదాశివరాయలు 1546లో నేరుగా పోర్చుగల్ రాజు దగ్గరికి తన రాయబారిని పంపించి కావల్సిన బప్పందాలన్నీ అక్కడే కుదుర్చుకున్నాడు. వాటి ఆధారంగా గోవాలోని వైస్రాయితో చర్చలు జరిపి శాశ్వత ప్రాతిపదికన కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. ఈ నిర్ణయాలు ఉభయ తారకంగా వుండేలా జాగ్రత్తపడ్డారు.

1. పోర్చుగల్ రాజు, విజయనగర రాజు ఇద్దరూ స్నేహితుడికి స్నేహితులుగాను, శత్రువుకు శత్రువుగానూ కలిసి పనిచేయవలసి వుంటుంది.
2. ఇండియాలోని ఏ రాజుగానీ, ఏ సుల్తాన్ గానీ ఏవిధమైన సైనిక చర్యలు ఈరెండు రాజ్యాలలో ఎవరిపైన చేపట్టినా ఒకరికొకరు బాధ్యతగా సాయపడాలి.
3. విజయనగర రాజులు కొనదలచిన గుర్రాల్ని గోవా వరకూ తెప్పించి అక్కడ దించడానికి గోవా వైస్రాయి అంగీకరించాడు. వాటిని విజయనగరానికి మాత్రమే అమ్మాలి. బీజాపూర్‌కు గానీ, మరే ఇతర ముస్లింరాజుకు గాని అమ్మకూడదు.
4. గుర్రాలు అర్ముజ్ నుంచి వచ్చిన వాటిని వచ్చినట్లుగా విజయనగర రాజులు కొనుగోలుచెయ్యాలి.
5. కొనుగోలు చేస్తున్న గుర్రాలకు అప్పటికప్పుడే పైకం చెల్లించే గోవానుంచి స్వంత ఖర్చుతో తీసుకువెళ్ళాలి.!
6. విజయనగరానికి చెందిన వ్యాపారులు తమ సరుకుని హోనావార్, బార్కూర్ వంటి మలబార్ తీరంలోని ఓడరేవులను తీసుకురావాలి. పోర్చుగీసువ్యాపారులు వాటినన్నింటిని అక్కడ కొనుగోలు చేస్తారు. ఈ సరుకుని కేవలం పోర్చుగీసులకే అమ్మాలి. ఇతరులకు అమ్మకూడదు.
7. పోర్చుగీసులు తప్పనిసరిగా ఆ సరుకుని కొని తీరేలా తమ వ్యాపారుల్ని గట్టిగా ఆదేశించవలసి వుంటుంది వైస్రాయి.
8. ఉప్పు, పాడైపోయే స్వభావం కల్గిన ఇతర వస్తువుల్ని విజయనగర వ్యాపారులు తీసుకువచ్చేటప్పుడు పోర్చుగీసులు బేరాల పేరుతో నాన్చకుండా వెంటనే కొనుగోలు చేసి సహకరించేలా వైస్రాయి స్పష్టమైన ఆదేశాలు జారీ చేయాలి.

9. ఇరుదేశాల వ్యాపారుల నాణ్యత విషయంలో తిరుగులేని వాటినే అమ్మడానికి తీసుకురావాలి.

10. విజయనగరంలో తయారయిన వస్త్రాలు ఆదిల్ షా రాజ్యంలోకి వెళ్ళకుండా పశ్చిమ సముద్రతీరంలోని ఓడరేవులకు మాత్రమే చేరాలి. అక్కడ వాటికి బదులుగా పోర్చుగీసులు రాగి, పగడాలు, పాదరసం, చైనాపట్టు ఇలాంటి వాటిని ఇచ్చి కొనుగోలు చేయవలసి వుంటుంది.

11. అరేబియన్ సముద్రతీరంలో విజయనగరరాజుల ఆధీనంలోని ఓడరేవుల్లోకి ముస్లింల ఓడలు ఏమీ రానివ్వకుండా కట్టుదిట్టం చేయాలి. ఒక వేళ వస్తే, వాటిని పట్టుకొని, పోర్చుగీస్ గవర్నర్ గోవాలో ఎవరున్నాసరే అతనికి అప్పగించాలి.

12. ఆదిల్ షా తమలో ఎవరితో యుద్ధానికి దిగినా, ఈ రెండు రాజ్యాలు ఆ యుద్ధంలో సమానంగానే పాల్గొంటాయి. ఆ యుద్ధంలో గెలిస్తే, ఆదిల్‌షాకు సంబంధించిన భూభాగం అంతా విజయనగర ప్రభువుల వాటాగా వెడ్తుంది. ఓడరేవులు సముద్రతీరంలోని ముఖ్యపట్టణాలు మాత్రం పోర్చుగీసుల పరం అవుతాయి.

విజయనగర సామ్రాజ్యం పోర్చుగల్ సామ్రాజ్యం రెండూ కూడా ఇంతఖచ్చితంగా రూపొందించుకున్న ఒప్పందాలకు లోబడి చాలా కాలం పరస్పరం సహకరించుకున్నాయి. కానీ, విజయనగరం పతనం పోర్చుగీస్ వారి పతనంతో ముడిపడి, ఇంచుమించు రెండింటి కథ ఒకేసారి ముగిసింది!

# ఇండియాలో డచ్‌వారి భారీ వ్యాపారం




క్రీ.శ. 1602

పోర్చుగీసులు స్పెయిన్‌తో కలిసి ఇండియాని లూఠీ చేసేస్తున్నారని, తొందరపడకపోతే అక్కడ మిగిలేదేమీ వుండదని హాలెండ్, బ్రిటన్ దేశాలలో వ్యాపారులు గగ్గోలు పెట్టడం ప్రారంభించారు.

బ్రిటిష్ 'క్వీన్ ఎలిజబెత్- I' ఇందుకు ససేమీరా అంగీకరించకపోవడం వల్లనే కాలయాపన జరుగుతోంది, చివరికి హాలెండ్ వ్యాపారులు భారీ పెట్టుబడితో స్వంతంగా ఇండియా వైపు బయల్దేరారు. వారితో పాటు వాటాదార్లుగా ఇంగ్లీషు మర్చెంట్లు కూడా ఇండియాకు చేరుకున్నారు. ఈ ఇంగ్లీషు వ్యాపారులు వ్యక్తిగత బాధ్యత మీదే వచ్చారు అప్పటికి!

ఇందులో ఆమ్‌స్టర్ డ్యామ్ రాజ కుటుంబీకులు ఐదు లక్షల నలభైవేల పౌండ్ల పెట్టుబడి పెట్టి 'డచ్ యునైటెడ్ ఈస్టిండీస్ కంపెనీ" పేరుతో వాణిజ్య వ్యవహారాలు నడపడానికి పూనుకున్నారు. అరవైవేల పౌండ్లపెట్టుబడి ఇంగ్లీషు మర్చెంట్లది.!అంటే, కేవలం ఎనిమిదో వంతు వాటదార్లన్నమాట!

కంపెనీ మొదటి సంవత్సరంలోనే 50 శాతం డివిడెండ్ సాధించింది. రెండో ఏడాదికి 325 శాతం దాకా ఈ డివిడెండ్‌ని ఇవ్వగలిగారట.

డచ్, ఇంగ్లీషు మర్చెంట్లు తొలిదశలో ఇక్కడి వ్యాపార లాభాలన్ని పోర్చుగీసు వాళ్ళతో మంచిగా వుండి, వారి ద్వారానే తెలుసుకోగలిగారు. ఇండియాకు ఓడలు నడిచే

మార్గాలు, ఇండియాలో ప్రధాన వాణిజ్యకూడలుల సమాచారం అంతా తెలిసే వరకూ వారితో మంచిగా వ్యవహరించారు. ఆ తర్వాత తెలివిగా పోర్చుగీసుల్ని పక్కనపెట్టడం ప్రారంభించారు. చివరిగా వారిని ప్రధాన శత్రువుగా ప్రకటించి అధ:పాతాళానికి తొక్కేశారు. పోర్చుగీసుల్ని తలెత్తకుండా చేయడం ఒక శుభపరిణామమే కానీ, అలా మనకోసం చేసిన వాళ్ళు ఎలుగుబంట్ల నుంచి రక్షించిన తోడేళ్ళనేది ఇక్కడ ముఖ్య విషయం!

డచ్ వ్యాపారులు పోర్చుగీసుల్ని ఇండియాలో వ్యాపారంలోంచి బహిష్కరించారు.

ఆ పోర్చుగీసుల ఆధీనంలోని గోవాని 1639లోనూ, మలక్కాని 1641లోనూ సంహాళాన్ని 1638లోనూ స్వాధీనపర్చుకున్నారు.

అతికష్టం మీద ఇండియాలోని గోవా, దయ్యూ-డామన్ దీవుల్ని మాత్రం ఆ తర్వాతి కాలంలో పోర్చుగీసులు తిరిగి పొందగలిగారు.

ఇక్కడో సున్నితమైన అంశం వుంది. 1510లో పోర్చుగీసులు గోవా సామ్రాజ్యాన్ని ఆక్రమించారు. 1639లో డచ్‌వారు వెళ్ళగొట్టిన కొద్దికాలం మినహాయిస్తే అప్పటినుంచీ బ్రిటిష్ వారు సర్వాధికారాలతో మనల్ని పరిపాలించిన రెండువందల సంవత్సరాలు కూడా గోవా, పోర్చుగీసువారి ఆధీనంలోనే వుంది. ఆఖరికి స్వతంత్ర భారతదేశంలో కూడా, స్వాతంత్ర్యం సిద్ధించిన 13ఏళ్ళ వరకూగోవా, పోర్చుగీసువారి ఆధీనంలోనే వుంది. గోవా వరకూ బుడతకీచులు సుదీర్ఘకాలం నిలబెట్టుకోగలగడం విశేషమే!

* * * * *

హాలెండ్‌లో 'ఆమ్‌స్టర్ డ్యామ్' ఆ రోజుల్లో గొప్ప వాణిజ్యకేంద్రం. రోట్టర్‌డ్యామ్, డార్ట్రెచ్, లాడెన్ ఇలాంటి ధనిక నగరాలు డచ్‌వారి పాలనకాలంలో ఆరోజుల్లో ప్రసిద్ధి చెందాయి. ఆనాటి బ్రిటన్ కన్నా ఈ డచ్ నగరాలు బలమైనవి కూడా! అందుకే, స్వంతబలం పుంజుకునేవరకూ డచ్ వారి వెనకే నడిచారు బ్రిటిషర్లు.

1609లో బ్యాంక్ 'ఆమ్‌స్టర్ డ్యామ్'ని వ్యవస్థాపించారు. 400ఏళ్ళ క్రితం ప్రపంచంలో బ్యాంకింగ్ వ్యవస్థ అనేది దీనితోనే ప్రారంభం అయ్యిందని చెప్తారు. అప్పటికీ బ్రిటన్‌లో ఇంత ఆధునికత తక్కువేనని చెప్పాలి.

1615లో పైటర్ జూన్ కోయెన్ అనే డచ్ కంపెనీ గవర్నర్ జెనరల్ ఇలా అన్నాడట:- 'ఈ బ్రిటిష్ వాళ్ళకే తెలివితేటలు వుండేటట్లయితే, మనం ఈ ఇండియాలో ఒక్కరోజు కూడా వుండగలిగే వాళ్ళం కాదూ:.. అనీ "భగవంతుడు ఆ అవకాశం మనకిచ్చాడంతే" అని "డచ్" అధికారి దేవుడికి ధన్యవాదాలు చెప్పుకున్నాడు.


ఆంగ్లేయులకు దేనిష్ వారి అధికార మార్పిడి

డచ్ వాళ్ళు 1604-05లోనే మచిలీపట్నంలోనూ, పేట పోలిలోనూ, పులికాట్ దగ్గరా వాణిజ్య స్థావరాలు నెలకొల్పుకున్నారు. ఈ వాణిజ్య స్థావరాల్ని "ఫ్యాక్టరీస్" అనేవాళ్ళు.

1659లో పోర్చుగీసుల్నించి నాగపట్నాన్ని-స్వాధీనం చేసుకొని, అక్కడ డచ్ ట్రేడింగ్ సెంటర్ ఏర్పరచుకున్నారు. సూరత్, బరోచి, కాంబె, అహ్మదాబాద్, ఆగ్రా, బర్హాన్‌పూర్ ఇలాంటి అనేక వస్త్ర సముదాయాలున్న భారతీయ కేంద్రాలలో విస్తారంగా డచ్ డిపోలు వెలిశాయి.

బీహార్, బెంగాల్ ప్రాంతాలు కూడా డచ్‌వారి వ్యాపార కేంద్రాలయ్యాయి.

సూరత్‌లో మాత్రం పోర్చుగీసులది కొంత పై చేయిగా వుండేది. అక్కడ డచ్ వారికి, కూడా ఫ్యాక్టరీలు (వాణిజ్య కూడలులు) వున్నా పోర్చుగీసు వారిదే ఆధిపత్యంగా వుండేది!

కానీ!

బలసోర్, చిన్సురా, కాసింబజార్, పాట్నా వాణిజ్యకేంద్రాలలో మాత్రం ఆ రోజుల్లో డచ్ వాళ్ళదే పెత్తనం! మిరియాల కేంద్రం అనదగిన కేరళ తీరంలో 1661-63 మధ్య పోర్చుగీసువాళ్ళని క్విలాన్, క్రాంగనూనర్, కొచ్చిన్, కన్ననూర్‌ల్లోంచి వెళ్ళగొట్టి అక్కడ తమ వాణిజ్య కేంద్రాలు తెరిచారు డచ్‌వాళ్ళు!

1604లో కాలికట్ రాజాగారితో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ఇండియాలో ఎక్కడా పోర్చుగీసు వాళ్ళని లేకుండా చేయడమే తమ లక్ష్యం... అంటూనే వ్యాపారంలో ఏకఛత్రాధిపత్యం సాధించగలిగారు... అంతా పైకి బాగానే వుంది.. ఇది కేవలం వ్యాపారానికి సంబంధించిన తమ ఆధిపత్యం నిలుపుకోవడానికి, లాభాలు మరెవరికీ వాటా లేకుండా గుత్తమొత్తంగా జేబులో వేసుకోడానికి మాత్రమే డచ్‌వారికి ఉపయోగపడ్డాయి.

బలమైన మొఘల్ పాలనా వ్యవస్థ, దక్కన్‌లోని శక్తివంతమైన సుల్తాన్‌లూ, తల ఎగరేసి, పౌరుషం నిరూపించుకొంటున్న మరాఠాలు... డచ్ వాళ్ళని అంతకన్నా ముందుకు రాకుండా నిలవరించగలగడం ఒక్కటే యిక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం.

డచ్‌వాళ్ళు కేవలం వ్యాపారంకోసమే ఇండియా వచ్చారు. ఇక్కడవ్యాపారానికి అడ్డంగానే వున్న పోర్చుగీసువాళ్ళని నిశ్శేషంగా నిర్మూలించారు. ఇంగ్లీషువాళ్ళు కొద్దిపాటి వాటాదార్లే కాబట్టి వాళ్ళని ఎక్కడ వుంచాలో అక్కడే వుంచారు. సంపాదించుకో గలిగినంత సంపాదించుకున్నారు.

1845 వరకు డచ్‌వారి వాణిజ్య కేంద్రాలు భారతదేశంలో నడిచాయి. ఆ తర్వాత తమ ఫ్యాక్టరీలన్నింటినీ బ్రిటిషిండియా ప్రభుత్వానికి అమ్ముకొని డచ్‌వారు భారతదేశంలోంచి శాశ్వతంగా నిష్క్రమించారు.

అక్కడక్కడా ఆనాటి డచ్ వ్యాపారుల సమాధులు, కట్టడాలు మాత్రమే వాళ్ళ జ్ఞాపకాలుగా మనకి కన్పిస్తాయంతే!

# 'పాలకొల్లులో డచ్చివారి కలంకారి'

క్రీ॥శ॥ 1602 మార్చి 20 :

"VEERINGDE COST INDISCHE CAMPGNIE" "వెరీంగ్డే ఈస్టిండియా కంపెనీ" భారత ఉపఖండంలో వ్యాపార నిమిత్తం హాలెండ్ ప్రభుత్వ అనుమతి (ఛార్టర్) పొందిన కంపెనీ ఇది.

ఇంగ్లీషు వారి ఈస్టిండియా కంపెనీ ఇండియా మీదే ఎక్కువగా దృష్టి సారిస్తే, డచ్‌వారి ఈస్టిండియా కంపెనీ ఇండియాకు వెలుపల వున్న సముద్రదీవుల మీద, అక్కడి సుగంధ ద్రవ్యాల మీద వ్యాపారాన్ని కేంద్రీకరించింది. అందువలన జాజికాయ, జాపత్రి, లవంగం, ఏలకులు, దాల్చినచెక్క, మిరియాలు వగైరా ఉత్పత్తుల మీద, అవి దొరికే దీవుల మీద డచ్ వారి ఆధిపత్యం అయింది.

ఇంగ్లీషు వారికన్నా ముందు భారత ఉపఖండంలో 7 ప్రభుత్వాలు డచ్చివాళ్ళకుండేవి. ఏడవది నాగపట్నం ప్రభుత్వం.

1658లో పోర్చుగీసుల్ని ఓడించి నాగపట్నాన్ని డచ్ వారు స్వాధీనం చేసుకున్నారు. అది డచ్ వారికి ఇండియాలో ఒక గొప్ప మలుపు. మద్రాసు ఓడ రేవు బ్రిటిష్‌వారికి దక్కితే దగ్గరలో వున్న "సద్రాస్" అనే ఓడరేవు డచ్‌వారికి దక్కింది. నర్సాపురంలో ఇంగ్లీషు సెటిల్‌మెంట్ వుంటే పాలకొల్లు డచ్‌వారి హస్తగతం అయింది. కాకినాడలో ఇంగ్లీషువారి ఆధిపత్యం అయితే, పక్కనున్న జగన్నాథపురం డచ్‌వారి ఆధీనంలోకి వెళ్ళింది. మచిలీపట్నంలో ఇంగ్లీషు వాళ్ళు పెద్దవాణిజ్య కేంద్రం (ఫ్యాక్టరీ) ఏర్పరిస్తే అక్కడ డచ్‌వారు పెద్ద కోటనే నిర్మించారు. విశాఖపట్నం ఓడరేవు ఆంగ్లేయులకు దక్కితే, భీమిలిపట్నం డచ్ వారికి దక్కింది. నిజాంపట్నం (రేపల్లె) ఇంగ్లీషువారి ఆధీనంలో వుంటే నెల్లూరు దగ్గర పులికాట్ డచ్ వారి ఆధీనంలో వుంది.

నాగపట్నం నుంచి మచిలీపట్నం దాకా వున్న కోస్తా తీరాన్ని 'కోరమండల్ కోస్ట్' అని పిలిచింది మొదటగా డచ్‌వాళ్ళే. అలాగే, మచిలీపట్నం నుంచి మోటుపల్లి (రాజమండ్రి) దాకా వున్న సముద్ర తీరాన్ని నువ్వులతీరం (GINGELLY COAST) అనే వాళ్ళట!



నాగపట్నం

డచ్ వారి జీవిత విధానం, ఆహారపు అలవాట్లు, వారి వ్యవహార శైలి ఇంగ్లీషు వారికన్నా భిన్నంగా వుండేది. వాళ్ళ ఉచ్చారణ గమ్మత్తుగా వుంటుంది. జగన్నాథపురాన్ని DAAJI JEROON గా ఉచ్చరించేవారట. హెన్రీ మోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో డచ్‌వారి గురించి అనేక విశేషాలు రాశాడు.

బందరులో స్థానికంగా వున్న గవర్నర్‌లు గోల్కొండ సుల్తాన్‌ల కాలంలోనూ, ఆ తర్వాత మొఘల్ చక్రవర్తుల కాలంలోనూ 1,40,000 పగోడాల కప్పం చెల్లించి, వాణిజ్య పన్నులు వసూలు చేసుకొనే అధికారాలు పొందారు. అంత డబ్బు తిరిగి వసూలు కావాలి కాబట్టి ఇష్టారాజ్యంగా పన్నులు వేసి పీడించే వాళ్ళు.

అందుకని డచ్‌వాళ్ళు బందరంటే భయపడి పోయి, నాగపట్నానికే సరుకంతా చేర్చుకొని అక్కడనుంచి ఎగుమతి చేసుకునేవాళ్ళు. నిజానికి గుల్బర్గాలో బహమనీ రాజ్యం ఏర్పడిం తర్వాత వ్యాపారం గోవాపైనే ఎక్కువగా వెళ్ళింది. గోల్కొండ సామ్రాజ్యం అవతరించాక మళ్ళీ మచిలీపట్నానికి పూర్వపు వైభవం తిరిగొచ్చినట్లయింది. కానీ, స్థానిక పాలకుల అత్యాశ కారణంగా మచిలీపట్నం తీవ్రంగా నష్టపోయింది.

డచ్‌వాళ్ళకి ఆ నాటి జపాన్‌తో బాగా సత్సంబంధాలుండేవి. అందుకని కలంకారీ వస్త్రాలిచ్చి బార్టర్ పద్ధతిలోని జపాన్ వస్తువుల్ని తెచ్చి గోల్కొండలో అమ్మేవాళ్ళట. స్థానికంగా ఉత్పత్తుల్ని ప్రోత్సహించే విషయంలో ఇంగ్లీషు వాళ్ళకీ, డచ్‌వాళ్ళకీ చాలా తేడా వుండేది. గొప్ప ఉత్పత్తి సాధించిన వారిపట్ల ఇంగ్లీషు వాళ్ళు అసూయతో వ్యవహరిస్తే, డచ్ వారు ఈనాములిచ్చి మరింత ఉత్పత్తి కావాలని అడిగేవాళ్ళు.

1606లో పాలకొల్లులోకి డచ్ వారి ప్రవేశం జరిగింది. పాలకొల్లు దాని పరిసరాల్లో బత్తాయి తోటలు, పనసతోటలు విస్తారంగా పెరగడానికి డచ్‌వారి పాత్ర గొప్పదని హెన్రీ మోరిస్ గోదావరి డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో రికార్డు చేశాడు. నాణ్యమైన ఉత్పత్తుల కోసం బటావియా నించి విత్తనాలు తెచ్చి అధికంగా పండించారు. పాలకొల్లు బటావియా పళ్ళు జన వ్యవహారంలో బత్తాయి పళ్ళుగా మారాయి. ఇంగ్లీషులో కూడా బటావియా ఫ్రూట్స్‌గానే వ్యవహరిస్తున్నారు.

17వ శతాబ్ది నడిమిభాగంలో ఎర్ర సముద్ర దేశాల్లో ముఖ్యంగా పర్షియాలో ఇండియన్ కలంకారీ వస్త్రాలకు ఒక్కసారిగా డిమాండ్ పెరిగింది. ఇంగ్లీషు వారికన్నా ముందు పర్షియన్ మార్కెట్‌ని ఆకట్టుకోవాలని డచ్‌వారు తక్షణం ప్రతిస్పందించారు. ఆ రోజుల్లోనే బందరు, కొండపల్లి, పాలకొల్లు, శ్రీకాళహస్తి ఈ నగరాలు కలంకారీ పరిశ్రమలకు ప్రధాన కేంద్రాలుగా నిలిచాయి.

1679 ఏప్రియల్ 14న మద్రాస్ ఫోర్ట్ సెయింట్ జార్జికి చెందిన ఇంగ్లీషు ఏజెంట్ 'స్ట్రేన్‌షమ్ మాష్టర్' పాలకొల్లు సందర్శించి అక్కడి విశేషాలు డైరీలో రాసుకున్నాడు. చాలా విశాలమైన పెద్ద స్థలంలో 360 తొట్టెల్లో రంగులు కలిపి అనేక వందలమంది

## APPENDIX

శ్రీ రామ శంక్కరా

ది. 25 ప్రెబురు వారు వెల ఆనలు 1720 తేరిక్కు మెదిలి హెరుగువన్...... 82 కొరమీలొడ్డెలు, ఘెరతు వేస్తినంగారికి సంమ్మతిగాను। బింయ్యరు పావుల్పు పేరేవ బప్పర కావుమాన యీతూవున్ రేవుల్క్కు కపితారు మరి ఆలోచనకాండ్ల శెల్వు ప్రకారాం న్ను ప్రవచింయ్యరు కొనెన్‌లు బొడివెన్ను కపితారు దస్తే రాజాద్రి కావుమానుం వేచింయ్యరు జాంరానియభో (కా)శి మోను చిన్న కపితారు. బ్రుకుబురుగారు యిక్కడి కరణిలు. జానుహెల్పి మానుడి పెద్ద కరణి అబరాం వుంద్దె కుస్తురీ చింన్న కరణి యిమడర్ద పనిమోకంగాను కుంఫిణి పెద్ద పెంత్తదొరుకొండ్డెవూడి ఆచ్చనకి వ్రాయించ్చి యిచ్చిన కాకితం. కుంప్పిణి కవుల్కుశాల కోకాలు రంగ్గులు బాగా వుంద్దెరను పనులు చేసుకోవడము చిత్తరావ అనె చేరువులో నీళ్లను రంగ్గులు బాగావుంట్టావి అని రెండ్డు కత్తుల భూమికి శలవు యిప్పింనె్త ఆదొరువువిరివిగా ఖాసాను చరువు తవ్వించ్చు కుంటాను కుంప్పిణి పర్కులు విస్తరించి పనులు జరగవలెను అని నీవు మాతో అడ్గితివి గన్కమెము నాగ పట్టణపు గువనన్ దొరుగారికి వ్రాశిన శలవు తెప్పించ్చి మోచ్చువల్లి పాలెమ్కు దక్షణంగ్గా వుంన్న చిత్తరావ అనే పేరుగల దొరువు కల్పిచవకం రెండ్డు కత్తుల భూమి కొల ప్రకారం నీకు యివాము యిస్తిమిగన్కు నీవు యీ భూమిలోవుంన్న చిత్తరావ అనే దొరువు విరివిగా చరువు తవ్వి చుకని యీచరువు నుట్టూ కొక్కలు వలువ మొదలయిన పనులు సాగడమ్కు లంక్క వుంచ్చుకుని విరివిగా వలవరుచుడ్ క.నిసీ వుత్రపౌత్ర పారం పరి యాత్తం యీచరువులో పనులు చేసుకుంట్టూసుఖాన వుండ్డు కునేది. యీచరువుకు దక్షణంగ్గా వుండ్డే వెద్దవ అనె కోటలోనుంచ్చి యీచరువుకు నీళ్లవచ్చె మరియాద.



పాలకొల్లి కుంప్పిణి దివానంలో వ్రాశ్సి కాకితం

ది 25 ఫిబ్రవరి 1720 సం॥ న చిటావు చెర్వుసకు డచ్చి గవర్న యిచ్చిన పట్టా:

ఇతిహాస్ జర్నల్‌లో ఇచ్చిన తెలుగు వివరణ

ప్రజలు డచ్‌వారి కలంకారి కేంద్రంలో రంగులు అద్దే పనిలో వున్నట్లు ఆయన రాసుకున్నాడు. నిజానికి డచ్‌వారి వ్యాపార దీక్షకి ఇది నిదర్శనమే.

క్రీ॥శ॥ 1720 ఫిబ్రవరి 25వ తేదీన పాలకొల్లు పురప్రముఖుడు "ఘొరతు వేస్తినం" గారు మధ్యవర్తిగా వుండి, ఒప్పెర కాపులుతో సంప్రదించిన మీదట, వాళ్ళ "కాపుమాను" (కులపెద్ద) రాజాద్రి డచ్‌వారితో ఒక ఒప్పందం కుదిర్చాడు. ఈ ఒప్పంద పత్రాన్ని రాజాద్రి స్వదస్తూరితో తెలుగులో రాశాడు. ఇది కొండేపూడి అచ్చన్న అనే ఒప్పెరకాపు కులానికి చెందిన కలంకారీ కార్మికుడిని ఉద్దేశించి రాసిన డాక్యుమెంట్.

లొతికా వరద రాజన్ అనే పరిశోధకురాలు పాలకొల్లులో పిన్నిలక్ష్మీ నరసింహారావు నుంచి ఈ తెలుగు డాక్యుమెంట్‌ని సంపాదించి, దాని ఇంగ్లీషు అనువాదంతో ఇతిహాస్ 1980 రెండవ భాగంలో ప్రచురించారు. ఆం.ప్ర. స్టేట్ ఆర్కియిల్స్ వారు అధికారికంగా ప్రచురించే షణ్మాసపత్రిక ఇది.

ఈ ఒప్పందంలో డచ్‌వారి తరఫున కల్నల్ బొడిలెన్స్, బుక్రుబురు (కరాణి= ఎక్కొంటెంట్), జాన్ హెల్స్ (హెడ్‌రైటర్ = పెద్దల పెత్తందారు) అబ్రహాం వుండే కుస్తలి (UNDER WRITER = చిన్న కరాణి) ఈ నల్గురూ సంతకం చేశారు.

కొండేపూడి అచ్చన్న కోరిన ప్రకారం ఒక చెరువు తవ్వి, తొట్టెలు కట్టుకొని కలంకారీ రంగులు అద్దే పనులు చేసుకునే నిమిత్తం రెండు కత్తుల భూమిని ఈనాముగా ఇస్తున్నట్లు రాసిన డాక్యుమెంట్ ఇది. మోచుపల్లి పాలెంకు దక్షిణంగా వున్న భూమిలో 'చిత్తర్వ' అనే పేరుతో చెరువు తవ్వుకోవడానికి, నీరు అవసరం అయితే, పక్కనే వున్న డచ్‌వారికోట "పెద్దవ" నుంచి నీళ్ళు పట్టించుకోవడానికి ఈ డాక్యుమెంట్ అనుమతిస్తోంది. పుత్రపౌత్రసారంపరియావత్తూ అచ్చన్న కుటుంబం అనుభవించేటట్లుగా డాక్యుమెంట్ రాసి ఇచ్చారు. 1720 నాటి సామాన్య ప్రజలు మాట్లాడుకునే భాషలోనే ఈ డాక్యుమెంట్ వుంది. అయితే, ఇద్దరు సమాన స్థాయి వ్యక్తుల మధ్య కుదిరే ఒప్పందం లాంటి పద్ధతిలోనే ఇది కూడా వుందిగానీ, అహంకార పూరితంగా లేకపోవడం ముఖ్య విశేషం.

"రెండు కత్తుల భూమికి శలవు యిప్పిస్తే ఆ దొరుకు విరివిగా ఖాసాను చెరువు తవ్వించుకుంటాను, కుంప్పిణి సర్కులు విస్తరించి పనులు జరగవలెను అని నీవుమాతో అడిగితివి గన్క మేము నాగపట్టణపు గువనన్‌దొరుగారికి వ్రాసిన శలవు తెప్పించి మెచ్చుపల్లి పాలెమ్కు దక్షిణంగా వున్న చిత్తరావ అనే పేరుగల దొరువు కల్పించవకం రెండుకత్తుల భూమి కొల ప్రకారం నీకు యినాము యిస్తిమి గన్కు... ఇలా వుంటుంది. ఈ డచ్‌వారి తెలుగు డాక్యుమెంటు... తెలుగు ప్రజలతో డచ్‌వారి సంబంధాలు ప్రత్యేకమైన పరిశీలనాంశం!!

# లండన్ మోజంతా ఇండియా సుగంధ ద్రవ్యాలపైనే



క్రీ.శ.1580

ఇంగ్లీషు వాళ్ళకి వాళ్ళ రాణి ఎలిజబెత్ అంటే చాలా యిష్టం. రాజా కుంటుంబానికి వాళ్ళు యిచ్చే గౌరవం ఈనాటికీ గొప్పదే. ఆమె తమకు రాణిగా వుండడాన్ని వాళ్ళెంతో గర్వంగా భావిస్తారు. ఎందుకంటే కీలకమైన సమయాల్లో ఆమె తీసుకున్న దృఢమైన నిర్ణయాలు ఆదేశ ప్రజల్ని ఎంతగానో ప్రభావితం చేశాయి కాబట్టి.

1. ప్రొటెస్టెంట్ క్రైస్తవమతాన్ని అడ్డు పెట్టుకొని రోమ్ బ్రిటిష్‌పైన డిక్రీలు చేసినప్పుడు- ''మతం వేరు, పరిపాలన వేరు'' అని తేల్చి చెప్పిన ధీశాలి రాణి ఎలిజబెత్.
2. స్పెయిన్ చక్రవర్తి, పోర్చుగల్ చక్రవర్తులు ఆడదికదా... చెప్పినట్టల్లా చేస్తుంది లెమ్మని అనుకొన్నప్పుడు వాళ్ళని నిలువరించి ఎక్కడ వుంచాలో అక్కడ వుంచగలిగిన మేధావి రాణి ఎలిజబెత్.
3. స్పెయిన్ సైన్యాల్ని సమర్ధించవలసిందిగా పోప్ వత్తిడి తెచ్చినా లక్ష్యపెట్టని రాజనీతిజ్ఞురాలు రాణి ఎలిజబెత్.
4. సముద్రమార్గాన ఈస్టిండీస్ భూభాగాలకు చేరడానికి అవరోధంగా వున్న కారణంగా స్పెయిన్‌పైన దండయాత్ర చేయాలని ఆనాటి బ్రిటిష్ యుద్ధనిపుణులు ఎంత వత్తిడి చేసినా ఆ యుద్ధం లాభదాయకం కాదని సహనం వహించిన ధీనవనిత రాణి ఎలిజబెత్.
5. బ్రిటిష్ ఆనాటికే నావికాయానంలో ఎంతో గొప్ప పరిణతి పొందిన దేశంగా పేరొందింది. జాన్ హాకిన్స్, ఫ్రాన్సిస్ డ్రేక్ ఇలాగొప్ప నావికులున్నారు. గాలికి అనుగుణంగా సురక్షితంగా నడిచే గొప్ప ఓడలున్నాయి. కానీ, చరిత్రలో "సీ డాగ్స్"

అని పేరొందిన నావికులు తమ వాళ్ళనీ, సముద్ర దొంగల ముఠాకు నాయకులు అనదగినవాళ్ళు వీళ్ళలో వున్నారనీ ఆమెకు తెలుసు. అందుకే ఆమె తొందరపాటు నిర్ణయాలు తీసుకోలేక పోయింది. అది రాణి ఎలిజబెత్‌కు తన దేశంపట్ల గల నిబద్ధతకు నిదర్శనం! 1580నుంచి1600వరకు బ్రిటిష్ వాణిజ్యవేత్తలు రాణిపైన వత్తిడి తెస్తూనే వున్నారు... ఇండియాలో వ్యాపారం చేద్దాం అనుమతి ఇవ్వమని!

హాలెండ్‌తో కలిసి వెళ్ళే విషయంలో ఆచి తూచి అడుగువేస్తున్న బ్రిటిష్ రాణి ఎవ్వరి వత్తిడులకూ తల ఒగ్గలేదు. ఎందుకంటే ఆమెకు దేశప్రతిష్ట అన్నింటికన్నా ముఖ్యం కాబట్టి!

ఇంగ్లీషు మాంసాహార ప్రియులకు మిరియాలు తదితర మషాలా సుగంధద్రవ్యాలు లేనిదే ముద్ద దిగదు. ఇండియా, దాని ఉపఖండంలోని దీవుల్లో మిరియాలు, దాల్చిన చెక్క యాలకులు విస్తారంగా దొరుకుతాయి. వాటిమీద బ్రిటిషర్ల మోజు... ఇండియాతో వ్యాపారం చేయాలనే వత్తిడికి ముఖ్యకారణం. 1599, సెప్టెంబరు 24న కొందరు వ్యాపారులు ఒక కంపెనీగా ఏర్పడి 30వేల పౌండ్లు పెట్టుబడులతో ఇండియాలో వ్యాపారానికి వెళ్ళేందుకు అనుమతి అడిగారు. ఎలిజబెత్ రాణి నిర్ద్వంద్వంగా ఈ విన్నపాన్ని తిరస్కరించింది.

ఓ ఏడాది తర్వాత మళ్ళీ అదే విన్నపం చేశారు. 60వేల పౌండ్లు పెట్టుబడి పెడతామన్నారు. ఇలా పదే పదే పెట్టుబడిదారులు వత్తిడి తేవడంతో 1600 డిసెంబర్ 31న ఈస్టిండియా కంపెనీ ఏర్పాటుకు అనుమతించడం జరిగింది.ఆ రోజున దానికి పెట్టిన పేరు"ద గవర్నర్ అండ్ కంపెనీ ఆఫ్ మర్చంట్స్ ఆఫ్ లండన్ ట్రేడింగ్ ఇన్ ద ఈస్ట్ ఇండీస్–"అని. ఈ కంపెనీ ప్రధాన లక్ష్యం–కేవలం సుగంధద్రవ్యాల వ్యాపారంలో కొంత వాటాని పొందడం మాత్రమే! డచ్ వ్యాపారులు తాము ఇండియా నుంచి తెచ్చిన మిరియాల ధరల్ని మూడు షిల్లింగ్‌ల్నుంచి ఎనిమిది షిల్లింగ్‌లకు పెంచి అమ్ముతుండడంతో ఈ నిర్ణయం తీసుకోవాల్సి వచ్చింది. 1601నాటికి అంటే ఒక ఏడాది కాలంలో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ మిలియన్ పౌండ్ల మిరియాల్ని బ్రిటన్‌కు తరలించగలిగిందట!

మిరియాలు కొనుక్కోవడానికి మాత్రమే యింత సాహసం చేసి లండన్ నుంచి ఇండియా దాకా రావాలా...అనే ప్రశ్న వ్యాపారుల్లో మొదటి నుంచి వుంది.బ్రిటన్ వస్తువుల్ని ఇండియాలో అమ్మితే ఇంకా ఎక్కువ లాభాలు వస్తాయి కదా... అనీ! ఇంతలో కింగ్‌జేమ్స్–1 అధికారంలోకి వచ్చాడు. పరిస్థితులు మారాయి. భారతదేశంలో అక్బర్ తర్వాత జహంగీర్ పాలకుడయ్యాడు. రెండు దేశాల ప్రభుత్వాల మార్పిడి యించుమించు ఏకకాలంలో జరిగిన నేపథ్యంలో మనం చూడవలసిన మరో కోణాలు మరికొన్ని వున్నాయి!

# సంవత్సరానికి పది పౌండ్లకు బొంబాయిని అద్దెకు తీసుకున్న బ్రిటిషర్లు

ఆనాటి బొంబాయి ఓడరేవు



క్రీ.శ. 1661

పోర్చుగల్ యువరాణిని బ్రిటన్ యువరాజు చార్లెస్ కిచ్చి పెళ్ళిచేసి ఆంగ్లేయులతో వియ్యమందడం ద్వారా పోర్చుగీసులు బ్రిటిష్‌వారికి దగ్గరయ్యారు. కానీ, "ఎక్కడైనా బావ" అనే సామెత ఇంగ్లీషు వారికి వర్తించినంతగా ఇతరులకు వర్తించేదికాదు. "వ్యాపారం వ్యాపారమే, వ్యవహారం వ్యవహారమే" అని తేల్చి చెప్పారు ఆంగ్లేయులు. తమ చేష్టల ద్వారా ఇందులో ఓ పిట్టకథ వ్యవహారం కూడా ఉంది. ఇది సరదాగా చదవండి!

అల్లుడుగారు అలకపాన్పు ఎక్కినప్పుడు సంతోషపెట్టడం కోసం ఇండియాలో తమ ఆధీనంలో వున్న బొంబాయి ఓడరేవుని వరకట్నంగా రాసి యిచ్చాడు పోర్చుగల్ రాజు. బొంబాయితో సహా గోవా, డయ్యూ, డామన్‌లు పోర్చుగల్ ఆధీనంలోని ప్రాంతాలు.

ఆ రోజుల్లో బొంబాయి ఓడరేవుకి ఏ మాత్రం ప్రసిద్ధిలేదు. ఒకనాటికి "గేట్ వే ఆఫ్ ఇండియా" అవుతుందనీ, ప్రపంచ ప్రసిద్ధిచెందిన ఓడరేవు పట్టణం అవుతుందనీ, భారతదేశపు ఆర్థిక రాజధానిగా నిలుస్తుందనీ ఆనాడు పోర్చుగల్ రాజుగాని, దాన్ని కట్నంగా పొందిన చార్లెస్‌గాని ఏమాత్రం వూహించలేదు. 1661 నాటికి బొంబాయి రేవు మురికి కూపం...గా వుండేదిట!

"ఈ నీళ్ళలో కాళ్ళు తడిస్తే చాలు రోగాలొస్తాయి" అన్నంత ఘోరంగా వుండడంతో, తనకున్న అనేక వూళ్ళలో యిది తనదికాదనుకొని రాసిచ్చేశాడు పోర్చుగల్ రాజు. ఈ మురికి నీళ్ళని ఏంచేసుకోవాలోతెలీక దిక్కులు చూశాడు చార్లెస్. ఎదురుగా తమ ఆంగ్లేయ వ్యాపారుల ఈస్టిండియా కంపెనీ బోర్డు కనిపించింది. వాళ్ళకి సంవత్సరానికి పది పౌండ్ల అద్దె చెల్లించే విధంగా అంటే ఈ నాటి కరెన్సీలో సంవత్సరానికి 850 రూపాయలకి అద్దెకిచ్చేశాడు. కంపెనీకి యిలా బొంబాయి దక్కింది. కానీ, ఆ రోజు నుంచి కంపెనీ దశ మాత్రం మారిపోయింది. బొంబాయికి కూడా దశ తిరిగింది.

అప్పటి దాకా బ్రిటిష్‌వారి వాణిజ్యకేంద్రాలన్నీ సూరత్ కేంద్రంగా నడిచేవి. పోర్చుగీసులు, డచ్‌వారి కేంద్ర కార్యాలయాలు కూడా సూరత్‌లోనే వుండేవి. ఇండియాలో సూరత్ ఆ రోజుల్లోనే ప్రధాన వస్త్ర పరిశ్రమ కేంద్రం!

సరిగ్గా యిదే సమయానికి మద్రాసు, కలకత్తాల్లో కూడా బ్రిటిష్ వారు స్థావరాలు పొందగలిగారు. బొంబాయి, మద్రాసు కలకత్తాల్ని కైవసం చేసుకున్నా ఇంకా వాళ్ళు ఎదురు వుండే అవకాశాలు లేవుకదా. బరూచీ,బరోడా, అహ్మదాబాద్, ఆగ్రా, కాలికట్‌ల సరసన మూడు కేంద్రాలు వారికి కొత్త అందనిస్తూ చేరాయి. క్షణం ఆలస్యం చెయ్యకుండా సూరత్ నుంచి తమ ఫ్యాక్టరీ ల్ని (వాణిజ్య కేంద్రాల్ని)బొంబాయికి తరలించారు ఆంగ్ల వ్యాపారులు.

సూరత్‌కి పోర్చుగీసుల వైస్రాయి ఈ సంఘటనకి దు:ఖిస్తూ అన్నాడట. "బొంబాయిని వరకట్నంగా ఇంగ్లీషు వాళ్ళకి వదులుకోవడంతోనే ఇండియాని పోర్చుగీసులు వదులు కున్నట్లయింది-"అని! బొంబాయి తమ చేతుల్లో ఉన్నంతకాలం దాని అభివృద్ధి గురించి గానీ, అక్కడి తమ అభివృద్ధిని గానీ ఏ మాత్రం పట్టించుకోని పోర్చుగీసులకి బ్రిటిష్ వారు బొంబాయిని కేంద్రంగా చేసుకున్నారనే సరికి పెరపెర పుట్టింది. వ్యాపారంలో పోటీలో వెనకపడేవాడి తత్వం యిలానే వుంటుంది. పోర్చుగీసుల పతనానికి యిది సంకేతమూ, పక్కనే వున్న డచ్ వారికి యిది హెచ్చరిక అయ్యాయి! కానీ అప్పటికే మొఘల్ చక్రవర్తి ఆసరాతో బొంబాయి నౌకా కేంద్రంగా వాణిజ్య కేంద్రంగా పునాదులు తవ్వుకోవడం ప్రారంభం అయ్యింది. తక్కిన విదేశీ వ్యాపారులంతా నోరు వెళ్ళబెట్టుకుని చూస్తూ నిలుచున్నారు.

# జహంగీర్ ప్రాపకం సంపాదించిన లండన్ వ్యాపారులు


జహంగీర్ చక్రవర్తి

క్రీ.శ. 1599.

లండన్ వ్యాపారి 'మిల్డన్ హాల్' భూమార్గాన చాలా కష్టాలు పడి ఇండియా చేరుకున్నాడు.

ఢిల్లీ నుండి ఆగ్రాకి ముఘల్ రాజధానిని తరలించిన తర్వాత, 1603కు గానీ ఈ 'మిల్డన్‌హాల్' ఆగ్రా చేరుకోలేకపోయాడు. ఈయన అక్బర్ పాదుషా సభలో ప్రవేశించే, పాదుషా వారిని కలిసి ఆంగ్లేయులకు వ్యాపారం చేసుకునే అనుమతితో కూడిన ఫర్మానా సాధించుకుని వెళ్ళాడు. ఈ ఫర్మానా సాధించుకోవడానికి పోర్చుగీసుల నుంచి, ఇటాలియన్ల నుంచి, కొందరు డచ్‌వాళ్ళ నుంచి కొంత వ్యతిరేకత ఎదుర్కొన్న సంతృప్తిగా ఇంగ్లండ్ తిరిగి వెళ్ళాడు.

"ద ఇంగ్లీషు ఇన్ వెస్టర్న్ ఇండియా" అనే గ్రంథంలో ఫిలిప్ ఆండర్సన్ ఈ వివరాలు రాస్తూ అక్బర్ పాదుషా వారి ఫర్మానాతో రెట్టించిన ఉత్సాహంతో ఆంగ్లేయులు భారతదేశం వెళ్ళాలని తహతహలాడిపోయారన్నాడు.

కింగ్ జేమ్స్-1 నుంచి అక్బర్ పాదుషాకు ఓ ఉత్తరం తీసుకుని, విలియమ్ హాకిన్స్ అనే వ్యాపార వర్గ ప్రతినిధి 1608లో మొదట సూరత్‌లో ఓడ దిగాడు.

'హెక్టార్' అనేది, ఈ హాకిన్స్‌గారు ప్రయాణం చేసి వచ్చిన ఓడ పేరు. ఆంగ్లేయుల పొగ ఓడ షైన భారతదేశంలోకి అడుగుపెట్టడానికి కారణమైన మొదటి ఓడ ఇదే.

హెక్టార్ షైన ఆంగ్లేయుల జెండా సూరత్ సముద్రజలాల్లో, రెపరెపలాడుతూ ఎగిరింది. సూరత్ గవర్నర్ గానీ, డచ్‌వాళ్ళు గానీ, పోర్చుగీసుల గానీ, ఈ హాకిన్స్‌ని నిలువరించాలని

చాలాప్రయాత్నాలు చేశారు. కానీ, వీళ్ళెవరినీ లక్ష్యపెట్టకుండా హాకిన్స్ ధైర్యంగా ఆగ్రా బయల్దేరి వెళ్ళిపోయాడు. 1609మేనెలలో రాజసౌధానికి ఈ హాకిన్స్ చేరుకునే సమయానికి అక్బర్ పరమపదించి, జహంగీర్ అధికారంలోకి వచ్చివున్నాడు.

కింగ్ జేమ్స్-1 అక్బర్ పాదుషాని ఉద్దేశించి రాసిన ఉత్తరాన్ని జహంగీర్‌కు అందించాడు హాకిన్స్. అంతవరకూ ఈ సమాచారం పూర్తిగా లండన్ చక్రవర్తులకు తెలియదని దీన్నిబట్టి మనం అర్థం చేసుకోవాలి.

జహంగీర్ తన తండ్రి అక్బర్ పాదుషావారు ఆంగ్లేయులకిచ్చిన ఫర్మానాని గౌరవిస్తానని మాట ఇచ్చాడు. ఆంగ్లేయులు వ్యాపారం చేసుకోవడానికి అవకాశం కల్పిస్తానన్నాడు. తన దగ్గరనున్న ఓ క్రైస్తవవుల పిల్లని అక్బర్ పాదుషా మరణించిన హాకిన్స్‌కిచ్చి పెళ్ళి చేశాడు. 1612వరకూ మరో మూడేళ్ళు జహంగీర్ ఆస్థానంలో ఆ అమ్మాయితో సుఖంగా కాపురంచేసి, తన భార్యగా ఆమెని లండన్‌కు వెంట తీసుకెళ్ళాడు హాకిన్స్. అదే అదనుగా హాకిన్స్ వచ్చిన మార్గంలో, సూరత్‌కు ఆంగ్ల వ్యాపారులు వరదకట్టడం మొదలుపెట్టారు. ఎవరెంత ఎదిరించినా ఆంగ్లేయుల రాకని ఎవ్వరూ ఆపలేకపోయారు.

సూరత్‌లో ఆంగ్లేయుల సంఖ్య గణనీయంగా పెరిగిన తర్వాత 1613లో కెప్టెన్ బెస్ట్, కెర్రిడ్జ్ ఇలాంటి పేర్లున్న వ్యక్తులు సూరత్‌లో ఆంగ్లేయులకు ఎంతో కొంత కన్సెషన్ ఇవ్వమని వీళ్ళు జహంగీర్‌పైన వత్తిడి తెచ్చారు. కానీ, ఆయన ఈ ఆంగ్లేయుల్ని అంతగా పట్టించుకున్నట్లు లేదు.

అందుకని, ఇంగ్లండ్ రాజు జేమ్స్-1తో నేరుగా అడిగిస్తే జహంగీర్ వెంటనే అనుకూలంగా స్పందిస్తాడని, ఆ మేరకు రాజుగారి పక్షాన ఓరాయబారిని జహంగీర్ దగ్గరకు పంపించాడు. అలా వచ్చాడు 'సర్ థామస్ రో' 1615 సెప్టెంబర్‌లో ఇండియాకి.

"థామస్" ఇండియాలో మూడేళ్ళ పాటు ఇదే పనిమీద వున్నాడు. ఆ సమయంలో ఆయన నిర్వహించినపాత్ర, ఆయన విజయాలు, అపజయాల మీద ఒక పుస్తకాన్ని ఎడ్వార్ట్ టెర్రీ అనే ఆయన రాశాడు. మొత్తం మీద, ఈఘటనలన్నింటిలోనూ థామస్‌రోకి అర్థంఅయింది ఒక్కటే...జహంగీర్‌కి రాజ్యాలు కావాలి-అధికారాలు కావాలి-సంపద కావాలి-కానీ, వ్యాపారం అనేది ఆయనకు ఏ మాత్రం ఇష్టంలేని అంశం అని!

ఒక దిశలో విసిగిపోయిన థామస్‌రో, ఈస్టిండియా కంపెనీ గవర్నర్'సర్ థామస్ స్మైత్' కు రాసిన లేఖలో అంటాడూ:'ఈ నా ఉద్యోగం చివరికి విసుగూ, నిరాశ తప్ప మరేదీ మిగిల్చేలా లేదు. కష్టం ఎక్కువ ఫలం తక్కువ. సాధించేదేమీ వుండేలా లేదు-'

అనీ! ఒక దశలో ఈ జహంగీర్ చక్రవర్తిని వదిలేసి నేరుగా వ్యాపారుల్లోకి దూరి పోవాలనే ఆలోచనలు కూడా చేశారు.

1618 ఫిబ్రవరిలో ఎట్టకేలకు జహంగీర్ చేత ఉత్తరం రాయించగలిగాడు థామస్ రో... ఆ ఉత్తరం సారాంశం ఇది: 'ఇంగ్లీషు వ్యాపారులకు ఇండియా స్వాగతం పలుకుతోంది. వీరంతా నాకు స్నేహపాత్రులే! ఇండియాలో వారికి నచ్చిన చోట వారు వ్యాపారం చేసుకోవచ్చు. వారికి వీలైన వాటిని అమ్ముకోవచ్చు. అంతేకాదు ఇంగ్లీషు వ్యాపారులకు నా అభయం ఇస్తున్నాను. ఇది వారిని పోర్చుగీసుల నుంచి, ఇతర దేశీయులనుంచి మా భూభాగంలో రక్షణనిస్తుంది. -మా రాజభవనానికి అపురూపమైన వస్తువులు, విలువైనవి కింగ్ జేమ్స్‌గారు పంపుతారని ఆశిస్తున్నాను-'

సెప్టెంబర్ 1615 లో వచ్చి, మూడేళ్ళపాటు శ్రమించి, ఫిబ్రవరి 1618లో చిట్టచివరికి ఎట్టకేలకు సాధించిన ఈ ఫర్మానా భారతదేశ చరిత్ర ఒక మలుపు తిరగడానికి ముఖ్యభూమిక వహించిందని వేరే చెప్పనవసరం లేదు కదా..!

ఈ మూడేళ్ళ వ్యవధిలో మొఘల్ చక్రవర్తి వ్యక్తిగత బలహీనతలు, పాలనలోని విధానాలు బాగా ఆకళింపు చేసుకున్న 'థామస్ రో' ఆ తర్వాత కథని నడపడంలో లండన్‌లో ప్రముఖ పాత్ర నిర్వహించాడు.

భూమార్గాన తప్ప సముద్రం మీద ఏ మాత్రం అనుభవంలేని మొఘల్ చక్రవర్తుల్ని దెబ్బ కొట్టాలంటే, నావికుల వల్లనే సాధ్యమౌతుందనేది బ్రిటిషర్లు గ్రహించిన ముఖ్య విషయం! అక్బర్ పాదుషా కూడా కూడా ఈ లోపాన్ని సరి చేసుకోవడానికి పోర్చుగీసుల్ని చేరదీశాడు. ఇప్పుడు జహంగీర్ బ్రిటిషర్లను కావులించుకోబోతున్నాడు!

ఈ కథంతా వివరంగా చెప్పి, 'థామస్ రో' 'పోర్చుగీసులు చేసిన తప్పులు మీరు చేయకండి-' అన్నాడు. బ్రిటిషర్లు ఆ తర్వాత ఎలా ప్రవర్తించారనేది కాలమే నిర్ణయిస్తుంది!

# బందరులో షాజహాన్




క్రీ.శ. 1623

జహంగీర్ పెద్దకొడుకు అసలు పేరు ఖుర్రమ్.

'మాలిక్ అంబర్' అనే నమ్మకద్రోహి మహారాష్ట్రలోని అహ్మద్‌నగర్‌ని ఆక్రమించుకున్నప్పుడు ఈ ఖుర్రమ్ అతన్ని ఓడించి, అహ్మద్‌నగర్ నుంచి పారద్రోలి తండ్రి ప్రశంసలు పొందాడు 'షా-జహాన్' అనే బిరుదు లభించింది ఆ కారణంగా అతనికి!

మాలిక్ అంబర్ ఎప్పటికప్పుడు తిరుగుబాట్లు లేవదీయడం వలన 'షాజహాన్' అహ్మద్ నగర్‌లోనే దృష్టి కేంద్రీకరించి వుండిపోవాల్సి వచ్చింది.

అంతలో, జహంగీర్ వారసుల మధ్య రాజ్యాధికారం విషయంలో వివాదాలు ప్రారంభమయ్యాయి. ఢిల్లీ సింహాసనాన్ని, తనకుకాకుండా షత్రియార్‌కు కట్టబెట్టేందుకు జహంగీర్ సుముఖంగా వున్నాడన్న సంగతి అహ్మద్‌నగర్‌లో వున్న షాజహాన్‌కు తెలిసింది.

ఈ విషయంలో తండ్రిపైన తిరుగుబాటుకు చిన్న ప్రయత్నాలు చేశాడుగానీ, చాలామంది రాజులు, సుల్తాన్‌లూ అందుకు సహకరించడానికి ముందుకు రాకపోవడంతో తనే స్వయంగా ఢిల్లీ వెళ్ళి ముఖాముఖీ తేల్చుకోవడానికి బయల్దేరాడు షాజహాన్.

అవసరం అయితే, ససైన్యంగా తిరుగుబాటు చెయ్యడానికి సన్నద్ధంగా, తన అధీనంలో వున్న సైన్యం మొత్తాన్నీ తీసుకొని ఢిల్లీ బయల్దేరాడు.

గోల్కొండ సుల్తాన్ అనుమతితో, ఆయన రాజ్యంగుండా మచిలీపట్నం చేరి, అక్కడినుంచి బంగాళాఖాతంగుండా ఓడపైన కలకత్తాచేరి, ఢిల్లీ వెళ్ళాలని పథకం వేసుకొన్నాడు షాజహాన్.

మాహుర్ దగ్గర తన సైన్యం, ఆయుధాల వివరాలు ఉదయ్‌రాయ్ అనే గోల్కొండ అధికారికి లెక్కలుచెప్పి గోల్కొండ రాజ్యంలోకి ప్రవేశించి సుల్తాన్‌ని కలిశాడు.

గోల్కొండ సుల్తాన్ మహమ్మద్ కుతుబ్‌షా యువరాజు షాజహాన్‌కి 2 లక్షల బంగారు నాణాలు, 20 ఏనుగులు బహుమతిగా ఇచ్చి తిలంగ్ (తెలంగాణా) మీదుగా మచిలీపట్నం చేరేందుకు అనుమతి ఇచ్చాడు. తన ప్రజలకు ఎలాంటి హానీ కలగనీయకుండా 15 రోజుల్లోగా తన రాజ్యం వదిలి ఓడ ఎక్కి వెళ్ళిపోవాలనే షరతు మీద ఆ అనుమతిచ్చాడు.

షాజహాన్ కాన్వాయ్‌వెంట అతని భార్య ముంతాజ్‌మహల్, ముగ్గురు పిల్లలు దారా, షూజా, ఔరంగజేబ్ కూడా వున్నారు.

మొఘల్ సైన్యం కసాయితనం దేశం అంతా తెలుసుకాబట్టి, ఆ సైన్యం వెళ్తున్న మార్గంలో వూళ్ళన్నీ నిర్మానుష్యం అయిపోయాయి. ఎక్కడివాళ్ళక్కడ మొఘల్ సైనికుల కళ్ళలో పడకుండా పారిపోయారు.

ఈ వార్త తెలిసిన ఫ్రెంచివారు, డచ్చివారు, బ్రిటిష్‌వారు కూడా తమ బంగారం ఇతర విలువైన వస్తువుల్ని నేలమాళిగల్లో రహస్యంగా దాచుకొని బైటకు కన్పించకుండా నక్కినక్కి తిరిగారట బందరులో!

ఆ దెబ్బతో నిత్యావసర వస్తువుల ధరలు 200 రెట్లు పెరిగాయట!

12-10-1623న మచిలీపట్నం చేరుకున్నాడు షాజహాన్. ఓడకోసం ఇంకొన్ని రోజులు అక్కడే వేచివుండవలసివచ్చింది.

ఈలోగా ఒక కథ జరిగింది..

గోల్కొండ సుల్తాన్‌ల ఏలుబడినవున్న ఆనాటి మచిలీపట్నం సముద్రజలాల్లో పోర్చుగీసుల ఓడ మీద డచ్‌వారు దాడిచేసి, ఓడలో సరుకుని దోచుకొని, ఓడని పగలకొట్టి పరివారంతో సహా సముద్రంలో ముంచేశారట.

ఈ విషయం రేవు అధికారులకు తెలిసి డచ్‌వారిని అరెస్టు చేశారు. అపరాధానికి తగిన శిక్ష, కొంత జుర్మానా, పోర్చుగీసులకు భారీగా నష్టపరిహారం చెల్లించే విధంగా సుల్తాన్ తీర్పు చెప్పాడు.

భారీ అపరాధరుసుము చెల్లించవలసి వచ్చే సరికి, డచ్ ఫ్యాక్టరీ యాజమాన్యం 'హార్మెన్ ప్రిన్స్' అనే అధికారిని సుల్తాన్‌తో సంప్రదింపులు జరపవలసిందిగా కొన్ని కానుకలిచ్చి పంపించింది. హార్మెన్ ప్రిన్స్ గోల్కొండ బయల్దేరి, దారిలో షాజహాన్ సైన్యాన్ని చూసి భయపడి వెనక్కి వచ్చేశాడు. అనుకున్న ప్రకారం గోల్కొండ చేరలేకపోయిన డచ్ అధికారుల్ని బందర్‌లో ఖైదు చేశారు.

ఈలోగా షాజహాన్ బందరు దాకా వచ్చేశాడు!

డచ్‌వారు షాజహాన్‌ని కలిసి తమ గోడు చెప్పుకొని తన పలుకుబడి ఉపయోగించి అధికారుల్ని విడిపింపచేయమని వేడుకొని భారీగా కానుకలు సమర్పించుకొన్నారు షాజహాన్‌కి!

షాజహాన్ సంతోషంగా కానుకలు స్వీకరించి, మంచిమాటలు ఏవో చెప్పి, డచ్ వారిని విడిపించి, ఓడ ఎక్కి తన దారిన తాను కలకత్తా వెళ్ళిపోయాడు

షాజహాన్ అలా ఓడ ఎక్కారో లేదో, డచ్ ఆఫీసర్లను తిరిగి అరెస్టు చేశారు సుల్తాన్ సైనికులు.

ఈ విధంగా డచ్‌వారి దొంగతనం వాళ్ళ పీకలకు చుట్టుకొని దోచుకున్నదంతా ఇచ్చెయ్యగా అదనంగా చాలా మూల్యం చెల్లించాల్సి వచ్చింది. మధ్యలో షాజహాన్‌కి ఇచ్చుకొన్నది మరీ దారుణంగా వృధా అయ్యింది.

అదీ షాజహాన్ బందరు కథకు ముగింపు.

బందరు నుంచి కలకత్తాకు సముద్రతీరాన రోడ్డు నిర్మించాలనే ఆలోచన అప్పట్లోనే షాజహాన్‌కు కలిగిందని అంటారు.

షియా సున్నీల వైరం మనసులో పెట్టుకొని బెజవాడ పరిసార ప్రాంతాల్ని తగలబెట్టించాడు షాజహాన్ అని కూడా చెప్తారు.

నిజానిజాలు తేల్చే సాక్ష్యాలు కూడా తగలడినట్లే ఉన్నాయి!

# వరస కరువులు -
# విదేశీ పాలన


బ్రిటిష్ వారి బానిస వ్యాపారం

విజయనగర సామ్రాజ్య పతనం దక్షిణ ప్రాభవాన్ని మసిబారేలా చేసింది. అదే సమయానికి దక్షిణ భారతదేశంలో వ్యాపించిన కరువు పరిస్థితులు ఈ ప్రాంతాన్ని మరింత దిగజార్చాయి. "అంగళ్ళ రతనాలు అమ్మినారట ఇచట" అనిపించుకున్న దేశంలో అంగళ్ళలో కన్నబిడ్డల్ని అమ్ముకున్న వైనం హృదయ విదారకంగా కన్పిస్తుంది. రాజకీయ అస్థిరత ముఖ్య కారణం ఇందుకు, రాజ్యవిస్తరణ కాంక్షే తప్ప పాలనా బాధ్యతలు మరిచిన ప్రభుత్వాలదే అసలు బాధ్యత!

వానలు తగినంతగా కురవకపోవడం, ధరలు అదుపుతప్పి పెరిగిపోవడం, కలరావంటి వ్యాధులు విస్తృతంగా వ్యాపించడం, నీటిపారుదల సౌకర్యాలు లేక నదులు అదుపుతప్పి జనావాసాల్ని ముంచెత్తడం, ఇవన్నీ ఐదువందల ఏళ్ళనాటి ఆంధ్ర, కర్నాటక, తమిళనాడు ప్రాంతాల్లో వ్యాపించిన దుర్భర పరిస్థితులకు కారణాలు, ఈ స్థితిలోనే ఇంకా ఇక్కడేదో మహత్తర సంపదలున్నట్లు పోర్చుగీసులు, బ్రిటీషర్లు, డెన్మార్క్‌లు, ఫ్రెంచి, డచ్ వ్యాపారులు ఒక్కరితో ఒకళ్ళతో వాణిజ్య స్థావరాలకోసం పోటీపడుతున్న రోజులు.

1614లో విజయనగర సామ్రాజ్యపు అంతేవాసి-వెంకటరాయలు-**II** మరణించే నాటికి ఇదీ పరిస్థితి. "సివిల్ వార్" అనదగినంతగా ప్రజల్లో తీవ్ర ఆగ్రహావేశాలు

అలుముకుని వున్నాయి. తినడానికి ఏమీ దొరకని పరిస్థితి. తిరుగుబాటుచేసి రాజ్యాన్ని కబళించుకోవాలనో,తానే రాజుననిపించుకోవాలనో ప్రయత్నించే సామంతులేగానీ, ఒక్క ప్రభువూ ప్రజలు ఆకలితో అలమటిస్తున్న సంగతి పట్టలేదు.

యూరోపియన్లకు వ్యాపారం కోసం ఏదో ఒక వస్తువు చవకగా కావాలి. అది ఏదైనా వారికి వచ్చిన ఫరవా ఏమీలేదు. అందుకే కారుచవకగా, పిల్లల్ని కొనడం మొదలుపెట్టారు. ఎక్కడ వీలైతే అక్కడ వాళ్ళని బానిసలుగా అమ్ముకోవచ్చని! 1929లో విలియమ్ మెథ్‌వజ్ అనే ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ మచిలీపట్నం చీఫ్, ఆనాటి పరిస్థితి గురించి కంపెనీ వారికి రాసిన ఉత్తరంలో కొన్ని వివరాలున్నాయి.

"1614లో విజయనగరసామ్రాజ్యం ఆఖరి చక్రవర్తి మరణించిన తర్వాత సామంతులంతా సింహాసనం కోసం కాట్లాడుకోవడంతోనే సరిపోయింది. ఒకరినొకరు అధిగమించడం కోసం వాళ్ళలో వాళ్ళు పోటీలుపడి, యుద్ధాలకు దిగి సివిల్ వార్ పరిస్థితిని తెచ్చిపెట్టారు. ముఖ్యంగా నాయక రాజులు ఈ పరిస్థితికి కారకులు, ఫ్యాక్షనిజాన్ని సృష్టించి, ప్రజల్ని భయభ్రాంతుల్ని చేయసాగారు.

ఒకవైపు ప్రాణభయం, వేరొకవైపు ఆకలి. బతుకు సాగని దుస్థితిలో ఇంకెక్కడైనా ఎలాగైనా బతుకుతారని తల్లిదండ్రులు తమ పిల్లల్ని సముద్రతీరానికి తెచ్చి ఓడల్లో వచ్చిన యూరోపియన్లకు అమ్మడం మొదలుపెట్టారు. గత 15ఏళ్ళుగా ఇదే పరిస్థితి నడుస్తోంది. ఓడ వచ్చిందంటే చాలు వేలాదిమంది పిల్లల్ని తీసుకు రాసాగారు. ఒక పిల్ల లేదా పిల్లవాడికి ఐదు పణాలు ఖరీదుగా నిర్ణయిచారు.

"సముద్రతీరాన జరిగే ఈ పిల్లల సంతని "సీ సైడ్ సెల్లింగ్' అంటున్నారు. పిల్లల్ని ఇండియాలోనే పరిస్థితులు బాగా వున్న మరోచోటుకి తీసుకెళ్ళి తిరిగి అమ్ముతారు మనవాళ్ళు-" అని, ఇంగ్లండుకు రాసిన ఒక లేఖలో రాశాడు విలియమ్ మెథవల్డ్. దక్షణభారతదేశం అంతా ఇదే పరిస్థితి నడిచింది. బందరులో ఇది మరీఎక్కువ.

రాస్టివ్ అనే మరో బ్రిటిషర్ ఇంగ్లండ్‌కు రాసిన ఇంకో లేఖలో, "దక్షిణ భారతదేశం మొత్తంగా అతలాకుతలంగా వుంది. వివిధ వృత్తి పనివారు, శ్రామికులు, చేనేత కార్మికులు పనులు లేక అల్లాడిపోతున్నారు. మచిలీపట్నం, ఆర్మగం ఓడరేవులు కరువుకు ఎక్కువగా బలి అయిన ప్రాంతాలు. శవాల్ని పీక్కుతిని బతుకు దక్కించుకోవాల్సినంత ఘోరంగా వుంది ఇక్కడి పరిస్థితి. బురదని పిసుక్కు తిన్నారు. చచ్చేందుకు సిద్ధంగా వున్నవాడు కూడా ప్రాణభయంతో పారిపోతుంటే పట్టుకుని చంపి తింటున్నారు ఇక్కడి మనుషులు" అని రాశాడు.

నిజానికి ఈ భయంకర కరువు పరిస్థితి ఏర్పడినప్పుడు మచిలీపట్నానికి పాలకులుగా వున్నది రెడ్డిరాజులు, విజయనగర ప్రభువులు, గోల్కొండ సుల్తానులేగానీ, యూరోపిన్లు

కాదు. భారతీయులైన ఈ ప్యూడర్ ప్రభువులకు ఇంతటి క్షామపరిస్థితు లేర్పడినా చీమకుట్టినట్లయినా లేదంటే వీళ్ళని ఏమనాలో మీరే ఆలోచించుకోండి.

1394లో కృష్ణాతీరంలో మొదట పెద్దపెట్టున కరువొచ్చింది. 1402-03 సంవత్సరాల్లో వరదలొచ్చి తంజావూరుజిల్లా కావేరి జిల్లా పూర్తిగా మునిగిపోయింది. పంటపొలాలన్నీ బురదమయం అయిపోయాయి. జనం జలసమాధి అయ్యారు. 1412లోనూ, 1422లోనూ రామనాథ పురం, తిరుచిరాపల్లి, పుదుక్కోటి ప్రాంతాలు క్షామానికి బలయిపోయాయి. 1440లో తెలంగాణా డెక్కన్ భూబాగం కరువుతో మలమల మాడిపోయింది. ఐదు సంవత్సరాలపాటు విడవకుండా కరువు పరిస్థితులు కరాళనృత్యం చేశాయి. 1475లో శ్రీనాథుడు స్వయంగా వర్ణించిన కృష్ణానది వరదలు శ్రీనాథునితోపాటు అనేకమంది రైతుల్ని కడగండ్ల పాలు చేశాయి." కృష్ణవేణమ్మ కొనిపోయేగొంతఫలము- బిలబిలాక్షులు తినిపోయే- తిలలు, పెసలు, బొడ్డుపల్లెను గొడ్డేరిమోసపోతి- అని వాపోయాడు శ్రీనాథుడు.

1507లో మైసూర్ పరిసర ప్రాంతాలన్నీ భూకంపానికి బలి అయి నగరాలన్నీ శిధిలాలైనాయి. 1509లో వెనువెంటనే కరువు ఏర్పడి మైసూరు కోలుకోలేని స్థితిలో పడింది. 1540లో మనుషుల్ని మనుషులే పీక్కుతినే దుర్భర దారిద్ర్యం మైసూరులో కూడా తలెత్తింది. 1614లో ఇదే పరిస్థితి మరోసారి మచిలీపట్నంలో పునరావృతం అయింది. 14, 15, 16శతాబ్దాలు తెలుగు జిల్లాలో కరువునామ సంవత్సరాలుగా కన్పిస్తాయి.

విజయనగరం పాలకులకు గాని, గజపతులకుగాని, రెడ్డిరాజులకుగాని కృష్ణాతీరం వారివారి రాజ్యాల సరిహద్దు ప్రాంతంగా వుండిపోయింది. కాకతీయులకు, గోల్కొండ సుల్తానులకు కూడా మచిలీపట్నం శివారు ప్రాంతమే! అందుకే, కనీసం ఏడువందల ఏళ్ళపాటు దారుణ నిర్లక్ష్యానికి బలి అయిపోయింది ఈ ప్రాంతం అంతా!

నిజాం ఏలుబడిలో తెలంగాణా ఏమాత్రం అభివృద్ధికి నోచుకుని దుస్థితిలో పడితే, కోస్తా జిల్లాల్లో జమీందార్ల వ్యవస్థకు పాలనా బాధ్యతలు అప్పగించబడ్డాయి. శిస్తు వసూలు చేసుకోవడం, కమీషన్లు మిగుల్చుకోవడం, వారసత్వం కోసం ఒకళ్ళతో ఒకళ్ళు పోట్లాడు కోవడం, కోర్టు వ్యాజ్యాల్లో ఆస్తులు హరించుకోవడం, చెన్నపట్నంలో గానాబజాలతో గడిపేశారు రెండు వందల సంవత్సరాలపాటు మన ఘనత వహించిన తెలుగు జమీందార్లు ఎక్కువమంది! వీళ్ళలో ప్రజల కష్ట సుఖాల గురించి పట్టినవాళ్ళని వేళ్ళమీదే లెక్కించవచ్చని చెపితే, ఎవరూ కోపగించుకోవాల్సిన అవసరంలేదు.

1832-33లో గుంటూరు కరువుగా బ్రిటిష్‌వాళ్ళు పేర్కొన్న "నందన కరువు" తెలుగువారి ఆయువుపట్టుమీద పెద్ద దెబ్బ కొట్టింది. ఒంగోలునుంచి మచిలీపట్నం వరకూ

అస్థిపంజరాలు తప్ప ఇంకేమీ కన్పించలేదని **గోర్డాన్**మెకంజే కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో రాశాడు. కనీసం 20 సంవత్సరాలుపాటు ఈ ప్రాంతంలో రైతుకు వ్యవసాయం చేసే అవకాశమే రాలేదంటే ఆ పరిస్థితి ఎంత హృదయ విదారకమో అర్థం చేసుకోవచ్చు.

కృష్ణా, గోదావరి నదుల్లో నీరు కూలంకషంగా ప్రవహిస్తున్నా ఆనాడు పంటలు పండించలేక తెలుగు రైతు నిలబడిపోవడానికి ముఖ్య కారణం వర్షాధార వ్యవసాయాన్ని నమ్ముకోవడమే!

నదిలో నీటిని పంట భూములకు మళ్ళిస్తే తిరిగి పంటలు పండుతాయి. రైతులు శిస్తులు కడతారు. కంపెనీ ప్రభుత్వం ఆదాయం పెరుగుతుందని మానవతావాదులైన కొందరు బ్రిటిష్ అధికారులు కంపెనీని నమ్మించి మొదట 1837లో వల్లూరు నుంచి ఒక "కట్" తీసుకొని "పుల్లేర్లు" తవ్వించారు. అందుకు బ్రిటిష్ ప్రభుత్వానికి 32వేల రూపాయలు ఖర్చయితే, 37,600 ఆదాయం వచ్చింది.


బానిసల చిత్రహింస

ఈ ప్రయోగాన్ని చూపించి ధవళేశ్వరం దగ్గరా, బెజవాడ దగ్గర ఆనకట్టలు కట్టారు. తెలుగు రైతు మళ్ళీ పచ్చగా చిగురించగలిగాడు. కాటన్, కెప్టెన్ బకిల్, బెల్, ఓర్, పోర్బ్స్, స్టోక్స్... ఈ ఆనకట్టలు రూపుదిద్దుకోడానికి ముఖ్య కారకులనీ, 1792లోనే మేజర్ బీటన్ ఈ ప్రతిపాదనని చేశాడని, అది అరవైఏళ్ళ తర్వాత అమలయ్యిందనీ- కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో అనేక విశేషాలు రికార్డు చేయడం జరిగింది.

విదేశీ వ్యాపారులుగా బయల్దేరి, అంతో యింతో అందినంత దోచుకోడానికి వచ్చిన బ్రిటిష్‌వాళ్ళు, తమలాభం కోసమే అయినా ఒక మంచి ఆలోచన చేశారు. ప్రాజెక్టులు కట్టాలని! వారికి ముందు మనల్ని ఏలిన తెలుగు వల్లభులకు ఈ ఆలోచన ఏదీ...? ఎక్కడా కన్పించేదేం?

ఫలానా రాజు ఎన్ని రాజ్యాలు జయించాడు. ఎందరు రాణుల్ని చేరదీశాడు. ఎంద కవుల్ని పోషించాడు అనేవి మాత్రమే మనం చరిత్రలో చదువుకునే అంశాలు. ఎం ప్రజల్ని ఎంతగా పీడించాడో ఎక్కడా రికార్డు కాదు- నాణానికి ఒకవైపే చూస్తాం మ. అటువైపు ఎప్పుడూ బొమ్మే కన్పిస్తుంది. వెనకవైపు చూస్తే దాని అసలు విలువ తెలుస్తుంది! అందుకే మరో కోణంలోంచి ఈ ఆలోచన!

# డచ్ వ్యాపారులకు తెలుగు వారి ఆశ్రయం



పులికాట్‌లో డచ్ నాణాలు

దూరపు కొండలు నునుపుగానే ఉంటాయి. ఇండియాలో పోర్చుగీసులు, ఫ్రెంచ్‌వాళ్ళు, బ్రిటిషర్లూ కారట్లాడుతున్నారంటు, ఇక్కడేదో గొప్ప సంపద ఉండే వుంటుందనీ, వీళ్ళంతా కోట్లకు మూటలు కట్టేసుకొంటున్నారనీ మిగిలిన విదేశీ జాతుల వ్యాపారులకు చాలా ఆత్రంగా వుండేది.

ఇండియాని తవ్వుకొని గంపలకెత్తుకుపోవడమేనని వీరిలో చాలామందికి ఓ నమ్మకం. ెంత పెద్ద చెంబు పుచ్చుకొస్తే అంత పెద్ద చెంబుడు దొరుకుతాయనుకునే వాళ్ళు. 595–1602 మధ్యకాంలో డచ్‌వాళ్ళు ఏమైనా సరే ఈ సారి ఇండియాని వదలకూడదని ిగా అనుకున్నారు. కనీసం 15సార్లు ఈ ఏడేళ్ళ కాలంలో ఇండియాలోకి అడుగు పెలని ప్రయత్నించారట. 1602లో అనేక వాణిజ్య సంస్థలు కలిసిపోయి ఒకే సంస్థగా (యునైటెడ్ కంపెనీ పేరుతో ఏర్పడ్డాయి. 1608 నాటికి దక్షిణ ఆర్కాట్ జిల్లాలో ఈనాటి కడలూరు దగ్గర దేవానామ్ పట్టణం ఓడరేవుని చేరారు. అక్కడ వాణిజ్య కేంద్రం (ఫ్యాక్టరీ) నెలకొల్పుకోవడానికి కృష్ణప్పనాయకుడి అనుమతి కోరారు.

డచ్‌వాళ్ళని అడుగుపెట్టనివ్వకూడదని పోర్చుగీసులు ఇక్కడ విశ్వప్రయత్నం చేశారు. తంజావూరు దగ్గర తిరుమలరాజ పట్టణాన్ని కూడా వాణిజ్యకేంద్రాల కోసం ప్రయత్నించారు

డచ్‌వాళ్ళు. పోర్చుగీసుల వత్తిడికారణంగా విజయనగరం రాజు వెంకటప్ప నాయుడు ఆనాటికీ తన ఏలుబడిలోవున్న తమిళ జిల్లాల్లో ఎక్కడా డచ్ వాళ్ళకి ఆశ్రయం ఇవ్వడానికి అంగీకరించలేదు.

అప్పుడు డచ్‌వాళ్ళు కొత్త ఎత్తుగడ ఎత్తారు. వెంకటప్పా నాయుడి పలుకుబడిలో వున్న తెలుగు జిల్లాలో నెల్లూరు దగ్గర వున్న పులికాట్ (ప్రళయ కావేరి- అంటే, నెల్లూరు దగ్గర నుంచి మద్రాసు వరకు వున్న ప్రాంతం)లో కొంతభాగం కౌలుకు ఇప్పించవలసింది గానూ, అక్కడ ఒక రాతి కోటని కట్టి, అందులో యుద్ధసామాగ్రి, మందుగుండు సామాగ్రి, సీసం, గంధకం, బుల్లెట్లు, తాళ్ళు, లంగర్లు ఇలాంటివి పాడైపోకుండా దాచుకొంటామనీ ప్రార్థించారు. అగ్ని ప్రమాదాలు జరగకుండా, దొంగలు ఎత్తుకుపోకుండా, ఎండ, వానలకు తడవకుండా వుండేందుకు తమకు ఆమాత్రం రక్షణకావాలని, అందుకని రాతి ఇంటిని కట్టుకొంటామనీ అడిగారు.

డచ్‌వాళ్ళకీ, వెంకటప్పానాయుడికి ఆ మేరకు ఒక ఒప్పందం కుదిరింది. పులికాట్‌లోకి తెచ్చిన ప్రతి వస్తువుపై దాని వెలమీద 2శాతం అమ్మకం పన్నుని డచ్‌వారు చెల్లిస్తారు. డచ్‌వారు వివిధ నిత్యావసర వస్తువుల్ని తెచ్చి అమ్ముకోవచ్చు. ఈ ప్రాంతంలో మరే యూరోపియన్ వ్యాపార సంస్థనీ అనుమతించకుండా వుండేందుకు చక్రవర్తి డచ్ వారికి వాగ్దానం చేశాడు.

అలా, ఈనాటి నెల్లూరు జిల్లా డచ్‌వారి వశం అయ్యింది. కొంతకాలం తర్వాత ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ వారు నెల్లూరు సమీపంలో స్థావరంకోసం విఫలయత్నం చేసి విసిగిపోవడానికి కారణం వెంకటప్పానాయుడి వాగ్దానమే! పులికాట్‌లో విస్తృతంగా వున్న చేనేత పరిశ్రమ, లోహ పరిశ్రమ తదితర కుటీర పరిశ్రమల్లో జరిగే ఉత్పత్తుల్ని చక్రవర్తి గారు నిర్ణయించిన ధరకి కొనుగోలు చేసేందుకు డచ్ వాళ్ళు మనస్ఫూర్తిగా అంగీకరిచండంతో ఇంగ్లీషు వారిని అక్కడ చేర్చుకోవలసిన అవసరం రాజుగారికి కన్పించలేదు. అందుకే కుదరదు పొమ్మన్నాడు.

వెనకవచ్చిన కొమ్ములే వాడి అన్నట్లు తమ నోటి కూడుని డచ్ వాళ్ళు తన్నుకుపోయారనే దుగ్ధ పోర్చుగీసుల్లో ఎక్కువగా వుండేది. అసూయ ఆపుకోలేక, 1612లో డచ్ వారి కోటమీద పోర్చుగీసులు దాడిచేసి, కోటని ధ్వంసం చేసి, డచ్ వాళ్ళని పులికాట్‌లోంచి తన్ని తరిమేశ్నారు. పోర్చుగీసులు భుజ బలంప్రయోగిస్తే డచ్‌వాళ్ళు బుర్రలబలం ప్రయోగించాలని ప్రయత్నించారు. తిన్నగా రాజుగారి బామ్మర్ది ఓబి రాజుని మంచి చేసుకున్నారు. రాణిగారి

ద్వారా కథని నడిపించారు. దాంతో, విజయనగర ప్రభువు వెంకటప్ప మరిన్ని వసతులతో కూడిన ప్రాంతంలో మంచికోటని కట్టుకునేందుకు డచ్ వారికి అనుమతి ప్రసాదించాడు. ఇంతకు పూర్వం పోగొట్టుకున్న కోట కేవలం గోడౌన్ లాంటిది. కానీ, గత అనుభవాల్ని దృష్టిలో పెట్టుకుని, యుద్ధ ప్రమాదాలను తట్టుకునే రీతిలో రాజుగారి కోటలాగా కట్టించారు డచ్‌వారు. దానికి "కేజిల్‌గెల్డ్రియా" అని పేరు పెట్టారు.

ఆ తర్వాత పోర్చుగీసులు పులికాట్ వైపు కన్నెత్తి చూసే సాహసం చెయ్యలేదు. ఏవో కొన్ని చెదురుమదురు సంఘటనలు తప్పిస్తే! మధ్యలో ఇంగ్లీషు వాళ్ళు తలదూర్చే ప్రయాత్నాలు చేశారు గానీ, అవీ సాగలేదు. అందుకే, బందరులో, బిఛాణా ఎత్తేయాలని ప్రయత్నించిన ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ పులికాట్‌లో స్థావరం దొరక్క తిరిగి బందరుకే చేరింది.

1619లో డచ్ వాళ్ళే ఇంగ్లీషు కంపెనీతో కొంత మేర సహకరించుకునేందుకు ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈ ఒప్పందం ప్రకారం, పులికాట్‌లో డచ్ వారికి కేటాయించిన కొంత భూమిలోనే ఇంగ్లీషు వాళ్ళు కూడా ఒక వాణిజ్య కేంద్రం (ఫ్యాక్టరీ) ఏర్పరచుకొంటారు. తూర్పు తీరాలలోని సుగంధ ద్రవ్యాలతో 1/3వ వంతు బ్రిటిష్ వాళ్ళ వ్యాపారం చేసుకోవడానికి డచ్‌వారు సహకరిస్తారు. పోర్చుగీసులు గాని, స్పెయిన్ వారు గాని ఫ్రెంచివారు గానీ, దాడులు చేస్తే ఎదుర్కొనేందుకు డచ్‌వారితో బ్రిటిష్ వారు సహకరించేందుకు వీలుగా సముద్రం మీద ఈ ఇద్దరూ కలిసి ప్రయాణిస్తారు. ఈ ఒప్పందం 7వ ఆర్టికల్ ప్రకారం డచ్‌వారి నౌకలకు బ్రిటిష్‌వారు ఆసరాగా వుంటారు. బదులుగా ఇంగ్లీషు వాళ్ళు తమ సరుకుల్ని ఫ్రీగా ఎగుమతి చేసుకోవడానికి డచ్‌వారు అంగీకరించారు. అయితే పులికాట్‌లో అయ్యే కోట నిర్వహణ ఖర్చులు మాత్రం ఇంగ్లీషు వాళ్ళు భరించవలసి వుంటుంది. ఇదీ ఆ ఒప్పందం.

జూన్ 1621 నుంచి ఈ ఒప్పందం అమల్లోకి వచ్చింది. బ్రిటిష్ వారు డచ్‌వారికి అతిథులుగా పులికాట్‌లో కాలుపెట్టారు. ఈ ఒప్పందం అమల్లో సాధ్యాసాధ్యాల పరిశీలని రెండు వైపులవారు పెద్దగా చేసినట్లు కన్పించదు. ఎందుకంటే, "నువ్వొకందుకు పోస్తే నేనొకందుకు తాగుతున్నాను-అనే ధోరణిలో రెండు పక్షాలు వ్యవహరించదలచాయి. కాబట్టి!

బ్రిటిష్ వాళ్ళకి 1/3వ వంతు వ్యాపారం తాయిలంగా చూపించి, తమ నౌకలకు కాపలాదార్లుగా వాడుకోవాలని డచ్‌వాళ్ళు చూశారు. బందరులో అప్పులు పెరిగి పోయి కంపెనీ దివాళా తీసే స్థితిలో మరో మంచి మార్కెట్ కోసం వెంపర్లాడి పోతున్న బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీకి, పులికాట్‌లో స్థావరం ఏదో ఒక రూపేణా దొరకడం చాలా

అవసరం ఆనాటికి, ఈ ఒప్పందాన్ని అలా ఉపయోగించుకోదలిచారు బ్రిటిషర్లు. ఒకరిమీర ఒకరికి పరస్పరం నమ్మకం లేని స్థితిలో జరిగే ఇలాంటి ఒప్పందాలకు విలువ వుండదు.

పులికాట్‌లో బ్రిటిష్ వారి వ్యాపారాలకు సంబంధించిన వస్తుసామాగ్రిని కోటలోపల భద్రపరిచారు. వాటికోసం అయ్యే ఖర్చులో సగం, కౌలులో, సగం చెల్లించుకుంటూ, బ్రిటిష్ వాళ్ళు కోటబయట కాందిశీకుల్లా గడిపే పరిస్థితి ఏర్పడింది. డచ్ తరపున జేమ్స్-1, ఇంగ్లీషు కంపెనీ తరపున మెథవాల్డ్ మధ్య జరిగిన ఈ ఒప్పందం కౌగిలించుకున్న శత్రువుల మధ్య స్నేహంలా సాగింది.

మాథ్యూడ్యుర్ అనే బ్రిటిష్ అధికారి కంపెనీ వారికి ఆనాడు రాసిన ఒక ఉత్తరంలో ఈ ఒప్పందం లాభదాయకమైందని తనకు ఏమాత్రం అన్పించడం లేదన్నాడు. మనతో సంప్రదించి డచ్‌వాళ్ళు ఏమీచేయడంలేదు. ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకొని మనల్ని వాటిని పాటించమని ఆజ్ఞాపిస్తున్నారని రాశాడు. ఇతరుల దిక్కుని చూస్తూ మనం మన నావని ఎన్నాళ్ళు నడప గలుగుతాం? అని ప్రశ్నించాడు. మేక చర్మం తొడుకున్న తోడేళ్ళు ఈ డచ్‌వాళ్ళు అన్నాడు. ఈ ఉత్తరం బ్రిటిష్ వారిలో పునరాలోచనల్ని రేకెత్తించింది. పులికాట్‌లో డచ్‌వారికో నమస్కారం పెట్టి, పెట్టే-బేడా సర్దుకొని మళ్ళీ మచిలీపట్నం బయలుదేరారు బ్రిటిషర్లు. చెన్నపట్నంలోనే స్థావరం దొరికే వరకూ బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీకి తలదాచుకునే తావైనా లేదన్నట్లుంది పరిస్థితి.

దూరపుకొండలు నునుపు చూసి, ఇండియా ఉపఖండం వైపు డచ్‌వారి తర్వాత డేనిష్ ఈస్టిండియా కంపెనీ కూడా ప్రయాణం కట్టింది. డేనిష్ కంపెనీ మొదట సింహళ ద్వీపం(శ్రీలంక) దగ్గర ఆగింది. అక్కడ పోర్చుగీసుల ఆగడాలు మితిమీరి నడుస్తుండటంతో సింహళ కాండ్యరాజు డేనిష్ కంపెనీ అధికారుల్ని ఆహ్వానించి పోర్చుగీసుల పీడ వదిలించుకోవాలని ఆలోచించాడు. 1616లో ఈ సంఘటన జరిగింది. "మెర్సెల్లస్ డి బోసహోవర్" అనే డచ్ అధికారి డెన్మార్క్ ప్రభుత్వంతో మధ్యవర్తిత్వం నెరిపి, కొంత కథ నడిపాడు. ఈ కథ చాలా వుంది.

# కలచెదిరిన బందరు కలంకారీ!




క్రీ.శ.1611

మచిలీపట్నంలో కలంకారీ చేనేత కార్మికుల కళాకౌశలాన్ని ఉపయోగించుకోవడానికి మొట్ట మొదటగా బ్రిటిష్‌వారు బందరులో బట్టల మిల్లులు నెలకొల్పారు. 1621లో నిజాంపట్నంలో ఇంకో బట్టలమిల్లుని, 1634లో వీర వాసరంలో మరో మిల్లునీ... ఇలా అనేక బట్టల మిల్లులు వ్యవస్థాపించారు. ఇవికాక చేనేత పనివారి నుంచి కూడా బట్టని సేకరించేవారు.

తొలిదశలో ఈ మిల్లుల వలన స్థానికంగా చేనేత కార్మికులకు చాలా మేలు కల్గింది.

ఈస్టిండియా కంపెనీకి సంబంధించిన కోర్టు డైరెక్టర్లు ఏ ఏడాది కాఏడాది తమకు ఎంత సరుకు కావాలి, ఎంత నాణ్యతలో కావాలి, ఎంత పరిమాణంలో కావాలి వంటివి బోర్డ్ ఆఫ్ ట్రేడ్‌కు తెలియజేసేవారు.

బోర్డు ఈ ఆదేశాన్ని వివిధ మిల్లులకు తెలియజేసి, ఆ మేరకు ఉత్పత్తి జరిగేలా చూడవలసిందిగా కమర్షియల్ రెసిడెంట్స్‌ను ఆదేశించేది!

ఈ కమర్షియల్ రెసిడెంట్ ఈస్టిండియా కంపెనీకి ఏజంట్‌లాంటివాడు. ఈ ఏజెంటు స్థానికంగా వున్న కాంట్రాక్టర్లకు కొంతసొమ్ము అడ్వాన్స్‌గా ఇచ్చి వారి ద్వారా చేనేత కార్మికులనుంచి బట్టని సేకరించేవారు. అందుకు కాంట్రాక్టర్‌కు 5 శాతం వరకూ కమిషన్ లభించేది.

ఇలా కంపెనీ నుంచి ఆర్డర్లు బాగా రావడంతో చేనేత కార్మికుల ఇళ్ళలో ఆడవాళ్ళు కూడా బాగా కష్టపడి ఉత్పాదకతని పెంచే ప్రయత్నం చేశారు.

ఒక దశలో ఇళ్ళలో ఎందరు ఆడవాళ్ళుంటే అంత ఉత్పత్తి జరిగే స్థితి ఏర్పడింది. ఫలితంగా చేనేత కుటుంబాల్లో బహుభార్యాత్వానికి ఇది దారితీసింది కూడా! అది వేరే సంగతి!

16వ శతాబ్దంలో సుమారుగా అర్ధశతాబ్ది కాలంపాటు తెలుగు నేల మీద చేనేత పరిశ్రమ మూడు పువ్వులు- ఆరుకాయలుగా వెల్లువెత్తిన మాట వాస్తవం! క్రమేణా ఇంగ్లీషు

కాంట్రాక్టర్ల పాత్ర పెచ్చు మీరడంతో వాళ్ళని నమ్మి అడ్వాన్సు లేకుండా వస్త్రాలు సప్లై చేసిన చేనేత కార్మికులు మోసపోవడం మొదలయ్యింది. కిందినుంచి పైదాకా కాంట్రాక్టర్ల నుంచి కంపెనీ అధికారులదాకా అవినీతి జాడ్యం ఆవహించింది.

కంపెనీ గుమాస్తాలు డబ్బు చెల్లించే విషయంలో చేనేత కార్మికుల్ని బాగా ఏడిపించారు. ఖర్చులు కూడా రాని స్థితిలో కార్మికుడు చిక్కుకుపోయాడు. ఎదురుతిరిగిన వాడి మీద నేరాలు మోపి శిక్షించడం ప్రారంభించారు.

ఈస్టిండియా కంపెనీ అనాలోచితంగా బంగారు గుడ్డు పెట్టే బాతుని అత్యాశకుపోయి ఒకేసారి కోసుకుతినే ప్రయత్నంచేసింది. బందరు కలంకారీ చావుదెబ్బ తినడానికి ఇదే ముఖ్య కారణం.

1688 బ్రిటన్‌లో వెల్లువెత్తిన పారిశ్రామిక విప్లవం స్వదేశీ వ్యాపారం ఇందుకు తోడయ్యింది. 1704 నాటికి బందరు రేవుని మూసివేసే పరిస్థితులొచ్చాయి. బందరు ఓడరేవు చేనేత పరిశ్రమతోపాటే మూసివేతకు గురయ్యింది!

16వ శతాబ్ది ప్రారంభంలో ఏడాదికి 50 లక్షల రూపాయిల వస్త్రాలు ఎగుమతి చేసిన బందరురేవు - ఆ శతాబ్ది చివరినాటికి శూన్యంగా మారిపోయింది.

* * * * *


మచిలీపట్నం ఓడరేవు

క్రీ.శ. 1688

విదేశీ వర్తక వాణిజ్యాలలో ఫ్రెంచివారు, డచ్‌వారు, పోర్చుగీసులు తదితరులతో పోటీపడి, వాళ్ళని అధిగమించి, ఏకఛత్రాధిపత్యం సాధించాలని బ్రిటిష్ పార్లమెంట్ నిర్ణయించింది.

కొత్తగా సమకూరిన పారిశ్రామిక విప్లవం ఫలితం కూడా ఇది కావచ్చు.

అప్పటికే ఈస్టిండియా కంపెనీ మచిలీపట్నం తదితర ప్రాంతాలలో కొన్ని స్థావరాలు ఏర్పాటు చేసుకుని, వర్తక వాణిజ్యాలు నిర్వహిస్తోంది.

కొత్త నిర్ణయం ప్రకారం ఇంగ్లీషు కంపెనీ ప్రారంభించి, కొన్నాళ్ళ తర్వాత పాత ఈస్టిండియా కంపెనీని, దీనిని విలీనం చేసి, యునైటెడ్ ఇంగ్లీష్ ఈస్టిండియా కంపెనీనీ నెలకొల్పారు. పాత ఈస్టిండియా కంపెనీ బోర్డు తిప్పేసిందన్న మాట!

24-8-1704న ఈ కొత్త ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో తన వ్యాపార కార్యాలయాలతో పాటు, ఈ దేశంలో అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే కుట్రలకు శ్రీకారం చుట్టింది.

ఈ కుట్రలో మొదటి అంకం మచిలీపట్నంలోనే జరిగింది.

వ్యాపార నిమిత్తం పాత ఈస్టిండియా కంపెనీ చేసిన అప్పులన్నీ ఎగనామం పెట్టి, బోర్డు తిప్పేసి కొత్త యునైటెడ్ ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీతో కొత్త లావాదేవీలు ప్రారంభించారు. పాత అప్పులతో ఈ కొత్త కంపెనీకి సంబంధం లేదన్నట్లు వ్యవహరించారు.

21-12-1705న మచిలీపట్నంలోని వ్యాపారులు ఒక సంఘంగా ఏర్పడి, పాత కంపెనీ ద్వారా తమకు రావలసిన బకాయిల వివరాలు తెలియజేసి, వాటిని వెంటనే చెల్లించకపోతే, తమకు పస్తులే గతి అని ఒకరు రాశారు.

ఆనాటి మద్రాసులో సెయింట్ జార్జి ఫోర్ట్‌కి 'థామస్ పిట్' అప్పట్లో గవర్నర్‌గా వున్నాడు.

బందరులోని వాణిజ్య కార్యకలాపాలన్నీ స్తంభించిపోయాయి. సరిగ్గా ఇదే సమయానికి, వార్న్ హేస్టింగ్స్ విశాఖపట్నం ఓడ రేవుకు అధికారిగా వచ్చాడు. అతను లోపాయికారిగా విశాఖపట్నం వర్తకులతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం వైజాగ్ పట్నం నవాబ్‌ను పక్కకు తప్పించి, బ్రిటిష్‌వారు, ఈ వ్యాపారులూ కలిసి వైజాగ్ ఓడరేవుని కైవసం చేసుకున్నారు. ఆ విధంగా మచిలీపట్నం ఓడరేవు ప్రాముఖ్యత క్రమేణా తగ్గి విశాఖపట్నం ప్రాముఖ్యత పెరిగింది.

బందరు పాలకులుగా వున్న సుల్తాన్‌లు ఈ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు.

బందరులో రెండు మరఫిరంగులు మాత్రం వదిలి, పెట్టె బేడా సర్దుకుని ఈస్టిండియా కంపెనీ పూర్తిగా బిఛాణా ఎత్తేసి విశాఖపట్నం చేరింది!

ఈనాటి మన చిట్‌ఫండ్ కంపెనీల కథలాంటిదే ఇది!

150 పగోడాలకు ఒక పర్షియన్ గుర్రం బందరులో దొరికేదట! అంతచవకగా ఉండేది బందరులో వ్యాపారం. అలాంటి వాణిజ్యకేంద్రాన్ని వదులుకోవడం చాలామంది యూరోపియన్లకు ఇష్టంగా వుండేదికాదు-

అందుకే, విశాఖపట్నం ఓడరేవు నుండి బ్రిటిష్‌వారి పక్షాన వ్యాపార లావాదేవీలు చూడటానికి కిట్టి నారాయణ అనే వ్యాపారిని నియమించారు.

అతను కొత్త ఈస్టిండియా కంపెనీ ప్రతినిధిగా వ్యవహరించేవాడు. 'పాత విషయాలు వదిలేయండి- అయ్యిందేదో అయింది- కొత్త వ్యాపారం మొదలెడదాం...' అనే నినాదంతో విశాఖపట్నం నుండి మద్రాసు ఓడరేవు దాకా మధ్యలో వున్న వాణిజ్యకేంద్రాలన్నింటినీ తిరిగి వ్యాపారంలోకి కిట్టించడం ఈ కిట్టినారాయణ డ్యూటీ!

ఆ విధంగా బందరు మూడు వందల ఏళ్ళనుండి ఈనాటి వరకూ దారుణ నిర్లక్ష్యాలకు బలి అవుతూనే వుంది. ఒక నాడు రోము నగరాన్ని తన వ్యాపార చాకచక్యంతో వ్యామోహంలో ముంచెత్తిన బందరు ఓడరేవు కథ... ఇలా ముగిసిందని అనడం విచారకరమే మరి!

# చేనేత చేతులు విరిచిన కంపెనీ పాలన


(కలకత్తా - కంపెనీ గవర్నమెంట్ హౌస్)

1880 వరకూ అంతర్జాతీయ మార్కెట్‌ని అమెరికన్ పత్తి ఎక్కువగా ఆక్రమించింది. అమెరికన్ పత్తికి సమానంగా వుండి, అమెరికా పత్తిలాగే వుండే 'పెద్దపత్తి'ని తెలుగు జిల్లాలో ఎక్కువగా పండించారు. ఈ పత్తికి మార్కెట్ ఎక్కువగా వుండటం, రేగడిభూముల్లో ఇది బాగా పడటం ఇక్కడ కలిసివచ్చిన అంశాలు. ఎఱ్ఱపత్తి, పునాగుపత్తి, కొడపత్తి, భమిడిపత్తి ఇలా అనేక పత్తి రకాలు ఇక్కడ పండేవి. పమిడిపత్తిలోంచి జంధ్యాలు, ముతకబట్టలు తయారు చేసేవాళ్ళు.

అమెరికన్ పత్తి గురించి ఇక్కడి రైతులు సరిగా అర్థం చేసుకోకపోవడం వలనగానీ, భౌగోళిక పరిస్థితులు భిన్నంగా వుండటం వలనగానీ విదేశీ విత్తనాలు నాటినప్పుడు ఇక్కడ మంచి ఫలితాలు రాలేదు. ఎన్నిరకాల ప్రయోగాలు చేయించినా అమెరికా పత్తి అంత నాణ్యమైన పత్తిని ఇక్కడ ఉత్పత్తి చేయలేకపోయారు. సద్వినియోగం చేయగలిగి వ్యవసాయం కారు చౌకగా వుండే కోస్తా జిల్లాల్లో తెలుగువాళ్ళు అమెరికన్ పత్తి విత్తనాల్ని చక్కగా పండించగలిగి వుంటే, అమెరికాని ఎడంచేత్తో గెలవగలిగేవాళ్ళం అనే బ్రిటిష్ వారి భాధ-చాలా స్పష్టంగా వాళ్ళరాతల్లో కన్పించేది. అనాయాసంగా దొరికిన అమాయకపు తెలుగురైతు అమెరికా రైతు అంతటివాడు కాదని, చేతకాని దద్దమ్మ కాబట్టే అమెరికా వాడు పండించిన పత్తిని వీడు పండించలేకపోతున్నాడనీ చిరాకుపడే వాళ్ళు బ్రిటిషర్లు. గొడ్డుకు మేత పెట్టకుండా పాలం తిన్నగా దున్నలేదని బాదినట్లుంది పరిస్థితి!

1880 నాటికి గుంటూరులో పత్తి బేళ్ళు కట్టే మూడు ప్రెస్‌లు వుండేవి. 300పౌండ్లు బరువు బేళ్ళు కట్టే వాళ్ళట. ఎక్కడెక్కడో పండిన పత్తిని ఇక్కడకు తెచ్చి బేళ్ళు కట్టి ఇక్కణ్ణించి ఎగుమతులు చేసేవాళ్ళు. 1876-1882 మధ్య పత్తి ఎగుమతికి సంబంధించి, మెస్సర్స్ గిల్ డీన్ 450 నివేదిక ప్రకారం, కాకినాడ ఓడరేవు నుంచి 1,05,032 బేళ్ళూ, బందరు ఓడరేవునుంచి 11,418 బేళ్ళు, మద్రాస్ నుంచి 10,100 బేళ్ళు, నెల్లూరు నుంచి 60బేళ్ళు ఎగుమతులయ్యాయట. మద్రాస్ ప్రావిన్స్‌లో జరిగిన పత్తి ఎగుమతులు 1,26,610బేళ్ళుండగా, అందులో ఐదోవంతు-21,100బేళ్ళు కేవలం గుంటూరు నుంచే వెళ్ళాయని ఈ మెస్సర్స్ గిల్‌డీన్ 450 ఇచ్చిననివేదిక ప్రకారం తెలుస్తోంది. ఒక పౌండు పత్తికి మూడు అణాలు చెల్లించే వాళ్ళట. మూడువందల పౌండ్ల పత్తి బేలుకి 54 రూపాయలు వచ్చేవి. మొత్తం పత్తి ఎగుమతులమీద బ్రిటిష్‌వారి లెక్కప్రకారం లక్ష స్టెర్లింగులు కేవలం గుంటూరుకు పత్తికి బదులుగా చెల్లించడం జరిగిందని ఈ నివేదిక సారాంశం. 'అమ్మో! ఈ తెలుగోళ్ళకి లక్ష స్టెరింగులు ఇచ్చేశాము!' అనుకున్నారు-కాదు చౌకధరకి పండిన పత్తినంతా దోచుకుని బ్రిటిషర్లు పైగా ఇంత పత్తి పంట పండినందుకు భూమిశిస్తు, ఇతర శిస్తులు అదనంగా వసూలు చేశారు. ఈ లక్ష స్టెర్లింగుల పత్తిని ఎన్ని లక్షలకు విదేశీ మార్కెట్లో అమ్ముకున్నారో పండించిన తెలుగు రైతుకు అనవసరమైన అంశం కదా!

1775లో 'స్పిన్నింగ్ జెన్నీ'ని కనుగొన్న తర్వాత బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం మొదలయి, మాంచెస్టర్ గుడ్డలు ప్రపంచమార్కెట్‌పై ఆధిపత్యం చెలాయించడం ప్రారంభం అయింది. అయినా, బందరు కలంకారీకి మార్కెట్ బాగానే వుండేది. పర్షియన్ గల్ఫ్‌లో 19వ శతాబ్ది మొదలయ్యే వరకూ బందరు కలంకారీ ఉత్పత్తులకు గొప్పడిమాండ్ వుంటుండేది. సంవత్సరానికి 50లక్షల రూపాయల ఎగుమతిని బందరు కలంకారీ కొనసాగించగలిగింది కూడా. అలాగే కొండపల్లి, రేపల్లె, బాపట్ల, ఉప్పాడ, నీలపల్లి, నర్సపూర్, అనకాపల్లి, తుని, శ్రీకాకుళం (చికాకొల్లు)లలో తయారయ్యే చీరలు, కార్పెట్లు, దుప్పట్లు-ఇంగ్లీషు సిల్క్ దారాన్ని తట్టుకుని నిలబడగలిగాయి. గుడారాలు వేసుకునేందుకు ఉపయోగించే మందపాటి గుడ్డనేయడంలో రాజమండ్రికి ప్రసిద్ధి వుండేది. ఆఖరికి సెంట్రల్ జైల్లో ఖైదీల చేత కూడా నవ్వారునీ, ఈ మందపాటిగుడ్డనీ నేయించేవాళ్ళు. ఏలూరులో తయారయ్యే జంపకాణాలకు (కార్పెట్లు) మంచి గిరాకీ వుండడంతో పర్షియన్ వ్యాపారులు కొంతమంది ఏకంగా ఏలూరులోనే స్థిరనివాసాలేర్పరచుకుని, ఇక్కడే వుండిపోయి, ఇక్కడి నుండి వ్యాపారాలు నిర్వహించడం మొదలు పెట్టారు. అనకాపల్లి, పాయకరావుపేట, నక్కపల్లి, తుని వస్త్రాలకు ఒక ప్రత్యేకత వుండేది. ఇక్కడ నేసిన బట్టని 'పుంజము' అనే

వాళ్ళు. 'పుంజము' అంటే అరవై పోగులతో నేసిన బట్ట అనే అర్థం (Skein of Sixty Thread). బ్రౌన్ నిఘంటువులో కన్పిస్తుంది కాని, 1869నాటి వైజాగ్‌పటం డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో '120 పోగులుబట్టగా దీన్ని వివరించారు. 'పదిపుంజముల బట్ట' అంటే, 10×20=1200 పోగులుంటాయని అర్థం. ఇలా 10,12,14,....40 పుంజముల బట్టదాకా నేసే వాళ్ళట. లండన్, బ్రెజిల్, మెడిటరేనియన్ మార్కెట్లో ఈ పుంజముల బట్టలకి మంచి గిరాకీ వుండేది.

'జార్జి హడ్సన్' ఒక ఓడ యజమాని 1869లో వైజాగ్ పటం కమీషన్ ఏజెంట్‌గా వుండేవాడు. ఆయన సమకూర్చిన నివేదిక ప్రకారం, ఆ రోజుల్లో ఒక చీర ఖరీదు 3 రూపాయిల నుంచి 8 రూపాయిల వరకూ ఉండేదని, బంగారం లేక వెండితో చేసిన జరీచీరకి 100, ఆపైన ధర పలికేదనీ తెలుస్తోంది. సాగరాంధ్ర జిల్లాలో శ్రీకాకుళం, వైజాగ్ పటం మార్కెట్లనుంచి ఎగుమతి అయ్యే బట్ట నాణ్యతలో ఘనంగా వుండేదని ఈ జార్జి హడ్సన్ నివేదిక వెల్లడించింది. ఇంగ్లీషు దేశాల్లో సాధారణ ప్రజలు, కార్మికులు, ఇతర పనివాళ్ళూ వాడుకునేందుకు దీటైన చౌకరకం బట్టలు, టవల్స్, లుంగీలవంటివి కూడా ఇక్కడ నుంచి బాగా ఎగుమతి అయ్యేవి. స్థానికులు ముతకరకం పత్తితో నేసిన బట్టలే ఎక్కువగా కట్టుకునేవాళ్ళు. ఎవరో కొందరు ధనికులు మాత్రం దొరబాబుల పంచెలు వాడేవాళ్ళు.

పారిశ్రామిక విప్లవం తర్వాత కూడా బ్రిటన్ ఇక్కడి నుంచి ముడిసరుకుని దిగుమతి చేసుకుని మరమగ్గాల మీద బట్టలు నేసి తెచ్చి, మళ్ళీ మనకే అమ్మాలని ప్రయత్నించారు. కానీ, ఇక్కడ కొనేనాథుడు కరువయ్యాడు. ఎందుకంటే ఐదువేళ్ళూ నోట్లోకి పోయిన సందర్భాలు అరుదుగా వుండే, దుర్భరజీవితాన్ని సామాన్యుడు భరిస్తున్నాడు కాబట్టి. భారతదేశంలో స్థానికంగా బట్టలు నేయడాన్ని ఆపితే గానీ, ఇంగ్లీషు బట్టకి గిరాకీ పెరగదని అప్పుడే నిర్ణయించుకున్నారు.

నిజానికి, 1775 వరకూ బ్రిటన్‌లో నేత పరిశ్రమ కూడా ముతకరాట్నం మీద పోగులు తీసి దేశవాళీ మగ్గాల మీద నేసిన పద్ధతి లోనే వుండేది. అక్కడ ఉత్పత్తి తక్కువ. చేనేత కార్మికులు తక్కువ కావడాన భారతీయుల ఉత్పత్తితో పోల్చినప్పుడు ఇంగ్లీషు చేనేత చాలా వెనకబడి వుండేది. వారి ఉన్ని బట్టలు ఇక్కడి వాతావరణానికి అనుకూలంగా వుండేవి కాదు. కాబట్టి, తాము నేసిన బట్టలతో ఇండియాలో ఏమీ సాధించలేకపోయింది ఈస్టిండియా కంపెనీ.

ఈ దశలో అతిసన్నని నూలు తీయడం వారికి సాధ్యం అయింది. వస్త్ర పరిశ్రమలో మౌలిక విప్లవం 'కలగడానికి ఇది ముఖ్య కారణం. జేమ్స్ హారీ గ్రీవ్స్ అనే ఇంగ్లీషు నేతగాడికి తన భార్య నూలు వడుకుతున్న దృశ్యం చూసి జాలి కలిగింది. ఒకరోజు పని వత్తిడి వలన కలిగిన నీరసంతో ఆమె కళ్ళు తిరిగిపడిపోయింది. ఆ ఊపులో కాళ్ళు

తగిలి రాట్నం పక్కకి ఒరిగిపోయిందిట. చూశాడు గ్రీవ్స్. భార్యని లేపి ఉపచర్యలు చేశాడు. పక్కకు ఒరిగిన రాట్నం అడ్డంగా కూడా తిరగడం గమనించాడు. చక్రం తిరుగుతూనే వుంది. కుదురు కదులుతూనే ఉంది. అప్పుడతనికి ఒక ఆలోచన వచ్చిందట... ఒకే చక్రంతో అనేక కదురుల్ని కలిపి తిప్పితే హెచ్చుదారం వస్తుంది కదా. అని!

ఈ ఇంగ్లీషు చేనేత కార్మికుడికి కొద్దిగా వడ్రంగం పని కూడా తెలియడంతో తన ఊహలకు తగ్గట్టుగా ఎనిమిది కదుళ్ళు పెట్టి పెద్ద రాట్నాన్ని తయారుచేశాడు. ఎనిమిదిమంది వడికిన దారాన్ని ఒక్క ర్నాటంతోనే వడకడం సాధ్యం అయింది.

1770లో 16 కదురులతో మరింత పెద్ద రాట్నం తయారు చేశాడు గ్రీవ్స్. అతని భార్య పేరు జెన్నీ. ఈ పెద్ద రాట్నానికి 'స్పిన్నింగ్ జెన్నీ' అని పేరు పెట్టాడు. అదే ఆధునికవస్త్ర పరిశ్రమ సృష్టించిన పారిశ్రామిక విప్లవానికి ముఖ్యభూమిక వహించింది.

విద్యుచ్ఛక్తి వినియోగంలోకి వచ్చే వరకూ ఈ స్పినింగ్ జెన్నీ అందించిన సన్ననూలుతో చేనేత వస్త్రాలే తయారయ్యేవి. కరెంట్ వచ్చిన తర్వాత మరమగ్గాలు వస్త్ర పరిశ్రమ స్వరూపాన్నే సమూలంగా మార్చేశాయి.

కానీ, ఈ ఆధునిక పరిజ్ఞానాన్ని దేన్నీ భారతదేశానికి అందనీయలేదు కంపెనీ ప్రభుత్వం. ప్రభుత్వం పూనిక లేకుండా భారతీయులు దానికదే అందుకోగలిగే అంశం ఇది ఎంత మాత్రం కాదు. ఇంతకన్నా ఎక్కువ తెలివితేటలు ఎవరైనా ప్రదర్శిస్తే అనుమానితుల లిస్టులో చేరి పోవాల్సి వచ్చేది.

ముడిసరుకును ఉత్పత్తి చేయడానికి తప్ప, మరే విధమైన పరిజ్ఞానమూ భారతీయులకు వుండనీయకూడదనే స్పష్టమైన విధానంతో పాలించిన బ్రిటిష్ కంపెనీ దుష్టపాలన భారతచరిత్రలో చీకటి అధ్యాయల్ని సృష్టించింది. ఇందుకు ఎంత నష్టపరిహారం చెల్లించినా బ్రిటన్, భారతీయులకు చేసిన ద్రోహం చెల్లు కాదు.

పత్తి పండించడంలో ముందుండి, అగ్గిపెట్టెలో పట్టిన వస్త్రాలు నేయగల సామర్థ్యం వుండి, వస్త్ర పరిశ్రమలో భారతీయులు వెనక్కి మళ్ళడానికి గల కారణాల్ని విశ్లేషించు కున్నప్పుడు ఆత్మాభిమానం గల ఎవరికైనా రక్తం పొంగుతుంది.

అయినా పెద్ద హృదయంతో మనం వాళ్ళని క్షమించినా, మళ్ళీ ఇంకోసారి మల్టినేషనల్ కంపెనీలకు ద్వారాలు తెరుస్తూ దానికి సంస్కరణలనే ముద్దుపేరు తగిలించే బుద్ధి హీనతని భవిష్యత్తరాలు క్షమించలేకపోవచ్చు. భారతదేశాన్ని ఐదువందల ఏళ్ళు వెనక్కి నెట్టిన బ్రిటిష్ పాలన చేసిన అపకారాన్ని మరిచిపోకూడదు.

# ఈస్టిండియా కంపెనీని ఒక ఆట ఆడించిన శివాజీ

'మీ ఇంగ్లీషు వాళ్ళు గాని, ఫ్రెంచివాళ్ళు గాని కేవలం వ్యాపారులుగా వ్యవహరించినంతకాలం నా వలన ఎలాంటి ప్రమాదమూ రాదు. మా రాజకీయ వ్యవహారాలలో తలదూరిస్తే సహించను-' అని స్పష్టంగా చెప్పాడు శివాజీ. అది బ్రిటిష్ వారి నైజానికి విరుద్ధమైన అంశం. అందుకే శివాజీని వాళ్ళు విశ్వసనీయమైన మిత్రుడిగా భావించుకోలేకపోయారు.

శివాజీ సామ్రాజ్యానికి చుట్టూ ఉన్న బ్రిటిష్ వాణిజ్య కేంద్రాలన్నింటినీ శివాజీకి అందనంతగా మరింత దూర ప్రాంతాలకు తరలించడం ప్రారంభించారు. ధార్వార్‌లో వున్న ఫ్యాక్టరీని హుబ్లీకి తరలించింది ఈ కారణంగానే.

1665లో బ్రిటిష్ యువరాజు చార్లెస్‌కు పోర్చుగల్ రాకుమారిని ఇచ్చి పెళ్ళి చేసి పోర్చుగల్ రాజు భారతదేశంలో తన ఆధీనంలోని బొంబాయి ఓడరేవుని అల్లుడికి వరకట్నంగా రాసి ఇచ్చేశాడు. ఆనాటికి బొంబాయి ఓడరేవు మురికికూపంగా వుండేదట. ఓడలు ఆగేందుకు కనీస వసతులు లేకపోవడంతో బ్రిటిష్ యువరాజు దాన్ని బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీకి సంవత్సరానికి 10 పౌండ్ల నామమాత్రపు అద్దెకిచ్చేశాడు. అది వేరే కథ. దాని గురించి విడిగా వివరించాను చూడండి.

శివాజీ సూరత్‌ని స్వాధీనం చేసుకున్న తర్వాత సురక్షితమైన ఓడరేవు కోసం వెదకుతున్న బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీకి ఇది నిజంగా అందివచ్చిన అవకాశమే అయింది. సూరత్ ఫ్యాక్టరీ (వాణిజ్యకేంద్రం)ని నేరుగా బొంబాయికి తరలించేశారు. ఆ మురికి కూపాన్ని ఓడల రాకపోకలకు అనుగుణంగా మార్చడానికి కంపెనీకి చాలా ఖర్చయింది. శివాజీ భయం ముందు ఇది పెద్ద ఖర్చుగా వాళ్ళకు కన్పించలేదు. వీళ్ళకి ప్రోత్సాహంగా వుండేందుకు బ్రిటిష్ ప్రభుత్వం తమ దేశానికి చెందిన ఓడలన్నీ బొంబాయి రేవుకు తప్పనిసరిగా వచ్చి ఆగాలని ఆదేశించింది కూడా!

నిజానికి కంపెనీవాళ్ళు శివాజీ జరిపే దాడుల గురించి మాత్రమే ఆలోచించారు కానీ, బొంబాయికి ఓడలు రావాలంటే, ఆ ఓడలు శివాజీకి చెందిన ఓడరేవుల్ని దాటి రావాల్సి వుంటుందనే సంగతి మరచిపోయారు. మొత్తం బొంబాయికి తరలివచ్చిన తర్వాత ఏర్పడిన ఈ కొత్త సమస్యకు పరిష్కారం ఏమిటో అర్థం కాలేదు. చివరికి కొంత సుంకం

చెల్లించే పద్ధతి మీద, ఓడలు సురక్షితంగా శివాజీ ఓడరేవుల్ని దాటేలా ఆయనతో ఒప్పందం కుదుర్చుకోవడమే మేలని భావించారు.

ఇంగ్లీషు వాళ్ళు చచ్చినట్లు తన దగ్గరకు వస్తారని శివాజీకి తెలుసు. వచ్చేలా చేసుకోగలగడమే అతని ఘనత! ఇంగ్లీషు వాళ్ళకి లొంగకుండానే వారి సహకారం తీసుకోవాలనేది శివాజీ ఆలోచన. ఆయుధాలు, కోటలు, గనులు ఇవీ- శివాజీ కోరికలు. ఇంగ్లీషు వారి వ్యాపారాలు, వారి ఆస్తులు శివాజీ దోపిడీలకు గురికాకుండా వుండాలనేది బ్రిటిష్ వారి ఏకైక కోరిక. ఈ ఇద్దరూ ఆ విధంగా ఒకరికొకరు సహకరించుకోవడానికే సన్నద్ధత వ్యక్తపరిచారు.

ఇదే అదనుగా రాజ్‌పూర్‌లో దోచుకున్న తమ సంపదల్నీ, తమకు జరిగిన నష్టానికీ పరిహారాన్నీ ఇప్పించమని అడిగి చూశారు. బ్రిటిష్ వాళ్ళు అడిగింది లక్ష. శివాజీ ఇస్తానన్నది 20 వేలు. 'అయితే స్నేహం కుదరదు-' అని బెదిరించి చూశారు. అంతే! హుబ్లీమీద దండెత్తి అక్కడున్న బ్రిటిష్ ఫ్యాక్టరీని సమూలంగా దోచుకున్నాడు శివాజీ. అప్పటికి గానీ నెత్తిమీద వున్న కళ్ళు కిందికి దిగి రాలేదు కంపెనీ వాళ్ళకి.

భారతదేశంలో కంపెనీ అధికారి 'థామస్ నికోల్స్'. శివాజీతో వ్యవహారం మిగిలిన రాజులతో వ్యవహరించినట్లుగా వుంటే సాగదని గ్రహించాడు. శివాజీని స్వయంగా 'రాయ్‌ఘర్'కు వచ్చి కలుసుకున్నాడు. సంప్రదింపులు ప్రారంభించాడు. కొన్ని ఒప్పందాలు కుదుర్చుకున్నాడు.

# అపశ్రుతుల మధ్య శివాజీ పట్టాభిషేకం




1674 జూన్ నెల ఆరవ తేదీ-

రాయ్‌ఘర్‌లో శివాజీ తన పట్టాభిషేక మహోత్సవం కోసం ఏర్పాట్లు చేయడంలో తల మునిగివున్నాడు. అయినా సంప్రదింపుల ప్రక్రియని ఆపలేదు. భీమ్‌జీ పండిట్‌కి ఇంగ్లీషు వాళ్ళతో మంతనాలకు అన్ని అధికారాలూ ఇచ్చాడు. ఇంగ్లీషు వాళ్ళు కూడా 'నారాయణ్ షెన్వీ' అనే భారతీయుణ్ణి తమ తరపున శివాజీతో చర్చలకు అధికారాలు ఇచ్చి పంపించారు.

ఈస్టిండియా కంపెనీకి ఆంగియన్ అనేవాడు ప్రెసిడెంట్‌గా వుండేవాడు. బొంబాయిలో అతని కార్యాలయం వుండేది. నారాయణ్ షెన్వీ ద్వారా ఇతను శివాజీతో సాగించిన బేరసారాలు ఒక కొలిక్కి వచ్చాయి కూడా!

శివాజీ వలన కంపెనీకి కలిగిన అన్ని నష్టాలకూ పరిహారంగా పదివేల పగోడాలు, అలాగే 75వేల పగోడాల విలువైన ధనం, మరికొన్ని సరుకులు, మరో 2500 పగోడాల పన్ను మినహాయింపులు ఇవ్వడానికి శివాజీ అంగీకరించాడు. ఆంగియన్ అక్కడికదే

అదృష్టం అనుకొన్నాడు. శివాజీని చేజార్చుకోకుండా జాగ్రత్తగా కథ నడిపే పథకాలు వేసుకున్నాడు. హెన్రీ ఆక్సిండేజ్ అనే ప్రతినిధి ద్వారా, పట్టాభిషేకం సందర్భంగా ఇస్తున్నామంటూ రెండు నెలలముందే, ఒక అరబ్బీ మేలుజాతి గుర్రాన్ని, మరికొన్ని కానుకల్ని పంపించి శివాజీని సంతోషపెట్టాడు.

ఈ క్రమంలో హెన్రీ ఆక్సిండేజ్ సాధించిన విజయం ఏమంటే, శివాజీ రాజ్యంలో మొఘల్ నాణాలతో పాటు బ్రిటిష్ వారి పగోడాలు కూడా చెలామణిలో వుండేలా అంగీకరించడం. అంతేకాదు, ఈస్టిండియా కంపెనీకి డెక్కన్ ప్రభువులు, మొఘల్ ప్రభువులు తదితరులు ఏఏ మినహాయింపులు, సౌకర్యాలూ కల్గిస్తున్నారో వాటిని తానుకూడా కల్గిస్తున్నట్లు పేర్కొన్నాడు. మొత్తంమీద శివాజీతో శాంతి సంధి కుదిరిందనే సంతృప్తి కంపెనీ పాలకులకు కల్గింది. కానీ, తమకు శివాజీ గతంలో చేసిన నష్టంలో ఈ పరిహారాలేవీ ఒక మూలకు రావనే అసంతృప్తి కూడా వారిలో బాగానే వుంది. ఇది గమనించిన శివాజీ, రాజ్‌పూర్‌లో బ్రిటిష్‌వాళ్ళు వాణిజ్య కేంద్రం పెట్టుకోవడానికి వెయ్యి పగోడాలు ఇవ్వవలసిందిగానూ, వాళ్ళకు ఓ మంచి ఇల్లు చూసి ఇప్పించవలసిందిగానూ రాజ్‌పూర్ సుబేదార్‌ని ఆదేశించాడు.

శివాజీ విసుర్తున్నవి ఎంగిలి చేతి మెతుకులేనన్న సంగతి కంపెనీ పాలకులకు తెలుసు. "విధిలేని స్థితిలో స్నేహాన్ని నటించడమే విజ్ఞులు చేయదగిన పని" అనుకున్నారు.

ఇంగ్లీషు వాళ్ళు తన రాజ్యంలో స్వేచ్ఛగా వ్యాపారం చేసుకోవచ్చు కానీ, వారి వ్యాపారాలన్నీ ఎగుమతి దిగుమతులకు మాత్రమే పరిమితంగా వుండాలని శివాజీ తన పాలనా విధానాన్ని ప్రకటించాడు. నేరుగా వినియోగదారుడికి వస్తువులు అమ్ముకునే వ్యాపారాలన్నీ స్థానికులకే వుండాలి గానీ, ఇంగ్లీషు వాళ్ళు చేయడానికి వీల్లేదని పేర్కొన్నాడు.

ఫిరంగి (పోర్చుగీసులు), ఇంగ్రాజ్ (ఇంగ్లీషు) వలంద (డచ్చి) ఫరాసులు (ఫ్రెంచి), డింగ్మార్ (డేనిష్) టోపీకార్లు (ఇతర యూరోపియన్ జాతులు) అందరి విషయంలోనూ ఇదే సూత్రాన్ని అమలులో పెట్టుకున్నాడు శివాజీ. శివాజీ అంటే, కంపెనీ పాలకులకు గౌరవం- అతని కత్తికి ఎదురులేదని! శివాజీ అంటే, కంపెనీ పాలకులకు భయం కూడా! అతను రోజురోజుకూ బలపడుతూ తిరుగులేని శక్తిగా ఎదుగుతున్నాడని.

నిజానికి శివాజీ కూడా ఇంగ్లీషు వాళ్ళ విషయంలో ఇదే అభిప్రాయంతో వున్నాడు. వీళ్ళని పూర్తిగా దూరంగా వుంచి సాధించేదేమీ లేదు! కానీ, దగ్గరకు తీస్తే నెత్తికెక్కుతారనే భయం కూడా వుంది. అందుకే, వాళ్ళని ఎక్కడ వుంచాలో అక్కడే వుంచాలనే నిర్ణయానికి వచ్చాడు.

వ్యాపారులు రావాలి. కొత్తకొత్త వస్తువులు తేవాలి. ఇక్కడి ఉత్పత్తులు ఎగుమతులు కావాలి. అందుకు విదేశీ వ్యాపారులతో సత్సంబంధాలు తప్పవు. వాళ్ళకు పేను పెత్తనం ఇవ్వకూడదనేది శివాజీ విధానం అనేది స్పష్టం.

ఒకవైపు మొఘుల్స్, ఇంకోవైపు బీజాపూర్ సుల్తాన్‌లు, మరోపక్క గోవా పోర్చుగీసులు ఈ బలమైన శక్తుల మధ్య శివాజీ తనదైన స్వతంత్ర రాజ్యాన్ని వ్యవస్థాపించుకొని నిలబెట్టుకోవాల్సిన పరిస్థితి అది.

ఇంతటి చక్రవర్తి అయినప్పటికీ, అతన్ని క్షత్రియుడిగా గుర్తించి, మెడలో జంధ్యం వేసి పట్టాభిషేకం చేయడానికి బ్రాహ్మణులు వ్యతిరేకించారు. అందుకు ముందుకొచ్చిన ఒక బ్రాహ్మణుణ్ణి కులంలోంచి బహిష్కరించడం కూడా జరిగిందని అంటారు.

ఇవన్నీ పట్టాభిషేకంలో అపశృతులు. అయినా, అతని కత్తికి ఎదురులేనట్లే అతని బుద్ధికీ ఎదురులేదు. రంజిత్‌సింగ్, మహద్జీ సింధియాలకున్నట్లు శివాజీకి ఫ్రెంచి సలహాదార్లు ఇంగ్లీషు లెఫ్టినెంట్లూ లేరు. ఆయన తీసుకున్నవన్నీ స్వతంత్ర నిర్ణయాలే! స్వంత గుండె, స్వంత మెదడూ ఆయన ఆయుధాలు.

మరాఠా దేశాన్ని సృష్టించడం దానిపైన యూరోపియన్ వర్తకుల నీడ పడకుండా చూడడం ఆయన పెట్టుకున్న పరమలక్ష్యాలు.

**శివాజీ అంతిమ కాలం**

పట్టాభిషేకం తర్వాత శివాజీ బతికింది ఆరేళ్ళే! కానీ, మనశ్శాంతి లేకుండానే బతికాడు. అయినా కర్నాటకలో చాలా భాగాల్ని జయించడంలో వెనకాడలేదు. బ్రిటిష్‌వార్ని చెప్పుకింద తేలులా తొక్కి వుంచడంలోనూ వెనకడుగు వెయ్యలేదు.

శివాజీకి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు శంభాజీ, రెండోవాడు చిన్నపిల్లవాడు-ఎనిమిదేళ్ళ రాజారామ్. చిన్న భార్య సోయిరాబాయ్ వత్తిడి కారణంగా రాజారామ్‌కి మరాఠా రాజ్యం ఇచ్చి, శంభాజీని తాను కొత్తగా జయించిన జింజీ రాజ్యాన్ని పాలించుకోమన్నాడని కథ.

ఇందుకు వ్యతిరేకించిన శంభాజీ ఇంట్లోంచి బైటకు వచ్చేసి, బీజాపూర్ సుల్తాన్ సేనాని దిలేర్‌ఖాన్‌తో చేతులు కలిపి తండ్రిపైన తిరుగుబాటు చేశాడు. మొఘల్ పాలకులు అతన్ని ఉపయోగించుకోవాలని చూశారు. బ్రిటిషర్లు బాగా ఎగదోసి కసి రగిలించారు.

ఈలోగా హిందువులపైన దిలేర్‌ఖాన్ మతపరమైన దాడులకు పూనుకోవడంతో శంభాజీ విజ్ఞత చూపించాడు. మొఘుల్స్ చేతిలో చిక్కి పెద్ద తప్పు చేసినట్లు తెలుసుకుని తండ్రి దగ్గరకు తిరిగి వచ్చాడని కూడా కొందరు పరిశోధకులు అంటారు.

శివాజీ తర్వాత శంభాజీ 1689 వరకూ రాజ్యాన్ని పాలించాడు. అతని మంత్రి రామచంద్రపంత్ ఆమాత్య ఇచ్చిన ఆజ్ఞాపత్రంలో బ్రిటిష్ వారి పట్ల శివాజీ ప్రదర్శించిన కఠినత్వం సడలింది. ఉదారవాదం అప్పటికే ఆవహించింది. తమవారికి స్థానిక రాజుల్ని తెచ్చుకోవడానికి బ్రిటిషర్లు కుయుక్తులు పన్నడం శంభాజీ కాలానికే మొదలయ్యిందనేది ఇక్కడ ముఖ్యవిషయం.

# భాగ్యనగరంలో భాగ్యమతి ఎవరు?




క్రీ.శ. 1578

హైదారాబాద్ నగరం ఏర్పడటానికి 14 ఏళ్ళ క్రితంనాటి సంగతి- మూసీనది ఒడ్డున చెట్లు, దిబ్బలు- మధ్య మధ్య అక్కడక్కడా చిన్న గ్రామాలు వున్న ప్రాంతం అది!

సుల్తాన్ ఇబ్రహీం కుతుబ్‌షా పాలిస్తున్న కాలం... తెలుగు ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్న ప్రభువు ఆయన. తెలుగు కవులు ఆయన్ని మల్కిభరాముడనీ, ఇభరాముడనీ కీర్తించారు కూడా.

'కులీ' శబ్దానికి సేవకుడని అర్థం. 'సుల్తాన్ కులీ' అంటే, సుల్తాన్‌కు సేవకుడని!' 'అల్లాకులీ' అంటే 'అల్లా' సేవకుడని 'మహమ్మద్ కులీ' అంటే మహమ్మద్‌కుసేవకుడని 'కూలీ' అనే పదానికి ఇదే మాతృక. అది గౌరవ వాచకం.

ఆ దశలో అతని పెద్దన్న తండ్రిని చంపి అధికారంలోకి వచ్చిన జమ్‌షీద్ దాయాదుల పోరు లేకుండా వుండటం కోసం అన్నదమ్ముల్ని కూడా అంతం చేసే ప్రయత్నం లో ఉన్నప్పుడు 14ఏళ్ళ వయసున్న 'ఇబ్రహీం కులీ'కి విజయనగర సామ్రాజ్య ప్రభువులు రక్షణనిచ్చి పెంచి పెద్దచేశారు. యుద్ధ విద్యలు నేర్పించారు. ఏడేళ్ళు వాళ్ళ రాజ్యంలో అతిథిగా వున్నాడు ఇబ్రహీం.

జనవరి 22, 1550లో జమ్‌షీద్ కేన్సర్ వ్యాధితో మరణించిన తర్వాత, మళ్ళీ వారసత్వ పోరు ప్రారంభమైంది. విజయనగర రాజుల వద్ద పెరిగిన ఇబ్రహీంని గోల్కొండ ప్రముఖులు స్వయంగా ఆహ్వానించి ప్రభువుగా పట్టాభిషేకం జరిపించారు. ఇబ్రహీం కులీ గోల్కొండ ప్రభువుగా ప్రతిష్ఠించబడిన తర్వాత, ఢిల్లీ సుల్తాన్‌ల జాగీర్దార్‌లా వ్యవహరించకుండా స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు.

ఆ విధంగా స్వతంత్ర గోల్కొండ ప్రభువులలో మొదటి ప్రభువుగా ఇబ్రహీం కులికుత్‌బ్‌షా గోల్కొండకు జులై 27, 1550న అడుగుపెట్టాడు. ప్రజలు అతనికి "మాలిక్ ఇబ్రహీం షా" అని బిరుదునిచ్చి గౌరవించారు. అప్పటికి 'మాలిక్ ఇబ్రహీం' వయసు 21ఏళ్ళు మాత్రమే. గోల్కొండ నగరంలోనే నివసించాడు.

హైదరాబాద్ నగరనిర్మాణానికి సంబంధించిన ఈ నేపధ్యంలో ఆనాటి విశేషాల్ని మనం పరిశీలిద్దాం.

మాలిక్ ఇబ్రహీం లేదా మల్కిభరాముడికి ఆరుగురు కొడుకులు. మూడోవవాడు "మహమద్ కులీ' హైదరాబాద్ నిర్మాతగా ప్రసిద్ధుడు.

23-3-1566న 'మహమ్మద్ కులీ' పుట్టాడనీ ఒక రికార్డు ఆధారంగా తెలుస్తోంది. రాజా మల్లారెడ్డి షట్చక్రవర్తుల చరిత్ర గ్రంథంలో ప్రస్తావించిన" మహమ్మద్ పాదుషా" ఈ మహమ్మదు కులీయేనని మరికొందరు చరిత్రకారులు రాశారు. మహమ్మద్ కులీ కవికూడా! అద్భుతమైన కవిత్వాన్ని పర్షియా భాషలో వెలువరించాడు. కానీ, ఆయన ఏమీ చదువుకోలేదు. "ప్రతిస్పందించే హృదయం వుంది నాకు- ఇంకా చదువెందుకు?" అని ఒక కవితలో ఆయన చెప్పుకున్నాడు! మహమ్మద్ కులీ ధోరణి చిన్నప్పటినుంచి ఇంతే! కవితా హృదయంతో స్పందించేవాడు.

ఆ రోజుల్లో మూసీనది ఒడ్డున వున్నదిబ్బలు అడవుల మధ్య షా ఆలీ బండ అనే ప్రాంతంలో చిచ్లామ్ గ్రామం, ఒక బ్రాహ్మణ అగ్రహారం లాంటిది వుంది. ఆ గ్రామంలో ఓ అందమైన నాట్యగత్తె. ఆమెపేరు చిన్నపిల్లే అయివుండొచ్చు. ఆ అమ్మాయి పేరు భాగ్యమతి. ఉర్దూ రికార్డుల్లో "బాగ్‌మతి" గా కన్పిస్తుంది. ఇప్పుడు మనం చెప్పుకోబోతున్న కథాకాలానికి యువరాజు మహమ్మద్ కులీ వయసు 12 ఏళ్ళు మాత్రమే! క్రీ.శ. 1578నాటి సంగతి.

ఈ పన్నెండేళ్ళ యువరాజుకీ భాగ్యమతితో స్నేహం... ప్రేమ... ఆరాధన... అన్నీనూ... ఒక్క రోజు కూడా కన్పించకపోయినా నిలవలేకపోయేవాడు. సాహసించి, రాత్రిపూట మూసీనదిని దాటి గోల్కొండ నుంచి చిచ్లామ్ వెడ్తుండేవాడు. ఎంత ప్రమాదం అదీ... మూసీనది అప్పుడప్పుడూ పొంగి వూళ్ళన్నింటిని ముంచెత్తుతూ ఉంటుంది. యువరాజు సంగతి వేగులద్వారా రాజుగారికి తెలిసింది. ఇంకో రాజైతే, సామాన్య తల్లిదండ్రులు ఏంచేస్తారో అదే చేసేవాడు. కానీ మల్కిభరాముడు యువరాజుని కట్టడిచేసి, అతను మరింత ప్రమాదకర సాహసాలు చేసేందుకు కారకుడు అయ్యేకన్నా, ఆ మూసీనదిమీద ఒక వంతెనని కట్టిస్తే సరిపోతుంది కదా... అనుకున్నాడు.

1578లో, ఎనిమిది నెలల కాలంలో లక్షరూపాయల ఖర్చుతో కట్టించిన ఈ వంతెనని ఇప్పటికి 'పురానాపూల్' అని పిలుస్తుంటారు.

హైదారాబాద్ నగర నిర్మాణం కథ ఇక్కడినుంచి మొదలైంది. నిజానికి కలరా వంటి వ్యాధులు సోకడం, గోల్కొండలో జనాభా పెరిగిపోయి ఊరు ఇరుకైపోవడం, అక్కడ నీటి సరఫరా తగినంతగా లేకపోవడం కారణంగా ఊరును విస్తరించడం గానీ, కొత్తగా మరో నగరాన్ని నిర్మించడంగాని చెయ్యాలనే ఊహ అప్పటికే మల్కిభరాముడికి వుంది. అందులో భాగంగానే, ఈ వంతెన నిర్మాణం చేపట్టాడనేది ఇక్కడి ముఖ్య విషయం.

గోల్కొండకు పడమరగా "బాఘ్ ఇబ్రహీమ్ షాహీ" (ఇబ్రహీం భాఘ్) ని అప్పట్లోనే ఆయన కట్టించాడు.- గోల్కొండ విస్తరణలో ఇది మొదటిప్రయత్నం. హుస్సేన్ సాగర్‌ని తవ్వించింది కూడా మల్కిభరాముడే! హైదారాబాద్‌కు 20 మైళ్ళ దూరాన వున్న ఇబ్రహీం పట్నాన్ని కూడా ఆయనే అప్పట్లో నిర్మించాడు.

అలాగే బెజవాడ దగ్గర కొండపల్లి కోటకు అందుబాటులో ఉండేలా, కోమటిపేట గ్రామాన్ని అభివృద్ధి చేసి, దానికి తన పేరున ఇబ్రహీం పట్నం అనే పేరు పెట్టాడు. ఇలా తన రాజ్యంలో పాలనాపరమైన సౌలభ్యం కోసం మాలిక్ ఇబ్రహీంషా చేపట్టిన చర్యలో భాగమే మూసీనదిమీద కట్టిన వంతెన.

వంతెన నిర్మాణం పూర్తయ్యాక సంతోషం గా "గజర్ గహేమా" అన్నాడట ఆయన. "ఈ దారి తిన్నదైనది" అని ఆ మాటకు అర్థం! "అసఫ్ జాహీ" నిజాం ప్రభుత్వంలో అసిస్టెంట్ సెక్రటరీగా జుడిషియరీ, పోలీస్, సాధారణ పాలనా వ్యవహారాలు పర్యవేక్షించిన "సయ్యద్ ఆలీ అస్గర్ బిల్గ్రామీ" 1927లో 'ల్యాండ్ మార్క్స్ ఆఫ్ ద డెక్కన్" గ్రంథాన్ని వెలువరించాడు. అందులో హైదరాబాద్‌కు సంబంధించిన అనేక కట్టడాలకు సంబంధించిన శాసనాధికారాలు పొందుపరిచాడు.మనం ఆశ్చర్యపోయే చాలా విషయాలు ఇందులో వున్నాయి.

ఈ పుస్తకంలో భాగ్మతి (లేదా భాగ్యమతి) కి సంబంధించిన ఒక శాసనాధికారం కన్పిస్తుంది. 1578లో పూర్తయిన ఈ వంతెన 1820లో మూసీ నదికి వచ్చిన పెద్ద వరదలప్పుడు బాగా దెబ్బతింది. నవాజ్ సికందర్ మగ్‌పిరాఝూ (హఘ్ ఫిరాత్ మంజిల్) అసఫ్‌ఝూ ఈ వంతెనని పునర్మించాడు. అప్పటి నిజాం ప్రధాని మహారాజా చందూలాల్ బహదూర్ షరాన్ ముఖ్య బాధ్యత తీసుకొని ఈ వంతెన నిర్మాణం పూర్తి చేయించాడట! పాత వంతెనకన్నా మెరుగైనదిగా అది నిర్మించబడిందనీ వరదలు ముంచెత్తినా రాకపోకలు

ఆగకుండా ఎత్తుగా కట్టారనీ పూర్వపు కుతుబ్‌షాహీ రాజ వంశపు శైలిలోనే పునర్నిర్మించారనీ అప్పట్నించి దీన్ని పురానాపూల్ అని పిలవడం మొదలుపెట్టారనీ పరిశోధకులంటారు.

వంతెనని నిర్మించిన రెండేళ్ళకే మల్కిభిరాముడు పరమపదించాడు. మళ్ళీ అంత:పురంలో వారసత్వపు పోరు ప్రారంభం అయ్యింది.

మంత్రి మీర్-షా-మీర్ తన కూతుర్ని ఇబ్రహీం రెండో కొడుకు హుస్సేన్ కులీకిచ్చి పెళ్ళి చేసి రాజ్యాన్ని అతనికి కట్టబెట్టాలని ప్రయత్నించాడు. ఒకరోజు రాజధానిలో లేని సమయం చూసి జగదేవరావు అనే రాజకుటుంబ సలహాదారు మూడో కొడుకు 'మహమ్మద్ కులీ' ని రాజుగా ప్రతిష్టింపజేసేశాడు. ఈ జగదేవరావు నాయిక్వారీ హిందూ సేనానులుల నాయకుడు.

సుల్తాన్ 'మహమ్మద్ కులీ' సలహాదార్లు గోల్కొండ సామ్రాజ్య విస్తరణతోపాటు రాజధాని నగర విస్తరణవైపు ఆయన్ని వేగంగా నడిపించారు.

సుల్తాన్ మహమ్మద్ కులీ హైదరాబాద్ నగరానికి 1590లో శంకుస్థాపన చేశాడు. ఆయన శంకుస్థాపన చేసినచోటే చార్మినార్ నిర్మాణాన్ని ప్రారంభించారు. ఇమామ్ హుస్సేన్ సమాధి'తాజియా'ని అనుకరిస్తూ చార్మినార్ డిజైన్‌కు రూపకల్పన చేశారట.

1589లో ఇందుకు ఒక సంవత్సరం ముందు కలరా వ్యాధి బాగా వ్యాపించింది. అది గోల్కొండ నగరాన్ని కాకుండా చుట్టూ వున్న అనేక గ్రామాల్ని చుట్టబెట్టింది. గోల్కొండనుంచి రాజధానిని తక్షణం సురక్షిత ప్రాంతానికి తరలించకపోతే అధిక జనాభాతో, అరకొర సౌకర్యాలతో గోల్కొండ నగరం వ్యాధుల మయమై పోతుందని స్వయంగా గుర్తించాడు. సుల్తాన్ మహమ్మద్ కులీ.

అప్పుడు ప్రజలు ఒక ఎత్తయిన గుట్టమీద గ్రామదేవత కొలువుచేసి బలులు ఇచ్చుకున్నారు. వ్యాధి అదుపులోకి వచ్చింది. ప్రజలకూ, వారి నమ్మకానికీ, వారు జాతర చేసిన ఆ గ్రామదేవతకూ కృతజ్ఞతలు చెప్పుకున్నాడు మహమ్మద్ కులీ. వాళ్ళు కొలువు చేసిన ఆ చోటులోనే నూతన నగరానికి శంకుస్థాపన చేశాడని, ల్యాండ్‌మార్క్ ఆఫ్ ద డెక్కన్ గ్రంథంలో బిల్‌గ్రమీ పేర్కొన్నాడు.

* * * * *

రాజుల చరిత్రల్లో అతిశయోక్తులే ఎక్కువగా వుంటాయి. మధ్యయుగాల్లో చరిత్రకారులు ఎక్కువగా జనశృతులమీదే ఆధారపడి చరిత్రను రికార్డు చేశారు. వాటిల్లోంచి వాస్తవాలను జల్లించడం అంత సులువైన విషయం కాదు. ప్రజల్లో నాటుకుపోయిన నమ్మకాల్నించి

చారిత్రక సత్యాల్ని మళ్ళించడం సాధ్యంకాదు కాబట్టి. అలాగే చరిత్రకారులు వ్యక్తిగత ఇష్టాయిష్టాల్లోంచి కూడా చారిత్రక వాస్తవాల్ని జల్లించడం అసాధ్యమే అవుతుంది.

పురాణాపుల్ వంతెన - హైదరాబాద్



హైదరాబాద్ నగరానికి భాగ్యనగరం పేరు వుండేదా...? భాగ్మతి లేదా భాగ్యమతి ఎవరు...? ప్రేయసా? వేశ్యా? పట్టపురాణిగా కూడా వున్నదా...? ఇవన్నీ చరిత్రకారుల వ్యక్తిగత ఇష్టాల్లోంచి, జనం నమ్మకాల్లోంచి జల్లించలవసిన విషయాలే!

మహ్మదీయ చరిత్రకారులెవరూ "భాగ్మతి"కి సముచిత స్థానాన్ని ఇవ్వడానికి ఇష్టపడినట్లుగా కన్పించదు.

ప్రముఖ చరిత్రకారుడు హెచ్.కె. షేర్వాణి "మహమ్మద్ కులీ కుతుబ్ షా-ఫౌండర్ ఆఫ్ హైదరాబాద్ అనే గ్రంథంలో చాలా విశేషాలు చర్చించారు. ఆయన పరిశోధన ప్రకారం 'భాగ్మతి' ప్రస్తావన మొట్టమొదటిసారిగా అక్బర్ సంస్థానంలో అహ్మద్‌నగర్ రాజప్రతినిధి 'ఫైజా' యిచ్చిన 1591-94 మధ్య కాలంనాటి ఉత్తరం ఒక పిటీషన్‌లో కన్పిస్తుంది. ఈ 'ఫైజా' దెక్కన్‌లో రాజప్రతినిధిగా వున్నప్పుడు అక్బర్‌కు పంపించిన రిపోర్టులో 'భాగ్మతి' అనే వేశ్య చాలాకాలం 'అహ్మద్ కులీ'కి భార్యగా వున్నదని రాశాడు. భాగ్మతి గురించిన వివరాలు బైట ప్రపంచానికి ఇలా తెలిశాయి.

ఫైజా తర్వాత అక్బర్ చరిత్రను రికార్డు చేసిన నిజాముద్దీన్ బక్షి 1594లోనే 'భామ్‌గసీ' అనే హిందూవేశ్య వ్యామోహంలో మహమ్మద్ ఆలీ కుతుబుల్ ముల్క్' వుండేవాడనీ, ఆమె

పేరుతోనే భాగ్యనగర్ నిర్మించాడనీ వెయ్యిమంది అశ్వికుల్ని ఆమెకు తోడుగా వుంచాడనీ, అప్పటికి (1594 నాటికి) 9సంవత్సరాలుగా ఆయన పరిపాలిస్తున్నాడనీ రాశాడు.

16ఏళ్ళ తర్వాత 1609-10లో ఫెరిష్టా కూడా భాగ్మతిని 'ఫాహిషా' (వేశ్య) గానే పేర్కొనడం జరిగింది. భాగ్మతి పేరుతో భాగ్యనగరంగానే ఆ నగరాన్ని వ్యవహరించాడనీ, కానీ ఆ తర్వాత తన తప్పుకు విచారించి హైదరాబాద్‌గా మార్పు చేశాడనీ స్పష్టంగా చెప్పడం జరిగింది.

ఫెరిష్టా కన్నా ఏడాది ముందే 1608లో హైదరాబాద్ విశేషాలను అధికారకంగా రాజోద్యోగులు రికార్డు చేశారు. అందులో ఎక్కడా భాగ్మతి ప్రస్తావనగానీ, భాగ్యనగరం పేరుకానీ కన్పించలేదని షేర్వాణి రాశారు.

భాగ్మతిని పెళ్ళాడిన తర్వాత మహమ్మద్ కులీయే ఆమె పేరు హైదర్ మహల్‌గా మార్చాడని మరొక అభిప్రాయం కూడా వుంది. ఒక మహమ్మదీయ ప్రభువు నూతనంగా నిర్మించిన ఒక మహానగరానికి 'భాగ్యనగరం' అనే హిందూ పేరు వుండటాన్ని బహుశా రాజ్యసభలో చాలామంది అంగీకరించ లేకపోవడం వలన భాగ్మతిని 'హైదర్‌మహల్' గా పేరు మార్చి, ఆమె హైదర్ ఆబాద్ (హైదర్‌కు చెందిన నగరం) అని వ్యవహరించి వుంటాడనేది ఈ సిద్ధాంతకారుల అభిప్రాయం.

ముహమ్మద్ కులీకుతుబ్‌షా కూతురు  రాకుమారి హయత్ భక్షీ బేగమ్ ఈ భాగ్మతి లేదా హైదర్ మహల్‌కు పుట్టిందేనని ఇంకొక వాదన. గోల్కొండ ప్రభువులు కుతుబ్‌షాహీ రాజవంశ చరిత్రపైన ప్రామాణికమైన పరిశోధన చేసిన డా॥ జోర్- భాగ్మతి, హైదర్ మహల్ ఒకరేననడానికి, రాకుమారి తల్లి ఈమేననడానికి తగినంత ఆధారం లేదని రాసినట్లు షేర్వాణి పేర్కొన్నారు.

1810లో "సవాని-ఇ-దకన్" గ్రంథాన్ని వెలువరించారు. అందులో రాకుమారి తల్లి హైదర్ మహలేననీ, ఆమే భాగ్మతి అనీ, ఆమె  వేశ్య అనీ, అంతకుముందు నుంచి వున్న జనశృతినే రికార్డు చేశారు అంటారు షేర్వాణి.

ఇవన్నీ చదివినప్పుడు అవునన్నవన్నీ ఆధారాల్లేనివిగానూ, కాదన్నవన్నీ పరిశోధనాంశాలు గానూ, పేర్కొన్నారా... అనిపిస్తుంది ఒక్కోసారి! మొత్తంమీ హైదర్‌బాద్‌కు ఒక హిందూ పేరు వుండడాన్ని, అది ఒక వేశ్య పేరు కావడాన్ని ఎక్కువమంది జీర్ణించుకోలేకపోవడం యిక్కడి ముఖ్యవిషయం!

ప్రసిద్ధ పరిశోధకులు, ప్రాతఃస్మరణీయులు డా॥బిరుదురాజు రామరాజు సారంగి తమ్మయ్య 'వైజయంతి విలాసం' గ్రంథం తాటాకు ప్రతిని సంపాదించారు. సారంగి

తమ్మయ్య గోల్కొండ కరణంగా వుండేవాడనీ, భాగీరతీ పట్టణం అతని నివాసం అనీ అందులో వున్నదట.

మహమ్మద్ కులీకుతుబ్‌షా 12వ ఏట రాజకుటుంబంలో ఏర్పడిన అంతర్గత పోరులో ప్రాణపాయం పరిస్థితిలో తప్పించుకుని విజయనగర ప్రభువుల ఆశ్రయంలో సురక్షితంగా పెరిగిన రోజుల్లో భాగీరతిని పెళ్ళాడి వుంటాడని ఈ గ్రంథం ఆధారంగా షేర్వాణి కొంత సమన్వయపరిచే ప్రయత్నం చేశారు.

1667లో ఫ్రాంకోయిస్ బెర్నియర్ అనే యూరోపియన్ హైదరాబాద్‌ను సందర్శించాడు. 'థెవినాట్' అనే యూరోపియన్ ఒక సంవత్సరం హైదరాబాద్‌లో వున్నాడు. గోల్కొండ సామ్రాజ్యానికి రాజధానిని భాగ్యనగరం అంటారనీ పర్షియన్లు (ఆనాటికి అధికారంలోవున్న మహమ్మదీయులు) దీన్ని "అయిదర్ ఆబాద్" అన్నారనీ వీళ్ళ రికార్డుల ఆధారంగా తెలుస్తోంది.

షేర్వాణీ ఈ విషయాలు రాస్తూ సామాన్య ప్రజలు భాగ్యనగరం అనే వ్యవహరిస్తూన్నా అధికారుల లెక్కల్లో మాత్రం అది హైదరాబాద్‌గానే వున్నట్లు అర్థం చేసుకోవచ్చన్నాడు.

మొఘల్ చక్రవర్తుల కాలంనుంచీ నిజాం నవాబు కాలం వరకూ భారతీయ మహమ్మదీయులకు పాలనా వ్యవహారాలలో ఎలాంటి ప్రాధాన్యతా వుండేదికాదు. పెద్ద ఉద్యోగాలన్నీ పర్షియా, ఇరాన్ తదితర ముస్లిం దేశీయులకే దక్కేవి. గోల్కొండ సామ్రాజ్యపు ఆఖరి ప్రభువు తానీషా కాలంలో మాత్రమే హిందువులకు, భారతీయులైన మహమ్మదీయులకూ కొంత ప్రాధాన్యత యివ్వడం జరిగింది.

మాదన్న మంత్రి శివాజితో గోల్కొండకు సంధి కుదిర్చాడు. ఔరంగజేబ్ ఆగ్రహానికి కారణమైన అంశాలు ఈ రెండే!

రాజ్యాన్ని కోల్పోవడానకికైనా ఇష్టపడ్డాడు గానీ హిందువుల్ని, భారతీయ మహమ్మదీయుల్ని ఉద్యోగాల్లోంచి తొలగించడానికి తానేషా అంగీకరించకపోవడం కారణంగా గోల్కొండ సామ్రాజ్యం 150 ఏళ్ళ తర్వాత 1700 శతాబ్దాన్ని చూడకుండానే ముగిసిపోయింది.

ఇదంతా విషయాంతరమే అయినప్పటికీ, పర్షియన్ అధికారులు భాగ్యనగరాన్ని హైదరాబాద్‌గానే గుర్తించారనడంలో ఆశ్చర్యంలేదని నిరూపించడానికి ఇవి సాక్ష్యాలు అంతే!

టావెర్నియర్ మరో అడుగు ముందుకెళ్ళి ఇది "భాఘ్‌నగర్" అంటే తోటల నగరం City of Gardens అనే అర్థాన్ని ప్రతిపాదించాడు. జనం భాగ్యనగరం అంటున్నారు గానీ, అసలు ఇది 'భాఘ్‌నగర్' మాత్రమే ననేది ఇందులో సారాంశం.

గోల్కొండ నగరంలో జనసమ్మర్థం వలన కొత్త రాజధాని నగరం అవసరం అయ్యింది. అది విశాలంగా, సర్వాంగ సుందరంగా వుండాలనీ మాలిక్ ఇబ్రహీం-మొదటి గోల్కొండ ప్రభువు... అతని కొడుకు ముహమ్మద్ కులీలు కలలు గన్నారు.

పురానాపూల్ వంతెననీ, హుస్సేన్‌సాగర్‌నీ, ఇబ్రహీంపట్నాన్నీ ఇంకా అనేక శాశ్వత కట్టడాల్ని మొదటి ప్రభువే నిర్మించాడు. మహమ్మద్‌కులీ చార్మినార్‌కు శంకుస్థాపన చేసి మొదటి అంతస్తుని పూర్తిచేశాడు. గోల్కొండ నుంచి చార్మినార్ దాకా రాచబాటని నిర్మించాడు. చార్మినార్ నుంచి నాలుగువైపులకు రహదారులు ఏర్పాటు చేశాడు. పేష్వా 'మీర్‌ముమీన్' ఈ నగర నిర్మాణానికి బాధ్యత వహించాడు.

మొదటి రాజు మాలిక్ ఇబ్రహీం, 'ఇభరాముడు' గా ప్రజాభిమానాన్ని చూరగొన్న వ్యక్తి. కొడుకు తన ప్రేయసిని కలవడంకోసం నదిని దాటే దుస్సాహసం చేస్తున్నాడని పురానాపూల్ వంతెనని కట్టించాడు అనే వాదనలో ఎవరికీ విభేదం వున్నట్లు కల్పించదు.

ఈ సంఘటన జరిగేనాటికి మహమ్మద్ కులీ వయసు 12ఏళ్ళు మాత్రమే! ఆమె పేరు భాగ్యమతి లేదా భాగ్మతి, ఆనాటికి ఆమె వయసు ఎంతో ఖచ్చితంగా తెలియదు. ముహమ్మద్ కులీ కన్నా చిన్నపిల్ల కావచ్చు. లేదా పెద్దదీ అయివుండొచ్చు. ఈ ఇద్దరి అలనాటి ప్రేమకు దృశ్యరూపం హైదరాబాద్ నగరం.

మూసీనదిపైన మొదటగా అత్యవసరంగా తక్షణమే ఈ పురానాపూల్ వంతెనని కేవలం ఎనిమిదినెలల వ్యవధిలోనే నిర్మించడంలో అంతరార్థాన్ని వెలికిలాగితేనే భాగ్యమతి కథలో వాస్తవాలు ఋజువవుతాయి!

ఇక్కడ మరో ముఖ్య విషయం ఏమంటే షాజహాన్ తాజ్‌మహల్ నిర్మించినట్లు ముహమ్మద్ కులీ హైదరాబాద్‌ను గానీ, చార్మినార్‌ను గానీ నిర్మించలేదు. ఒక కొత్త రాజధానినగరం ఆనాటికీ అత్యవసరం. దానికి ప్రారంభం పలికినవాడు తండ్రి మాలిక్ ఇబ్రహీం. దాన్ని నెరవేర్చినవాడు-కొడుకు-ముహమ్మకులీ!

ఇందులో భాగ్మమతి కథ ఒక ఉపాఖ్యానం మాత్రమే!

# కంపెనీ పాలనలో
# పాలెగార్లు - జమీందార్లు

1800 సంవత్సరంలో నిజాం అలీఖాన్, రాయలసీమకు చెందిన కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలతోపాటు బళ్ళారి జిల్లాని కూడా ఈస్టిండియా కంపెనీకి వశం (సీడింగ్) చేశాడు. ఈ నాలుగు జిల్లాలు 1792, 1799ల్లో, టిప్పుసుల్తాన్‌తో కుదుర్చుకున్న ఒడంబడిక ప్రకారం నిజాంకు సంక్రమించినవే!

బ్రిటిష్ వాళ్ళు తమ సైన్యాన్ని హైదరాబాద్‌లో వుంచి సైనికపరంగా సాయపడినందుకు ఖర్చులనిమిత్తం ఇచ్చిన దత్తతగా నిజాం ఈ సీడింగ్‌ని అభివర్ణించాడు. అందుకే ఈ నాలుగు జిల్లాల్ని కలిపి దత్తమండలం అన్నారు. ఈ దత్తమండలానికి థామస్ మన్రోని కలెక్టర్‌గా నియమించారు.

జులై 31, 1801న పలనాడు కూడా కంపెనీకి ఇలానే సీడింగ్ అయ్యింది. స్కాట్ దొరని నియమించి గుంటూరు జిల్లాలో కలిపారు.

జమీందార్లు, రాజాలు, రావు బహద్దూర్‌లు, ఇతర భూస్వాములు ప్రత్యేకించి పాలెగార్లుగా పిలువబడే పెత్తందార్లు బ్రిటిషర్ల విధానాలతో అసంతృప్తి చెంది లోలోపల రగులుకుపోతున్న కాలం ఇది. ఆకలిమంటతో సామాన్యజనం అల్లలాడిపోతున్నా పట్టని స్థితిలో వుంది పాలనావ్యవస్థ.

వీరందరి సంగతీ అలా వుంచితే, కడుపు నింపుకోవడంకోసం దొంగతనాలు చేయడానికి చెంచులు, ఎరుకలు తదితర సంచారజాతుల వాళ్ళు అలవాటుపడడం మొదలుపెట్టారు. ఈ కులాల్లో ఎవుడపుట్టినా వాడు దొంగే...అని ముద్ర వేసింది కంపెనీ ప్రభుత్వం, చెంచులు, ఎరుకలు దొంగలెలా అయ్యారు...? జమీందార్లు పాలెగార్లు దేశభక్తులెలా అయ్యారు...?

పలనాడులో కరవకొల్లు కేశవులు అనే చెంచునాయకుడి గురించి కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో గొప్ప కథనం కన్పిస్తుంది. స్కాట్‌దొర, ఇతని వలన శాంతిభద్రతలకు విఘాతం కల్గుతోంది కాబట్టి, అతని పట్టుకోవాల్సిందిగా, రామ్‌నాయక్ అనే చోటా పాల్‌గార్‌ని ఆదేశించింది. నాలుగు అడివిగ్రామాలకు ఈ రామ్‌నాయక్ పాలెగారుగా వున్నాడు. కానీ, రామ్‌నాయక్ స్కాట్ ఆజ్ఞల్ని పాటించలేదు. కేశవుల్ని పట్టి అప్పగించలేదు. దాంతో రామ్‌నాయక్ మీద తిరుగుబాటుదారుడుగా ముద్ర వేశాడు స్కాట్. అక్కడితో ఆగకుండా, నరసరావుపేట జమీందారు గుండూరావుని, అమరావతి జమీందారు

వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుని అమరావతి వినుకొండ అడవులకు వెళ్ళి, రామ్‌నాయక్, కేశవులు ఇద్దర్నీ వెతికి అరెస్ట్ చెయ్యమని ఆదేశించాడు.

జమీందార్లిద్దరూ బ్రిటిష్ సిపాయిల్ని వెంటబెట్టుకుని అడవుల్లో అణువణువూ గాలించారు. చివరికి రామ్‌నాయక్ దొరికాడు. కానీ అసలు దొంగ కేశవులు దొరకలేదు.

తనను చంపకుండా వదిలేస్తామంటే లొంగిపోతానని కేశవులు వినుకొండ ఠాణేదార్‌కి రాయబారం పంపాడు. స్కాట్‌దొర అందుకు అంగీకరించి చర్చలకు రమ్మని పిలిచాడు. కేశవులు నూరుమంది అనుచరులతో వచ్చాడు. స్కాట్‌దొర, కొందరు సిపాయిల్నీ, ఇద్దరు జమీందారుల్నీ తెచ్చుకుని చర్చల్లో పాల్గొన్నాడు. తలుపులు తీసివుంచే చర్చలు సాగుతున్నాయి.

ఈ లోగా జమీందార్లిద్దరూ చెంచుల్ని ఒక్కొక్కణ్ణే పిలిచి నవ్వుతూ చేతులు వేసి భుజం తడుతూనే పక్కకు తీసుకువెళ్ళి వంటరిని చేసి చంపించెయ్యడం మొదలుపెట్టారు. నూరుమంది చెంచు అనుచరుల్ని చంపడం పూర్తయ్యాక చర్చలు విఫలమైనట్లు కలెక్టరు స్కాట్ ప్రకటించాడు. వెంటనే కేశవులు వెనక్కి తిరిగి పారిపోవాలని చూశాడు. కానీ, అప్పటికే తలుపులు మూసుకుపోయాయి. వంటరి బందీ అయ్యాడు కేశవులు.

చెంచునాయకుల్ని అప్రతిష్ఠాకరంగా మోసగించి బంధించారన్న వార్త మద్రాస్ గవర్నరుకు చేరింది. ఆయన స్కాట్‌ని మందలించారట. ప్రజల్లో ప్రభుత్వ విశ్వసనీయత దెబ్బతినకుండా పాలించాలని సూచించాడట. మాట ప్రకారం కేశవుల్ని చంపకుండా వదిలిలేయమన్నారట. కానీ, అప్పటికే రామ్‌నాయక్ ప్రాణాలు తీసేయడం అయిపోయింది. అతనికి చెందిన నాలుగు వూళ్ళనీ ఇద్దరు జమీందార్లకి బహుమతిగా ఇచ్చాడట స్కాట్.

రాయలసీమకి సంబంధించి కూడా ఇలాంటి కథలు చాలావున్నాయి. పన్నులు వసూలు చేసేందుకు హృదయంలేని కఠినాత్ముల్ని నియమిస్తేనే తప్ప ప్రభుత్వాదాయం పెరగదని విజయనగరం పాలకులు మొదటగా పాలెగార్లని గ్రామీణ వ్యవస్థలో పెత్తందార్లుగా సృష్టించారు. ఆనాటినించి రాయలసీమ పాలనా వ్యవస్థ కొన్ని చోట్ల ప్రత్యక్షంగానూ, కొన్ని చోట్ల పరోక్షంగానూ ఈ పాలెగార్ల చేతుల్లోనే కేంద్రీకృతమయ్యింది.

కంపెనీ పాలనా విధానం ఈ పాలెగార్ల కర్ర పెత్తనానికి కొంత ఇబ్బంది కల్గించింది. "ఇవ్వాళ వుండి రేపు పోయే విదేశీయులు వీళ్ళు..." అని తేలికగా అంచనా వేసుకొని, ప్రజల నుంచి వసూలు చేసిన శిస్తుని ప్రభుత్వానికి చెల్లించడం మానేశారు పాలెగార్లు.

దత్తమండలం కలెక్టర్ మన్రోకి తెలుగుబాగావచ్చు, దుబాసీలు లేకుండానే వ్యవహారాల్ని నడిపేవాడట! మొదట, రైతుల్ని మంచి చేసుకోవాలనుకొన్నాడు. భూముల్ని సర్వేచేయించి

వాటిని సాగుచేసుకొంటున్న రైతుల పేరిట రిజిస్ట్రేషన్ చేయించాడు. దాంతో రాయలసీమ రైతులు మన్రోకి బ్రహ్మరథం పట్టారు. "మాండవముని" అని కీర్తించారు.

కానీ, వారికి ఆ ఆనందం ఎక్కువకాలం నిలవలేదు. మన్రో రైతాంగం మీద విధించిన భూమి శిస్తు ఎన్నడూలేనంత ఎక్కువగా వుండి, రైతుల శక్తికి మించిందయ్యింది. ఒక దశలో మన్రో మనసుమార్చుకొని, శిస్తును తగ్గించడం కోసం అనుమతి కోరాడు. కానీ, కంపెనీ డైరెక్టర్లు అందుకు అంగీకరించలేదట!

కొన్నిచోట్ల కొందరు రైతులు తిరగబడ్డారు. ఇదే అదనుగా పాలెగార్లు అజ్ఞాతంలో వుండి గెరిల్లా పోరాటాలు మొదలు పెట్టారు. రైతు పోరాటాలు, పాలెగార్ల పోరాటాలు కలిసిపోయాయి. ప్రభుత్వం సైనిక చర్య చేపట్టకతప్పలేదు. 1810లో తరణికల్లు గ్రామం పటేల్‌గా వున్న పాలెగారు, సబ్‌కలెక్టర్ ఆఫీస్ మీద దాడిచేసి, అక్కడ పనిచేస్తున్న ఉద్యోగుల్ని నరికి చంపారు. 1803లో సుల్తాన్‌ఖాన్ అనే 'పాలెగారు' దాడిచేసి కడపని స్వాధీనం చేసుకోవాలని చూశాడు. 1804లో బసాలత్ జంగ్ కొడుకు కుద్రీ ఉల్లాఖాన్ కూడా బళ్ళారి, ఆదోని పట్టణాలకోసం ప్రయత్నించి భంగపడ్డాడు.

మన్రో దొర పాలెగార్లను బుజ్జగించి, పన్నులు వసూలు చేసి ప్రభుత్వానికి పేష్కస్ కట్టినందుకు కొంత కావలి ఫీజు ఇచ్చే ఏర్పాట్లు చేశాడు. కోయిలకుంట్ల నరసింహారెడ్డి అనే పాలెగారు తనకి నెలకి ఇస్తున్న 11రూపాయల 10అణాల 8 పైసల కావలి ఫీజు చాలదని గొడవపెట్టుకున్నాడు. ఇది చిలికి చిలికి గాలివాన అయ్యింది. చివరికి నరసింహారెడ్డి ఎక్కడిదాకా వెళ్ళాడంటే, నిజాం నవాబు జమీందార్లందరినీ తనకు సైనికపరంగా సాయం చేయాలని కోరుతున్నట్లు ఒక నకిలీ లేఖను సృష్టించి, కొంత సైన్యాన్ని సమకూర్చుకొని బ్రిటిష్ సైన్యం మీద యుద్ధానికితలపడ్డాడు. మేజర్ కాంప్‌బెల్ గారి సైన్యం నరసింహారెడ్డిని కుందేలుపిల్ల మాంసాన్ని చప్పరించినట్లు చప్పరించింది.

కోయిలకంట్లలో నరసింహారెడ్డి శవాన్ని ఒక ఇనుపపంజరంలో వుంచి మూడు నెలలపాటు ప్రదర్శన పెట్టారట. తల ఎగరేసే పాలెగార్లకు హెచ్చరికగా వుండటం కోసం! చిత్తూరుజిల్లాలో పాలెగార్లు కూడా ఇలానే తిరుగుబాట్లు చేస్తుంటే, సబ్‌కలెక్టర్ కాక్‌బర్న్ ఇంతకన్న క్రూరంగా వ్యవహరించినట్లు తెలుస్తోంది.

దాంతో పాలెగాళ్ళు అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. వాళ్ళ అనుచరులు మాత్రం దోపిడి దొంగలుగా మారి ప్రభుత్వానికి చికాకులు తేవడం మొదలుపెట్టారు. ఒకరోజు తిరుపతి గుడిని దోచుకొంటారని వార్తలు రావడంతో చిత్తూరు జిల్లాకలెక్టర్ చాలాహడావిడి చేసి దోపిడీ జరగకుండా నిరోధించాడట.

ఇవన్నీ జరిగాక సమస్యకు సామరస్య పరిష్కారం కోసం కంపెనీ ప్రభుత్వం ముగ్గురు సభ్యులతో స్పెషల్ కమీషన్ వేసింది. పాలెగార్లకు కోరిన అధికారులు ఇస్తూ ఈ కమీషన్ వారు క్రమశిక్షణతో మెలగాలని షరతు విధించింది. నిజానికి అక్కడే పాలెగార్లతో పేచీ మొదలైంది. అక్కడే ఆగింది చివరికి! ప్రభుత్వం పాలెగాళ్ళని దొంగలన్నారు. దొంగ దొంగని దొంగఅన్నాడు. భూస్వామ్య మనస్తత్వం నరనరాన జీర్ణించుకు పోయిన పాలెగార్లకు, జమీందార్లకు కప్పెత్తనం అనేది తమ జీవిత హక్కు అనే భావన బాగా వుంది. వ్యాపారులుగా వచ్చి పాలకులుగా మారి సైనిక బలంతో కండకావరంతో విర్రవీగిన కంపెనీ పాలకుల క్కూడా సరిగా ఇదే భావన ఉంది. ఇద్దరూ సామాన్య ప్రజలను హింసించి దోచుకోవడం తమ జన్మహక్కుగానే అనుకున్నారు. ఇక్కడ మరో కోణంలోంచి ఆలోచిలంచవలసిన విషయం ఒకటుంది.

అణచివేతకు గురి అయిన ప్రజలు భూస్వాముల మీదగాని, ప్రభుత్వం మీదగానీ చేసిన తిరుగుబాట్లనీ, కప్పెత్తనం కోసం జమీందార్లు, పాలెగార్లు బ్రిటిష్ ప్రభుత్వం మీద చేసిన తిరుగుబాట్లనీ ఒకే గాటన కట్టడం చరిత్రకు మసిపూయడమే అవుతుంది.

బ్రిటిష్‌వారి మీద గెరిల్లా పోరాటాలు చేసిన స్వార్థపరుల్ని దేశభక్తులుగా చిత్రించడం అపచారం!! అంతేకాదు. ఈనాడు వికృతరూపం దాల్చి సభ్యసమాజాన్ని అవహేళన చేస్తున్న ఫ్యాక్షనిజానికి రెండువందల ఏళ్ళనాటి ఈ జమీందార్లూ, ఈ పాలెగాళ్ళూ పూర్వ రూపంగానో, పూర్వీకులుగానో ఉన్న సంగతిని కూడా మనం మరిచి పోకూడదు!

# జమీందార్ల నడమంత్రపు చావులు

క్రీ.శ.1808

ఉత్తర భారతదేశంలో గానీ, దక్షిణ భారతదేశంలో గానీ ఎంతోమంది జమీందార్లు, సంస్థానాధీశులు, రాజా మహారాజులు వారసులు లేకుండానే పోయిన కథలు మనకు తెలుసు.


లార్డ్ బెంటిక్

ఒకరంటే- అనుకోవచ్చు- ఇద్దరంటే అనుకోవచ్చు... ఇంచుమించు ప్రతి జమీందారు కథ, ప్రతి సంస్థానాధీశుడికథ ఇదే... ఫలానావారు నిస్సంతువుగా మరణించారు....అనే! నిస్సంతువుగా మరణించిన రాజులకు ప్రభుత్వమే వారసులు... అని ప్రకటించారు గవర్నర్ జనరల్ మింటో 1808లో.

'బేరన్ హేజెవ్' అనే రచయిత 'ది ట్రావెల్స్ ' అనే పుస్తకంలో ఈ విషయాల్ని లేవనెత్తి, మనం ఆశ్చర్యపోయే విషయం ఒకటి చెప్పాడు -

'మింటోగానీ, ఆ తర్వాత డల్హౌసీ, బెంటిక్ గానీ స్వతంత్ర రాజ్యాలన్నిటినీ బ్రిటీష్ రాజ్యంలో కలిపేయడానికి ఈ ఎత్తుగడ బాగా ఉపయోగపడింది. ఈ జమీందార్లు గానీ, రాజులుగానీ, తదితర చిల్లర నాయకులుగానీ తప్పనిసరిగా నిస్సంతువులుగానే చస్తారని, మింటో అంత ఖచ్చితంగా ఎలా ఊహించగలిగాడు? ఈ రాజుల్లో ఇంద్రియలోలత్వాన్ని అతి చిన్న వయస్సులోనే రెచ్చగొట్టి, ప్రమాదకరమైన కులటల్ని వాళ్ళకి తార్చి, వాళ్ళను నిర్వీర్యుల్ని చేసి, సంతానం పొందకుండానే వాళ్ళు చచ్చేలా చచ్చేంత కృషి చేశారని తేలికగానే అర్థం అవుతోంది...అన్నాడు బేరెస్ హేజెల్.

ఈ సంస్థానాలు బ్రిటిష్ వారికి కప్పం కడుతూ సామంత రాజ్యాలుగా కొనసాగుతున్నాయి కాబట్టి. సామంతుడు వారసుడు లేకుండా చనిపోతే. సార్వభౌముడు తన రాజ్యాన్ని తాను స్వాధీనం చేసుకోవడం సహజమే కదా... అనుకున్నారు ప్రజలు కూడా! అందుకే జమీందారీలు, బ్రిటిష్ వారి హస్తగతం అవుతుంటే, ప్రజా ప్రతిఘటన పెద్దగా లేకుండా పోయింది ఆరోజుల్లో!!

'రాజ్యం వీరభోజ్యం! మనకంటే బలవంతుడు మన రాజ్యాన్ని జయించుకుంటాడు. ఇందులో తప్పేముంది' ఇదీ ఆనాటి సగటు భారతీయుడి మనోభావన.

ఎందుకంటే మన భూములకు విదేశీయులు స్వాములుగా వున్నదానికి, స్వదేశీయులు స్వాములుగా వున్నదానికి తేడా ఏమిటో భారతీయులకు ఆనాడూ ఈనాడు కూడా తెలియదు కాబట్టి!

'లాప్స్' అంటే, సంతానం లేకుండా వున్న సంస్థానాధీశుడు- అని ఆనాటి అర్థం. ఏ ఏ సంస్థానాధీశులు అలా నిస్సంతువులాగా వున్నారో వారందరు దత్తత తీసుకోవడానికి వీల్లేదనేది ఆనాటి శాసనం.

ఆ తర్వాత, 1839లో సీమలోని ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లు డల్హౌసీని ఖచ్చితంగా ఆదేశించారు- వీలు చిక్కిన చోటల్లా దత్తత అధికారం ఎగరకొట్టే ఏర్పాట్లు చెయ్యి' అని.

సంస్థానాల్ని కబళించడంలో మింటోని మించిన డల్హౌసీ - కోలాబా, మాండవీ, అంబాటా, సతారా, నాగపూరు, ఝాన్సీ, సంబల్‌పూర్, జాయత్‌పూర్, తంజావూరు... వీటన్నింటినీ ఇలాగే చప్పరించేశాడు.

బెజవాడ, మైలవరం, విస్సన్నపేట సంస్థానాల్లో జరిగిన దత్తతలు కూడా నిరాకరించబడ్డాయి.... ఇదే కారణంగా!!

# సంస్థానాలను చప్పరించిన విధానం ఇదీ...

1853 డిసెంబర్ 11




నాగపూరు రాజా రఘోజీ భాన్స్లే. దురదృష్టవశాత్తూ తనకు వారసుడు ఎవరూ కలగకుండానే మరణించాడు. అప్పుడు అతని భార్య బంకాబాయి భర్త శవాన్ని అలాగే పెట్టుకుని, యశ్వంతరావు అనే బంధువుల పిల్లవాణ్ణి దత్తతు తీసుకుని ఆ పిల్లవాడితో భర్తకు అంత్యక్రియలు జరిపించింది.

ఆ రోజుల్లో ప్రతి సంస్థానంలోనూ ఒక ఇంగ్లీషు రెసిడెంటు వుండేవాడు. ఈ రెసిడెంట్ బ్రిటిష్‌వారికి రాయబారి లాంటి వాడనుకోవచ్చు. సంస్థానాల్లో విషయాల్ని గవర్నర్ జనరల్‌కు తెలియ జేయడం, సంస్థానం తమ చెప్పుచేతల్లోంచి జారిపోకుండా చూడటం వీళ్ళ విధులు.

నాగపూరు సంస్థానంలో మాన్‌సెల్ అనే బ్రిటిషర్ అప్పుడు రెసిడెంట్‌గా వున్నాడు. ఇలాగే పోర్చుగీసులు, ఫ్రెంచివారు, డచ్‌వారు కూడా తమ తమ రెసిడెంట్లని చాలా రాజ్యాలలో ఏర్పాటు చేసుకున్నారు కూడా!

నాగపూరు రాజా రఘోజీ మరణవార్తనీ, తదనంతర పరిణామాల్ని మాన్‌సెల్ పూసగుచ్చినట్లు వివరించి, తదుపరి చర్యలు ఆదేశించిమని కలకత్తాలో ఈస్టిండియా కంపెనీ అధికార్లకు లేఖ రాశాడు.

నిజానికి నాగపూరు బ్రిటిష్ వారికి గాని, మరెవరికి గానీ, సామంతరాజ్యం కాదు. అది స్వతంత్ర సంస్థానం. అక్కడ పత్తి విస్తారంగా పండుతుంది. లండన్‌లోని జౌళిమిల్లులకి పత్తి చాలా అవసరం. అందుకని నాగపూరును కబళించాలని గతంలో మనవాళ్ళు ఓ విఫలయత్నం చేశారు. ఇంకోసారి మంత్రులకు లంచాలు పెట్టి లోబరుచుకోవాలని చూశారు. ఇప్పుడు అదృష్టం మనకు ఇలా కలిసొచ్చింది-" అని రాశాడు రెసిడెంట్.




అంతలో కలకత్తా నుంచి ఆదేశాలు వచ్చాయి. గవర్నర్ జనరల్‌గా వున్నప్పుడు డల్హౌసీ చేసిన శాసనం ప్రకారం సంతానం లేని సంస్థానాధీశులు దత్తత తీసుకోవడానికి వీల్లేదు. ఈ దత్తత చెల్లదు. కాబట్టి, ఈ నాగపూర్ రాజ్యాన్ని కంపెనీ రాజ్యంలో కలిపేస్తున్నాం.... ఇదీ ఆర్డర్‌లోని సారాంశం! పంపినవాడు లార్డ్ బెంటింక్.

రాజే పోయిన తర్వాత ఇంకా రాజ్యం ఏమిటనే నైరాశ్యంలో పడి, మంత్రులు, సేనాధిపతులు దీన్ని ప్రతిఘటించడాన్ని మరిచిపోయారు.

బ్రిటిష్ ప్రభుత్వం చట్టబద్ధంగా రాణివాసం మీద దాడి చేసింది. ఆడవాళ్ళని, పిల్లల్ని కూడా ఇళ్ళలోంచి తరిమేసింది. మీ రాజ్యాన్ని మేం లాక్కున్నాం అన్నారు. బలం వున్నవాడిదే రాజ్యం అని సరిపెట్టుకున్నారు ప్రజలు.

రాణివాసం మొత్తాన్ని దోచుకుని, తీసుకుపోయి కలకత్తాలో హామిల్టన్ కంపెనీ ద్వారా అక్కడే వేలం వేయించారట. రాజాగారి ఏనుగులు, గుర్రాలు, ఎడ్లు వేలంలో కొనుక్కోవడానికి చుట్టుపక్కల బేరగాళ్ళు ఎగబడ్డారు. మొత్తం ఆరువందల పశుసందపని కేవలం పదమూడు వేల రూపాయలకు అమ్మేశారు. నూరు రూపాయల ఖరీదయిన మంచి బండెద్ల జతని ఐదు రూపాయలకు వేలంపాటలో కొట్టేశారు... అని రాశారు బ్రిటిష్ మహాయుగం గ్రంథంలో మానికొండ సత్యనారాయణశాస్త్రి.

నిజానికి ఇదే సమయంలో ఝాన్సీ రాజ్యంలో కూడా ఇలాగే జరిగింది. దత్తత తీసుకున్న కొద్దికాలానికే ఝాన్సీ రాజుగారు మరణించినప్పుడు, రాణి లక్ష్మీబాయి, తన దత్తపుత్రుణ్ణి నడుముకు కట్టుకుని, కత్తిపట్టి బ్రిటిష్‌వారితో పోరాడిన కథ మనకు తెలిసిందే!

నాగపూర్ ప్రజలు చేయలేకపోయిన ప్రతిఘటన ఝాన్సీ ప్రజలు సంఘటితంగా చేయగలిగారు. భవిష్యత్ పరిణామాలకు అది పెనుహెచ్చరిక అయింది.

బెజవాడ, విస్సన్నపేట, అమరావతి ఇంకా ఎన్నో సంస్థానాలు ఇదే విధంగా బ్రిటిష్‌వారి పంటి కిందకి ఆహారంగా వెళ్ళిపోయాయి. ప్రజల్లో ఈ సంస్థానాధీశులకు పలుకుబడిలేని కారణంగా ప్రజల నుంచి ప్రతిఘటన లేకుండా పోయింది!! ప్రజల దృష్టిలో జమీందారయినా ఒకటే.. బ్రిటిష్ వారయినా ఒకటే...

# బ్రిటిష్ పాలకులకు విచక్షణారహిత అధికారాలు



లార్డ్ వెల్లస్లీ స్వప్న మందిరం, కలకత్తా హౌస్

03-07-1807

కలకత్తాలో గవర్నర్ జనరల్ పదవిని స్వీకరించారు మింటో! మింటో ఇన్ ఇండియా అనే గ్రంథంలో ఆనాటి దేశ పరిస్థితి ఇలా వుందని రాశారు.

'వెల్లస్లీ భారతదేశంలో బ్రిటిష్ ధనాగారాన్ని పూర్తిగా ఖర్చుపెట్టి, ఖాళీ ఖజానాతో దేశాన్ని మింటోకి అప్పగించి వెళ్ళాడు. దేశం నానా అల్లకల్లోలంగా వుంది. తిరుగుబాట్లు జరిగే ప్రమాదం పొంచి వుంది. ఆఫ్ఘన్‌రాజు ఏ క్షణాన్నయినా ఇండియా మీద దండెత్తి వచ్చి కంపెనీ రాజ్యాన్ని కొల్లగొట్టే ప్రయత్నాల్లో వున్నాడు. ఇంకో వైపు నుంచి ఫ్రెంచివారు ఎప్పుడు బ్రిటీష్‌ని సమూలంగా తుదముట్టిద్దామా- అని ఇండియాలో ఎదురు చూస్తున్నారు.. ఇదీ స్థూలంగా ఆనాటి దేశ పరిస్థితి.

1808 మే నెల 16న లండన్‌లో కంపెనీ డైరెక్టర్లకు తాజా పరిస్థితి వివరిస్తూ గవర్నర్ జనరల్ లార్డ్ మింటో ఒక ఉత్తరం రాశాడు- దాని సారాంశం ఇది.

"మనం రాజ్య విస్తరణ కోసం ప్రయత్నిస్తున్నామన్న సంగతి ఇండియాలో స్వతంత్ర రాజులందరికి బాగా అర్థం అయిపోయింది. మన సంరక్షణ మీద వాళ్ళకి ఇప్పుడు నమ్మకం పూర్తిగా పోయింది. మా రెక్కల నీడల్లోంచి మీరు బైటకు వెడితే మిమ్మల్ని

ఫ్రెంచి గద్దలు తన్నుకుపోతాయని మనం ఎంత భయపెట్టినా వాళ్ళు వినేట్టుగా లేదు. పోయిన స్వాతంత్ర్యం కావాలనే మాటలు తరచూ విన్పిస్తున్నాయి..."

మింటో రాసిన ఈ ఉత్తరంలో మరోకోణాలు చాలా వున్నాయి.

1. ఫ్రెంచి బూచిని చూపించి ఇండియాలో సంస్థానాల్ని లోబరుచుకోవాలని ఇన్నాళ్ళూ ప్రయత్నించగలిగామనీ, ఇంక ఎక్కువ కాలం అది సాగదనేది మొదటి అంశం.

2. ఇదే నెపోలియన్ బూచిని చూపించి, ఎక్కడో లండన్‌లో కూర్చున్న కంపెనీ అసలు డైరెక్టర్లని బెదరగొట్టి, భారతదేశంలో విచక్షణారహితమైన అధికారాల్ని ఇంతకు పూర్వం గవర్నర్ జనరల్స్ అంతా పొందారు. మింటో ఉత్తరం కూడా అలాంటి ప్రయత్నాల్లో ఒక భాగమేననేది రెండో అంశం.

నిజానికి మింటోని నిద్రపట్టనివ్వని వాడు ఫ్రెంచి నెపోలియన్ కాదు- రష్యా జారు చక్రవర్తి! మింటో గవర్నర్ జనరల్‌గా ఇండియా వచ్చే సమయానికి కొన్ని పరిణామాల రీత్యా బ్రిటిష్ వారికి స్నేహితుడిగా వున్న రష్యన్ చక్రవర్తి, నెపోలియన్‌తో చెలిమికట్టాడు. నెపోలియన్, జారు చక్రవర్తి కావులించుకుని స్నేహం ప్రకటించుకున్నారు. 'ఈ ఇద్దరూ కలిసి పర్షియా, ఆఫ్ఘన్ల మీదుగా 'మెట్ట'దారిన ఇండియాలోకి ప్రవేశించి, బ్రిటిష్‌ని ఓడించి, ఈ దేశాన్ని చెరిసగం పంచుకోవాలని వారిద్దరి మధ్య ఒప్పందం కుదిరిందన్న పుకారు దేశం అంతా విస్తృతంగా లేచింది.

పర్షియాకు ఫ్రెంచి వారితో స్నేహం వుంది కాబట్టి, ఫ్రెంచిసేనల్ని తన భూభాగంలోంచి ఆఫ్ఘన్‌లోకి వెళ్ళడానికి పర్షియా అనుమతించిందని కూడా పుకారు వచ్చింది.

నిజంగా ఇదే జరిగితే పరిస్థితి ఎలా వుండేదంటారు? పెనంమీంచి పొయ్యిలో పడ్డవాణ్ణి పట్టుకుని ఏది వేడెక్కువ? అని అడిగినట్లుంటుంది ఈ ప్రశ్న! యూరప్‌లో ఎక్కడా బ్రిటిష్ వాళ్ళకి వ్యాపారమే వుండకూడదని కఠోరంగా శాసించాడు నెపోలియన్. ఆ దశలో, బ్రిటిష్ వస్తువుల్ని కొని, బ్రిటిష్ వారికి ముడిసరుకు ఉచితంగా ఇచ్చి పోషించింది భారతీయులే. దాని ఫలితమే మరో నూటనలభై ఏళ్ళ బానిసత్వం!!

# వజ్రాల దొంగలు-
# కంపెనీ పాలన

పరిపాలన అంటే, పన్నులు వసూలు చేసుకోవడం, అందినంత మేర డబ్బులు దండుకోవడం అనే ఏక సూత్రం మీదే ఈస్టిండియా కంపెనీ పాలన సాగింది. ఈనాటికీ అదే విధంగా కొనసాగుతూ వుండటమే ఆశ్చర్యం.

ఎక్కడైనా, ఎప్పుడైనా హృదయం వున్న అధికారి ప్రజల ఘోష వినగలిగినట్లు కన్పిస్తే, వెంటనే లండన్ అధికారులు తగురీతిన సదరు అధికారిని హెచ్చరించే వాళ్ళట. మొదటి నుంచీ కూడా దక్షిణ భారతదేశం మీద, మరీ ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతం మీద కంపెనీ పాలకులకు కుదిరినంత పట్టు మిగిలిన దేశం మీద ఇంకా. ఇంగ్లీషు వాళ్ళని ఇంకా కుదరలేదు. అందుకే దుష్టపాలకుల నరకం ఆంధ్రప్రాంతంలోనే ఎక్కువగా కన్పిస్తుంది.

ఈ కంపెనీ వాళ్ళకి కావలసింది తక్షణ రాబడినిచ్చే కార్యక్రమాలు, అందుకోసం ప్రయత్నిస్తున్నప్పుడు, వజ్రాలు దొరికే స్థావరాలు గురించి బ్రిటిషర్ల నోటీసులోకి వచ్చింది. ప్రైవేటుగా కొందరు వ్యాపారులు, భూస్వాములు కలిసి రూబీలు, డైమండ్లు, ఎమెరాల్డులు వంటి విలువైన రాళ్ళ కోసం మైనింగ్ జరుపుకుంటున్న సంగతి కూడా తెలిసింది. గనులకు ఎవరు హక్కుదార్లయినా, మొత్తం ఆంధ్రదేశానికి తాము హక్కుదారులం కాబట్టి తమకి రాయల్టీ చెల్లించాలని ఆదేశించారు. క్రమేణా లైసెన్సింగ్ విధానం ప్రవేశపెట్టి పెద్దమొత్తంలో సొమ్ము వసూలు చేయసాగారు. 1805లో గ్రంథి రామశెట్టి అనే వ్యాపారి కడపలో ఐదు ఎకరాల బంజరు భూమిని కొనుక్కొని అందులో మైనింగ్ జరపడం కోసం లైసెన్స్ ఫీజు చెల్లించి మైనింగ్ అనుమతి పొందాడట! ఇలాంటి రికార్డులు అనేకం కన్పిస్తాయి.



చెన్నూరు, దూపాడ, జమ్మలమడుగు, కోయిలకుంట్ల, కమలాపురం, గుర్రంకొండ, గుత్తిదగ్గర 'వజ్ర కరూర్'... ఈ ప్రాంతాల్లోకి గుజరాత్ నుండి వ్యాపారులు గనులు తవ్వే నిపుణుల్ని తెచ్చుకుని మైనింగ్ లైసెన్స్ పొంది వజ్రాల వేట ప్రారంభించారు.

బళ్ళారిలో 1815లో ఓ ఆరేళ్ళ పిల్లాడికి పొలంలో వజ్రపు రాయి దొరికింది. అది వాళ్ళ నాన్న చూసి, రహస్యంగా నాలుగు రూపాయలకి ఒక వ్యాపారికి అమ్మాడు. ఈ సంగతి అప్పటి కలెక్టర్‌కు ఎలాగో తెలిసింది. ఈ వ్యాపారిని పిలిపించి వెయ్యి రూపాయలు చేతిలో పెట్టి, వజ్రం లాక్కుని పంపించివేశాడట. ఎంతో మంది కూలీల్ని పెట్టి ఎన్నో రోజులు వెదికివస్తేగానీ ఒక వజ్రం నిఖార్సయింది దొరకకపోవడంతో చాలా మందికి ఈ వజ్రాల వెదుకులాట వృథా ప్రయాసగానే వుండేది. అందుకని ప్రైవేట్ వ్యాపారులు కూర్చుని ఒక లాభసాటి ఆలోచన చేశారు. కూలీలకు రోజుకూలీ విధానం ఎత్తేసి, "ఈ నేలలో పడి గాలించండి-వజ్రం దొరికితే, అందులో 10% మీకే ఇచ్చేస్తాం" అన్నారు. మిగిలిన 90% వజ్రంలో ప్రభుత్వరాయల్టీపోను, భూమి హక్కుదారుడు, అద్దెకు తీసుకొన్నవాడు, అద్దెకు తీసుకున్నవాడి దగ్గర నుండి అద్దెకు తీసుకున్నవాడు... వీళ్ళంతా ఆయాదామాషాల ప్రకారం పంచుకునే వాళ్ళు.

ఈ విధానం వలన గని తవ్వకానికి పెట్టుబడి తగ్గిపోయింది. కానీ, జనం మాత్రం పిచ్చెత్తిన వాళ్ళలా భూమిని పొరలు పొరలుగా తవ్వి జల్లించుకొంటూ బతకసాగారు. ఇది చూసి, ఈస్టిండియా కంపెనీ వాళ్ళుకూడా, వజ్రాల నిక్షేపాలున్న భూమిని తమకు కౌలుకి ఇచ్చేట్లయితే, ఆ భూమిలో దొరికిన వజ్రంలో 1/3వంతు వాటా ఇస్తామని ప్రకటించారు. గోదావరి ఆవలి ఒడ్డున పాల్వంచ నిజాం రాజ్యంలో భాగంగా వుండేది. అక్కడ ఈస్టిండియా కంపెనీకి పెత్తనం లేదు. అందుకని పాల్వంచ రాజు అదిరిపోయే 'అద్దె' చెప్పాడు. దాంతో కంపెనీ వాళ్ళు ఇది లాభసాటి కాదని వెనక్కి వచ్చేశారట!

కాళహస్తి, వెంకటగిరిల్లో ముగ్గురు వ్యక్తుల్ని హత్యచేసి, వాళ్ళ దగ్గరున్న వజ్రాల్ని దొంగలు ఎత్తుకు పోయినప్పుడు, తగిన భద్రత కల్పించలేదని, కాళహస్తి రాజానీ, వెంకటగిరి రాజునీ పిలిచి పోయిన ఆ వజ్రాల్లో సగం ధరగా 3,060 పగోడాల్ని ఫైన్ వేసి తమ ఖజానాలో జమ కట్టమన్నారట కంపెనీ అధికారులు, సొమ్ము పోయింది. ఎవరో వ్యాపారులదైతే, డబ్బుని ఈస్టిండియా కంపెనీకి జమచేయడం ఏమిటీ- అనడిగితే,"మీ వ్యాపారుల భద్రతని స్థానిక పాలకులు పట్టించుకోవాలని జమిందార్లందరికీ ఇది హెచ్చరికగా వుంటుందని ఇలా ఫైను వేశాం" అని చెప్పింది ప్రభుత్వం.

అసలు పాలకులైన కంపెనీ ప్రభుత్వానికి ఈ బాధ్యత మరింత వుందన్న సంగతి గుర్తులేక పోవడమే ఈ కథలో ప్రత్యేకత.

పలనాడులో తూమరకోట, కోళ్ళూరు, కృష్ణాజిల్లా లో పరిటాల, మల్లపల్లి, గొల్లపల్లి,... ఇవన్నీ ఒకప్పుడు వజ్రాలు విస్తృతంగా దొరికిన ప్రాంతాలు.

1679 మార్చి 19న "స్ట్రేన్‌షమ్ మాస్టర్" అనే ఏజెంట్- కోస్ట్ & బే కంపెనీ తరపున మద్రాసు - మచిలీపట్నం మధ్యనున్న ప్రాంతాల్ని వ్యాపారానుకూలతల కోసం పరిశీలిస్తూ పక్యటించాడు.ఏలూరు నుంచి మల్లంపల్లి, గొల్లపలి వజ్రాల గనుల దగ్గరకు వెళ్ళి అక్కడ బేరసారాలు చేసుకునేటట్లు రాసుకున్నాడు. ఆ రికార్డుల్ని కృష్ణా డ్రిస్టిక్ట్ మాన్యువల్‌లో గోర్డాన్ మెకెంజీ ఉదహరించాడు. కృష్ణానదికి రెండు వైపులా వజ్రాలు దొరికే స్థావరాల గురించి బుద్ధుడి కాలం నుంచీ బైట ప్రపంచానికీ తెలుసు.

పలనాడుని "వజ్రాలదిన్నె"గా సింహళం రికార్డుల్లో పేర్కొన్నారు. నెల్లూరు, గుత్తి, కందవోలు (కర్నూలు) మండలాల్ని కూడా 'వజ్రభూమి' అనేవాళ్ళు. సత్తెనపల్లి అడవులు, కొండల మధ్య కోళ్ళూరు గ్రామం వుంది. కోళ్ళూరు పులిచింతల్లో వజ్రాల సేకరణ కోసం తవ్విన లోతైన గుంటలు ఇప్పటికీ కన్పిస్తాయి .వీటిని "గోరంట కయ్యలు" అంటారు.

13వ శతాబ్దిలో మార్కోపోలో, 15వ శతాబ్దిలో నికోలాకాంటి ఈ వజ్రాల గనుల్ని సందర్శించినట్లు కొన్ని రికార్డులు చెప్తున్నాయి. నికోలోకాంటీ 'బిజిన్ గిల్వా' అంటే, విజయనగరం నుంచి కృష్ణాతీరంలోని అల్ బెనిగరాస్" కు చేరుకున్నాడు. "అల్" అనేది అరబ్బీ ప్రత్యయం. "బెనిగరాస్' అంటే బహుశా, కృష్ణాజిల్లా లోని "గని ఆత్కూరు" గానీ, "గని కోళ్ళూరు" గానీ కావచ్చని పరిశోధకులు భావించారు.

నికోలా కాంటీ ఓ పెద్ద పర్వతాన్ని చూశాడట ఈ బెనిగరాస్‌లో అక్కడ నుంచి వజ్రాలు దొరికే లోయలోకి మాంసం ముక్కల్ని విసిరేవాళ్ళట. వజ్రాలు మాంసానికి అతుక్కునేవి. పక్షులు లోయలోకి వెళ్ళి ఆ మాంసం ముక్కలు తెచ్చుకుని కొండమీద పెట్టుకుని తింటున్నప్పుడు, వజ్రపు రాళ్ళు రాలిపడేవి. జనం వాటిని సేకరించుకునే వాళ్ళట. మాంసం కోసం పెద్ద ఎనుబోతును చంపే ఈ అలవాటు, నెమ్మదిగా జంతుబలిచ్చే ఆచారానికి దారితీసిందని నికోలా కాంటీని ఉదహరిస్తూ రాశాడు మెకెంజీ.

1605-1689 మధ్యకాలంలో జీవించిన ఫ్రెంచి వజ్రాల వ్యాపారి జాన్ బాప్టిస్ట్ టావెరియర్ ఆంధ్ర ప్రాంతానికి కనీసం ఆరు సార్లు వజ్రాల కోసం వచ్చినట్లు రాసుకున్నాడు. కృష్ణాతీరంలో రైతాంగం పొలంపనులు చేసుకొంటున్నప్పుడు అప్రయత్నంగా దొరికిన వజ్రపు రాళ్ళే ఎక్కువగా వున్నట్లు టావెర్నియర్ అభిప్రాయ పడ్డాడు.

ఒకరైతు తనకు దొరికిన వజ్రాన్ని గోల్కొండకు తీసుకుపోయి బహిరంగంగా అమ్మడం వలన కృష్ణాతీరంలో పంట భూముల్లో వజ్రాలు దొరుకుతున్నాయనే వార్త దేశం అంతా పాక్కింది. పరిటాల, కోళ్ళూరు ప్రాంతాల మీద పడి జనం వెదకులాట మొదలుపెట్టారని కనీసం 60,000 మందిని ఇక్కడ చూసినట్లు టావెర్నియర్ పేర్కొన్నాడు.

ఒకసారి 900 కేరెట్లున్న వజ్రం కోళ్ళూరులో దొరికింది. దాన్ని ఔరంగజేబుకు కానుకగా సమర్పించుకున్నారని టావెర్నియర్ రికార్డుల ఆధారంగానే తెలుస్తోంది. 1665నవంబర్ 2న ఔరంగజేబు తనకు కానుకగా వచ్చిన ఈ 900 కేరెట్ల కోళ్ళూరు వజ్రాన్ని కోహ్-ఇ-నూర్ వజ్రంగా పిలిచాడు. ప్రజల దర్శనార్థం బహిరంగంగా ప్రదర్శించాడట.

టావెర్నియర్ ఈ ప్రదర్శనలో కోహినూరు వజ్రాన్ని తాను చూసినట్లు రాసుకున్నాడు. కోహినూర్ వజ్రం ఔరంగజేబును చేరే నాటికి 900 కేరెట్లుందనీ, దాన్ని హార్టెన్షియా బోర్గియా అనే వాడు సానబట్టే సరికి 319.5 కేరెట్లకు తగ్గిపోయిందని టావెర్నియర్ అభిప్రాయపడ్డాడు. ఈ విషయాల్ని ఉదహరిస్తూ, గోర్డాన్‌మెంకెంజీ- ఇప్పుడు, అంటే, 1883 నాటికి కోహినూరు వజ్రం 186,5 క్యారెట్స్ మాత్రమే వున్నట్లు పేర్కొన్నాడు. బహుశా టావెర్నియర్ కాలంనాటి క్యారెట్ల విలువ ఇప్పటి కన్న తక్కువగా వుండివుండవచ్చని మెకంజీ అభిప్రాయపడ్డాడు.

మిష్టర్ పిట్ దొరగారు మద్రాస్ గవర్నర్‌గా వున్నప్పుడు పరిటాలలో ఒక సామాన్య రైతు దగ్గరి నించి రహస్యంగా ఒక వజ్రాన్ని కొని, యూరోప్ చేర్చి రీజెంట్ ఆర్లియాన్స్ కంపెనీకి పెద్ద మొత్తానికి అమ్మాడట. ఈ కంపెనీ ఆ వజ్రాన్ని ఫ్రెంచి రాణి గారికి అమ్మింది. ఇప్పుడది ఫ్రెంచి రాణి కిరీటంలో వుందని మెకంజీ కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్‌లో పేర్కొన్నాడు.

ఈనాటి కృష్ణాజిల్లాలోని పరిటాల ప్రాంతం కమలియార్ జంగ్ బహదూర్ సంస్థానంగా వుండేది. ఉత్తర సర్కార్ జిల్లాల్ని బ్రిటిష్ వారికి ధారాదత్తం చేసినప్పుడు పరిటాలని అప్పగించకుండా తమ ఆధీనంలోనే వుంచుకున్నాడు నిజాం నవాబు.

"గని ఆతుకూరు" "బత్తినపాడు", "నందిగామ", "కొండవటికల్లు", "ఆస్తేపల్లి", "మల్లపల్లి" గ్రామాల్ని పరిటాల తాలుకాలోకిచేర్చాడు. ఈ ఏడు గ్రామాలు వజ్రాల గనులున్న ప్రాంతాలు కాబట్టి, పరిటాలని కన్నత్ తాలూకా అని పిలిచాడు నిజాం. 'కన' అంటే, గని అర్థం.

ఈ వజ్రాల నేల దెబ్బ ఎంతగట్టిదంటే, 1947 స్వాతంత్ర్యం వచ్చినా ఇంకా నిజాం ఈ నేలని విడిచిపోలేదని కోపగించి పరిటాల తాలూకాలోని ఈ ఏడు గ్రామాల ప్రజలు తిరుగుబాటు చేసి "పరిటాల రిపబ్లిక్"ని ప్రకటించుకున్నారు.

కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో కోళ్ళూరు, పరిటాల లోని వజ్రాల గనుల గురించి అనేక విశేషాలు రాశారు. ఒకసారి కోళ్ళూరులో ఒక దేవుడు వెలిశాడు. జనం బియ్యపు గింజలు తీసుకొని తమ స్వంత మూత్రంతో తడిపి ఆ దేవుడి విగ్రహం మీద వేయడం మొదలుపెట్టారట. ఎన్ని గింజలు వేశారో అన్ని వజ్రాలు దొరుకుతున్నాయి ఆ వూళ్ళో ఓబీద బ్రాహ్మణుడు మాత్రం ఈ అపచారం నేను చెయ్యనని భీష్మించుకున్నాడు. ఒక సాధువు వచ్చి, ఆ బ్రాహ్మణ్ణి, అతని కుటుంబాన్ని ఊరుకుదూరంగా తీసుకుపోయి కొల్లూరు పట్టణం ఎలా వెలుగుతోందో చూడూ అని తగలబడి పోతున్న వూరుని చూపించి మాయమయ్యాడట...ట!

హైదరాబాదుకి 30 మైళ్ళదూరంలో, షంషాబాద్‌కు కొంచెం దగ్గిరగా 'నర్కోడా' అనే గ్రామంలో ఒక రత్నం దొరికింది. అది 375 క్యారట్ల తూకం వుంది. ఆనాటి లెక్కల ప్రకారం దాని వెల రెండు లక్షల ఇరవై వేల పౌనులు. దీన్ని "నిజాం రత్నం" అంటారట.

కర్నూలు జిల్లాలో రామళ్ళ కోటలో "రవ్వ"లు, "వజ్రాలు" దొరుకుతుండేవి. రవ్వలకోట 'రామ్నాకోట'గా మారి వుండొచ్చు నంటారు సురవరం వారు.

గుత్తి దగ్గర మునిమడుగులో కూడా రత్నాలగనులుండేవి...ట! తెలుగునేల మీద వెలుగులు విరజిమ్మిన వజ్రాలు, రత్నాలు, రవ్వలు... ఇలా "ట" అనే పద్ధతిలో ఒకనాటి వైభవంగా మిగిలిపోయాయి. ఇప్పటికీ ఈ పేర్లు గల ఊళ్ళలో కొంతమంది తమ అదృష్టాన్ని పరీక్షించు కొంటూ వుంటారు. కన్పించిన రాళ్ళన్నీ వజ్రాలు అయితే ఎంత బావుణ్ణు.... మనం కష్టపడ కుండా పైకి రావడం ఇష్టంలేకే కంపెనీ వాళ్ళు వజ్రాల గనుల్ని మనకు దక్కకుండా చేశారని విమర్శించే వాళ్ళు చాలామంది వున్నారు. కారణం ఏదైనా కానీ, ఈ వజ్రాల గనులన్నీ మూతపడిన మాట వాస్తవం!!

# రెవిన్యూ దొంగలు - కంపెనీ పాలన

1852 మార్చి 2వ తేదీన వైజాగ్ పట్నం నుంచి మద్రాస్‌లోని కంపెనీ ప్రభుత్వానికి ఒక ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది. ఇందులో 150 ఏళ్ళనాటి చాలా ముఖ్య విశేషాలున్నాయి. అవి ఇవి :

1. రెవిన్యూ అధికార్లుగా మెజిస్టీరియల్ అధికారాలు ఇచ్చి మరీ, కొందరు భ్రష్టు పట్టిన బ్రాహ్మణుల్ని ఆయా పదవుల్లో నియమిస్తున్నారు.
2. ఈ భ్రష్టు పట్టిన బ్రాహ్మణులు జమీందార్ల నుంచి పెద్ద రైతుల నుంచి, ఇతరుల నుంచి లంచాలు తినడం బాగా మరిగారు.
3. పంటలు పండక రైతులు బక్కచిక్కిపోయి వుంటే, రెవిన్యూ బకాయి కట్టలేదని వాళ్ళ స్వంత భూముల్లోంచి వెళ్ళగొట్టి ఎక్కడికైనా పొమ్మని వేధిస్తున్నారు. దారుణంగా హింసిస్తున్నారు. ఈ హింస వడలేక, ఎక్కడికీ పారిపోలేక, చాలామంది రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.




4. రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో శ్రేష్టిదార్లు, తాసిల్దార్లు, వారి తైనాతీలు రాబందుల్లా ప్రజల్ని పీడించి లంచాలు, మామూళ్ళు వసూలు చేసి కలెక్టర్ దాకా అందరూ తలా కాస్త పంచుకుంటున్నారు. రైతులకు పొలంపనులు ప్రారంభించడానికి ఇచ్చే 'తక్కావీ' రుణాల్లో కూడా కమిషన్ కొట్టేస్తున్నారు.
5. ఒక్కో జమీందారు, ఆయన స్థాయిని బట్టి వెయ్యి నుంచి రెండు వేల వరకూ మామూళ్ళు ఇస్తాడు. కలెక్టర్ గారికి చెల్లించే బేటాలు వేరే వుంటాయి.
6. చెరువులు, కుంటలు, డ్రెయిన్లు, కాలువలు వీటిని రిపేరు చేసే పనుల్లో కొంత సొమ్ము శ్రేష్టిదారు జేబులోకి ముందే చేరిపోతుంది. ఇలా దిగమింగిన సొమ్ముని భర్తీ చేయడం కోసం కూలీలకిచ్చే సొమ్ములో కోతబెడుతుంటారు. కూలీల్ని బలవంతంగా హింసించి పనుల్లోకి లాక్కు వస్తుంటారు.

7. మొత్తం లంచాలు, మామూళ్ళు, బేటాలు వగైరా వసూలు చేసి ఎవరి వాటా వారికి పంచడం శ్రేష్టిదారు డ్యూటీ. లంచాలు ఇవ్వకుండా ఎవరైనా మొరాయిస్తే వాళ్ళని దండించే డ్యూటీ తాసిల్దారుది. ఇలా దండించడంలో, కొట్టిన దెబ్బలకు తట్టుకోలేక ఎవడైనా చచ్చిపోతే, గ్రామ కరణం లెక్కల్లో ఈ మరణాన్ని నమోదు చేయడు. మరీ తెగించి, ఎవడైనా కోర్టుకెక్కి హత్యానేరం మోపితే, దొంగ సాక్ష్యాలు తీసుకొచ్చే బాధ్యత తాసిల్దారు చేతికింది తైనాతీలది.
8. ఇవన్నీ పచ్చి నిజాలేనని రుజువులు కావాలంటే, ఏ గ్రామానికి వెళ్ళి కరణం లేక నాయుడు గారి అక్కౌంట్లు వెదికినా తెలిసి పోతుంది.

ఇలా సాగుతుంది ఈ ఆరోపణల లేఖాస్త్రం. నాటి పరిస్థితి "నేటికి నకలు"గానే వున్నది కదా...! దరిమిలా ఆరోపణలు ఇలాంటివి అనేకం తీవ్రస్థాయిలో రావడంతో 'టార్చర్ కమిషన్'ని వేసి విచారణ జరిపించింది ప్రభుత్వం.

1855లో ప్రభుత్వం నియమించిన ఈ 'టార్చర్ కమిషన్' ఇచ్చిన నివేదికలో- మద్రాసు, గంజాం, వైజాగ్, రాజమండ్రి, మచిలీపట్నం, గుంటూరు, నెల్లూరు, కడప, బళ్ళారి, కర్నూలు పట్టణాల్లో ఈ రాజ్యహింస ఎక్కువగా వుందని స్పష్టంగా పేర్కొనడం జరిగింది.

కారల్‌మార్క్స్, ఏంగెల్స్ 'ది ఫస్ట్ వార్ ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్స్' అనే వ్యాసాన్ని వ్రాశారు. అందులో కోహ్లోఫ్ అనే వ్యాపారి చెప్పిన విషయాల్ని ఉటంకిస్తూ ఇలా అంటారు.

'రెవిన్యూ బకాయిలు చెల్లించకలేక పోయిన వ్యక్తుల్ని ఎలా హింసించాలో తాసీల్దార్‌గారు స్వయంగా నిర్ణయిస్తారు. అది ఆయనగారి ఇష్టానికి సంబంధించిన విషయం. ఒకవేళ ఏదైనా పరిహారంగాని, శిక్ష మినహాయింపు గాని, పై అధికారుల నుంచి వస్తే, దాని అమలు కూడా తాసిల్దార్లకే వుంది. ఎవరిమీద ఏ కంప్లెయింట్ వచ్చినా దాని విచారణ చేయడం వివరాలు సేకరించడం కూడా తాసిల్దార్ గారి అధికారమే అని!

దొంగగారే స్వయంగా విచారణ చేపడితే, శిక్ష పడేది ఎవరికి? ఇన్ని అనర్థాలకు 1800 సంవత్సరంలో సర్ థామస్ మన్రో అధిక మొత్తంలో రెవిన్యూ వసూళ్ళ మొదలు పెట్టడమే మూలకారణం అనేది ఇక్కడ ముఖ్య విషయం.

1821లో కాంప్‌బెల్ కడప కలెక్టర్‌గా వచ్చినపుడు మన్రో ప్రవేశపెట్టిన రైత్వారీ రెవిన్యూ వసూలు విధానం వలన పేదవారు మరింత పేదవారయ్యారనీ, రైతాంగం పూర్తిగా అప్పుల పాలయిపోయారని, పేదరికం జిల్లా అంతా తాండవిస్తోందనీ, రెవిన్యూ బోర్డు ఖజానా నింపుకోవడం కోసం అత్యాశకు పోవడం వల్లనే కడప జిల్లాకు ఈ దురవస్థ ప్రాప్తించిందనీ స్పష్టంగా కంపెనీ ప్రభుత్వానికే తెలియజేశాడు.

కానీ, 1824 డిసెంబర్‌లో థామస్ మన్రో మద్రాస్‌కు ప్రావిన్స్ గవర్నర్ అయ్యాడు. అప్పుడు తను రాసిన మినిట్స్‌లో, తన మద్రాస్ ప్రావిన్స్ మొత్తం మీద ఇద్దరు మాత్రమే

రెవిన్యూ బకాయిలు చెల్లించని కారణంగా జైలుశిక్ష అనుభవిస్తున్నారనీ, తక్కినవారంతా సొమ్ము చక్కగా చెల్లించారనీ, ఈ ఘనత అంతా డిస్ట్రిక్ట్ కలెక్టర్ల సమర్థత వలన సాధ్యం అయిందని పేర్కొన్నాడు. తాసీల్దార్లు యమకింకర్లుగా వ్యవహరించారని మాత్రం అందులో రాయలేకపోయాడు. కలెక్టర్ల పాలనా విధానం కారణంగా, కొంచెం లోతుగా అధ్యయనం చేస్తే ఆరు రకాల సామాజిక వర్గాలు కొత్తగా ఏర్పడినట్లు అర్థం అవుతుంది.

1. వ్యాపారులు, వాణిజ్యవేత్తలు, బ్రోకర్లు, కమిషన్ ఏజెంట్లు, షాపు కీపర్లు.
2. జమీందార్లు, భూస్వాములు
3. అప్పులిచ్చే షావుకార్లు, వడ్డీ వ్యాపారులు
4. తెల్లచొక్కా మేధావులు, లాయర్లు,
5. సన్నకారు రైతులు, పన్ను చెల్లింపుదారులు
6. కూలీలు, వృత్తి పనివారు.

ఈ పరిణామాలు సామాజిక వ్యవస్థ స్వరూపాల్ని చాలా మార్చేశాయి. భవిష్యత్తులో మధ్యతరగతి వర్గం భూస్వామ్య జమీందారీ వర్గాన్ని తోసిరాజని సామాజిక నాయకత్వం చేపట్టేందుకు దారితీసిన పరిణామాలివి!

నిజానికి 1766లో 'నిజాం నవాబు' నుంచి ఉత్తర సర్కారు జిల్లాల్ని కంపెనీ తన స్వాధీనంలో తెచ్చుకున్నప్పుడు దుబాసీలు, జమీందార్లు కంపెనీ అధికారుల్ని ముప్పతిప్పలు పెట్టారు. గుంటూరు కలెక్టర్ మిస్టర్ 'రామ్'కి 1794లో దుబాసీగా వున్న ఆత్మూరి వెంకటాచలాన్ని రాబందుతో పోల్చారు.

అందుకని, క్రమేణా రెవిన్యూ వసూలు విషయంలో దుబాసీలు, జమీందార్ల పాత్రని తగ్గించి కలెక్టర్లకు సర్వాధికారాలు ఇస్తూ, కంపెనీయే స్వయంగా రెవిన్యూ బాధ్యతని చేపట్టడం మొదలుపెట్టింది. అందువలన కంపెనీకి ఆదాయం గణనీయంగా పెరిగింది. అంటే, ప్రజలకూ, పన్ను చెల్లింపుదార్లకూ కష్టాలు రెట్టింపు అయ్యాయని అర్థం.

కాలక్రమంగా, లాండ్ రెవిన్యూ అనేది జిల్లా పాలనా యంత్రాంగానికి ముఖ్యభూమికగా మారింది. రెవిన్యూ వసూలు చేయాల్సిన కలెక్టర్ జిల్లా పాలనాధికారిగా మారాడు. 'డిస్ట్రిక్ట్ కలెక్టర్ అండ్ డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్'గా సర్వాధికారి అయ్యాడు.

థామస్ మన్రోగారి భాష్యం ప్రకారం రెవిన్యూ బకాయిలు ఎవరు వసూలు చేస్తున్నారనేది ముఖ్యం కాదు– దేశంలో 'శాంతి' 'భద్రత' అనేవి మాత్రం కలెక్టర్ల చేతుల్లోనే వున్నాయి– అని! రెవిన్యూ వసూలు అధికారి జిల్లా సర్వాధికారిగా మారిన వైనం వెనుక అసలు కథ ఇది. ఈ కథకు సూత్రధారి, పాత్రధారి సర్ థామస్ మన్రో!

# మూడువేల రూపాయిలకు
# బెజవాడను కొనేసిన బ్రిటిష్ పాలకులు

ఇప్పుడు విజయవాడ అంటున్నారు గానీ చరిత్రలో ఎక్కువకాలం ఇది బెజవాడగానే వ్యవహారంలో వుండేది.

ఈ బెజవాడకొక జమీందారీ వుండేది. క్రీ.శ. 1731 నుండి, క్రీ.శ.1846 వరకూ ఈ జమీందారీ వర్ధిల్లింది. ఆ తర్వాత బ్రిటిష్ వారు కేవలం మూడువేల రూపాయలకు దీన్ని కొనేశారు. ఆ కథ ఇది.

బెజవాడ జమీందార్లు కలవకొలను వంశీకులైన వెలమలు. వీరి జమీందారీ విషాదాంతం గురించి మనం తెలుసుకోబోయే ముందు ఈ జమీందారీ అవతరణ గురించి కూడా కొంత తెలుసుకోవాలి.

కలువకొలను వారి వంశచరిత్ర, నందిగామ దగ్గర కృష్ణాజిల్లాలో జుజ్జూరులో ప్రారంభమయింది. క్రీ.శ.980 ఈనాటి జుజ్జూరుని 'ద్రుజ్జూరు, అనీ, గుంటూరుని 'గొంటూరు' అనీ అనేవారనీ, అమ్మరాజ విష్ణువర్ధనుడి కాలంలో ఈ రెండుసీమల్ని చాళుక్య భీముడనే సేనానికి జాగీరుగా ఇచ్చినట్లు చరిత్ర!

మొదట మొగలాయిల కింద, తర్వాత గోల్కొండ కుతుబ్‌షాహీల క్రింద, ఆ తర్వాత ఆసఫ్ జాహీల క్రింద జుజ్జూరు జాగీరుగానూ, జమీందారీగానూ నడిచింది. సరిబస్తా కవుళ్ళకు గ్రామాల్ని తీసుకునే అలవాటుకూడా వుండేదిట! కొన్ని గ్రామాల్ని కలిసి ఒక పరగణా అనేవారు. జుజ్జూరు అలాంటి ఒక పరగణా! అందులో కంచికచర్ల, గొట్టుముక్కల, అల్లూరు, చౌటపల్లి... ఇలాంటి 15 గ్రామాలు వుండేవి.

కౌలు డబ్బు ప్రభుత్వానికి చెల్లించి, రాబడిలో రైతుకి ఇవ్వవలసింది ఇచ్చి మిగిలింది తాము తీసుకునే వాళ్ళు జమీందార్లు. 1698 సంవత్సరం నాటికి ఈ జుజ్జూరు పరగణా మాదిరాజు వారికీ, 'మధిరె' పరగణా కలవకొలను వారికి జమీందార్లుగా సనద్‌లు జారీ అయ్యాయి. మాదిరాజు వారు నియోగి బ్రాహ్మణులు. కలవకొలను వారు వెలమవారు.

యెర్రుపాలెం మధిరకు, పెద్దాపురం జుజ్జూరుకు సరిహద్దు గ్రామాలు. "ఈ సరిహద్దు గ్రామాల్లో రెండు జమీందార్ల మధ్య ఎప్పుడూ యుద్ధాలు జరుగుతుండేవి. 'ఈ సరిహద్దు తగాదాల సందర్భంలో ఉభయ జమీందారులు పెద్దాపురం, యెర్రుపాలెం పొలిమేరపైకి వెళ్ళినారనిన్ని, అప్పటి జుజ్జూరు జమీందారులైన మదిరాజు కూర్మరాజు, కొనేటిరాజు గార్లను మధిర జమీందార్లు చంపి జుజ్జూరు పరగాణాను కూడా ఆక్రమించుకున్నట్లును..

మాపెద్దలు చెప్పుచుండెడివారు. కాలము మాత్రము తెలియదు... తదుపరి జుజ్జూరు పరగణాకు కలవకొలను వారే జమీందారులుగా నుండిరి..' అని స్వీయ చరిత్ర (అభ్యుదయ తెలంగాణా చరిత్రాంశాలు) గ్రంథంలో మాదిరాజు రామ కోటేశ్వరరావు రాశారు.

కలవకొలనువారు జుజ్జూరు జమీందారులు అయిన వృత్తాంతానికి ఇంతకుమించి ఆధారాలు దొరకలేదు. జుజ్జూరు కలవ కొలను జమీందార్లు బెజవాడను ఎప్పుడు ఎలా స్వాధీనం చేసుకున్నారో కూడా తెలీదు. 1700 శతాబ్దం ప్రారంభ సంవత్సరాలలో కలవకొలను తిరుపతిరావు బెజవాడలో జమీందారీని వ్యవస్థాపించాడు. 1731లో ఆయన కుమారుడు నరసింహారావు, ఆయన తర్వాత ఆయన మూడోకొడుకు తిరుపతిరావు-2, తిరుపతిరావు తర్వాత గోపాలరావు- ఇలా వెంకటాద్రిరావు దాకా వరుసగా జమీందార్లయ్యారు.

వెంకటాద్రిరావు తర్వాత దూరపు బంధువు అచ్చన్నరావుకు ఈ జమీందారీ సంక్రమించింది. ఈయన మొదటి తిరుపతి రావు మూడోకొడుకు సంతానం అని గోర్డాన్ మెకంజీ రాశాడు.

ఆ వరసలో చిన్న పెద్దప్పారావు, ఆయన తర్వాత తుమ్మన్నరావు, పెద్ద బుచ్చెన్నారావులు జాయింట్ జమీందార్లుగా వున్నారు. 1764లో వీళ్ళ వారసులుగా రామారావు, కురినేని చెన్నారావు జమీందార్లయ్యారు.

1770లో బ్రిటీష్‌వాళ్ళు ఉత్తర సర్కార్ జిల్లాల్ని ధారాదత్తంగా పొంది ఈ జమీందార్ల నుండి శిస్తు వసూళ్ళు తాము పొందడం ప్రారంభించారు. 1788లో ఈ జాయింట్ జమీందార్లు బ్రిటిష్‌వారికి శిస్తు బకాయిలు పడ్డారు. అక్కడ నుండి ఈ జమీందారుకి కష్టాలు మొదలయ్యాయి. బ్రిటీష్ అధికారులు పన్ను బకాయిలు చెల్లించని జమీందార్లని నిర్ధాక్షిణ్యంగా అరెస్టు చేసి హింసించి, ముక్కుపిండి పన్ను వసూలు చేసేవాళ్ళు. ఈ శిక్షలకు భయపడి జాయింట్ జమీందార్లిద్దరూ రామారావు కంభానికి, చెన్నారావు మైలవరానికి పారిపోయారు. కొన్నినెలలపాటు జమీందార్లు లేకపోవడంతో బెజవాడ జమీని ప్రభుత్వమే నడిపించింది.

1789లో రామారావు తిరిగొచ్చి, పన్ను బకాయిలు చెల్లిస్తానని మాట ఇవ్వడంతో అతన్ని జమీందారుగా ప్రతిష్టించారు.

కొన్నాళ్ళకి రామారావు మరణించాడు. అతని కుమారుడు వెంకట క్రిష్ణారావు జమీందారయ్యాడు. 1791లో రెండో జాయింట్ జమీందారు చెన్నారావు కూడా తిరిగి వచ్చాడు. అతన్ని జాయింట్ జమీందారు అన్నారు. అతని తర్వాత కొడుకు వెంకట నరసింహారావు జమీందారయ్యాడు. ఈలోగా వెంకటకృష్ణారావు చచ్చిపోవడంతో అతని కొడుకు తిరుపతిరావు-3 ఈ వెంకట నరసింహారావుతో జాయింట్ జమీందారు అయ్యాడు.

ఈ జాయింట్ జమీందార్లలో వెంకటనర్సింహారావు పెద్దవాడు, సమర్థుడు కావడంతో తన వాటా ఎస్టేట్ వ్యవహారాలు బాగానే నిర్వహించగలిగాడు. చిన్నవాడు తిరుపతిరావు-3 వాటాగావున్న జమిలో పన్ను బకాయిలు పెరిగిపోవడంతో బ్రిటిష్‌వారు అతనిపైన చర్యకు తలపడ్డారు. దాంతో తిరుపతిరావు నైజాంకు పారిపోయాడు. పారిపోయి, మధిరవైపు నుండి గెరిల్లా తరహా పోరాటం ప్రారంభించాడు.

సరిగ్గా ఇదే సమయంలో నూజివీడు ప్రభువు 'నరసింహ' బ్రిటిష్ వారి మీద భద్రాచలం అడవుల్లోంచి గెరిల్లా పోరాటం సాగిస్తున్నాడు. కలువకొలను తిరుపతి రావు నూనూగు మీసాల వాడు. బాలచంద్రుడి పౌరుషంతో, అభిమన్యుడి పోరాటపటిమతో బ్రిటిష్ సింహాసనాన్ని ఎదుర్కోవాలనే నిర్ణయానికి వచ్చాడు. సెహభాష్ అని స్వాగతించారు ఆనాటి బెజవాడ ప్రజలు. అతనికి జేజేలు పలికారు. బ్రిటిష్ ప్రభుత్వానికి ఇవన్నీ చికాకు పెట్టే సమస్యలయ్యాయి. జమీందార్లని తెలుగుప్రజలు తమ ప్రభువులుగా గౌరవిస్తుంటే, బ్రిటీష్‌వారు వాళ్ళని తమ పాలెగాళ్ళుగా వ్యవహరించారు. జమీందార్లతో ఏర్పడిన సమస్యల్ని పరిష్కరించే ధోరణిలో కాకుండా తమ ఆధిపత్యాన్ని చాటుకునే దిశలో వ్యవహరించడం ఆనాడు బ్రిటిష్ అధికారుల అనాలోచిత నిర్ణయమే!

ఐదేళ్ళ పాటు ఈ యువకిశోరం అలా పోరాడుతూనే వున్నాడు. 1798లో మైనారిటీ తీరే వరకూ అతని పోరాటం కొనసాగింది. బ్రిటిష్ వారిని క్షమాభిక్ష కోరేందుకు తిరస్కరిస్తూనే జమీందారీలో తన వాటాకోసం న్యాయపోరాటం కూడా కొనసాగించాడతను! గొట్టిముక్కల దగ్గర జరిగిన యుద్ధంలో అతని అనుచరులంతా మరణించారు. తిరుపతిరావు వంటరివాడయ్యాడు. ఏ కుట్రో, ఏ కుతంత్రమో అతన్ని కూడా బలితీసుకుంది.

1799లో ప్రవాసంలో వున్న జాయింట్ జమీందారు రాజా కలువకొలను తిరుపతిరావు మరణించినట్లు ప్రకటించింది బ్రిటిష్ ప్రభుత్వం- అతనికి పెళ్ళి అయిందో లేదో కూడా తెలియదు. రాజా వేంకట నరసింహారావుని బెజవాడ జమీకి పూర్తి జమీందారుగా ప్రభుత్వం ప్రకటించింది.

1813 అక్టోబర్ 13న ఈ వెంకటనర్సింహారావు చార్‌మహల్ ఎస్టేట్‌లో భాగంగా వున్న 'కలిదిండి' పరగణా అమ్మకానికి వస్తే దాన్ని కూడా కొనుగోలు చేశాడు. బెజవాడ ఎస్టేట్‌ని అభివృద్ధి చేశాడు. ఆ తర్వాత 1815 మే నెలలో ఆయన కాలం చేశాడు.

అప్పటికి వేంకట నర్సింహారావుకి ఐదేళ్ళ వెంకట్రామగోపాల జగన్నాధరావు అనే కొడుకు మాత్రమే వున్నాడు. అతనికి మైనారిటీ తీరేవరకూ బెజవాడ సంస్థానం వ్యవహారాలన్నీ బ్రిటిష్‌వారే నిర్వహించారు. 1827లో ఈ జగన్నాధరావుని జమీందార్ని

చేసి, బోలెడంత బకాయిని చూపించి ఇదంతా కట్టమన్నారు కంపెనీ వాళ్ళు. ఓ మూడేళ్ళ పాటు ఈ కుర్రవాడు బ్రిటిష్ వారి కాళ్ళవేళ్ళా పడ్డాడు. అయినా ఫలితం లేకపోయింది. బెజవాడ జమీందారీని వేలానికి నోటీసు ఇచ్చారు. 1831లో ఆ దిగులుతోనే అతి చిన్నవయసులోనే చనిపోయాడు జగన్నాథరావు జమీందారు.

జగన్నాథరావు చనిపోయేనాటికి అతని భార్యకి ఇంకా మైనారిటీ తీరలేదు. అందుకని బెజవాడని బ్రిటిష్ వారే స్వాధీనం చేసుకుని ఎస్టేట్ వ్యవహారాలు నడిపారు. ఎస్టేట్‌ని నడిపేది వారే అయినా పాత బాకీని బాకీగానే వుంచి, కొత్త లాభాల్ని జేబులో వేసుకునే నీతిని అవలంభించారు.

కీ.శే.జగన్నాథరావు భార్య లక్ష్మీ నరసమ్మకి మైనారిటీ తీరాక, తమ జమీందారీ తమకి ఇప్పించమని అప్లయి చేసుకుంది.

1836లో జమీందారీ ఆమెకు అప్పగిస్తూ, పాతబాకీకి వడ్డీ తగిలించి, వడ్డీకి వడ్డీవేసి రెట్టింపు బకాయి చూపించి వెంటనే కట్టాలనీ, లేకపోతే చర్య తీసుకుంటామని హెచ్చరించారు బ్రిటిష్ అధికారులు.

ఆ బకాయి చెల్లించడం ఆ స్థితిలో ఆమెకు అసాధ్యం కాబట్టి ఆమె అశక్తురాలయింది. ఎస్టేట్ వేలానికి రాక తప్పలేదు.

లక్ష్మినరసమ్మ అక్కగారిని నూజివీడు జమీందారు రాజా శోభనాద్రి పెళ్ళి చేసుకున్నాడు. ఆ బంధుత్వంతో రాజా శోభనాద్రి బ్రిటిష్ వారితో మాట్లాడి ఎస్టేట్ అమ్మకాన్ని కొంతకాలం వాయిదా వేయించాడు.

కొంత సొమ్ము మాత్రమే గడుపులోగా కట్టగలిగారు. దాంతో 19జూన్ 1846న బెజవాడ జమీందారీని వేలం వేసేశారు.

వేలంపాటలో 3వేల రూపాయలకి తామే పాడేసినట్లు బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించుకుంది. కలవకొలను వారి పాలన అక్కడితో పరిసమాప్తి అయింది. లక్ష్మీనరసమ్మకు నెలకు 150 రూపాయలు ఉపకార వేతనం ఇవ్వడానికి బ్రిటిష్ వారు అంగీకరించారు.

ఆమె కొంతకాలం అక్కగారింట నూజివీడులో వుండి, అక్కణ్ణించి జుజ్జూరు వెళ్ళిపోయింది.

అక్కడ తన భర్త పూర్వీకులు కట్టిన కోటలో వంటరిగా చాలాకాలం జీవించింది. 1853లో ఆమె మరణించిందని గోర్డాన్ మెకంజీ రాశాడు.

అదీ బెజవాడ జమీందారీ విషాద గాథ.

# ముఠా కూలీల వ్యవస్థ ఇలా మొదలయ్యింది



ఒక ఔషధాన్ని కనిపెట్టినప్పుడు అందులో విషలక్షణాలు ఏమైనా వున్నాయేమో తెలుసుకోవడానికి ఎలుకల్ని, పిల్లుల్నీ, కుక్కల్ని, కోతుల్ని ఉపయోగించుకుంటూ వుంటాం. మనిషి రక్షణకోసం చేసే 'జీవహింస' కాబట్టి జీవకారుణ్య వాదులకి ఇందులో తప్పుకన్పించదు.

ఈస్టిండియా కంపెనీ ఏలుబడిలో వున్నప్పుడు ఇంగ్లీషు వాడు మాత్రమే మనిషి ఇంగ్లీషు మనిషి ప్రాణానికి ఎలాంటి ముప్పురాకుండా వుండటం కోసం ప్రాణహాని వున్న పనుల్లో ఇంగ్లీషు వారికి బదులుగా భారతీయుల్ని నియోగించాలనే నిర్ణయం కూడా ఇలాంటిదే. ఇందులో ఇంగ్లీషు వాడికి తప్పేమీ కన్పించదు.

1780-1850 ఈ మధ్యకాలంలో యూరోపియన్‌ల భాషలో "లస్కర్" అనే మాట తరచూ వినిపిస్తూఉండేది. దీని వుత్పత్తి ఏమిటో తెలియదు. కానీ, ఇంగ్లీషు నిఘంటువులు మాత్రం "హిందువులైన కళాసీలు - ఇండియన్ సైలర్స్" అని అర్థాన్ని యిచ్చాయి.

నావికుడు ఏదేశానికైనా, ఏ జాతీయుడికైనా నావికుడే! కానీ, ఇండియన్ సైలర్స్ అని ప్రత్యేకించడం దేనికి.? దాని కోసం ఒక ప్రత్యేక పదాన్ని సృష్టించడం దేనికీ... మరో కోణంలోంచి చూస్తే చాలా విషయాలు తెలుస్తాయి.

1783 ఏప్రియల్ 19, నుంచి, 1788 అక్టోబర్ 31, వరకు ఐదు సంవత్సరాల పాటు కలకత్తా సెయింట్ జాన్స్‌చర్చ్‌లో భద్రంగా వున్న మృతి చెందిన ఇంగ్లీషు వారి

రికార్డు పరిశీలించినప్పుడు, వారిలో దాదాపు 118 మంది ఇంగ్లీషు నావికా ఉద్యోగులే వున్నారని తేలింది. ఒక్కసారిగా గుండెలు బాదుకున్నారు ఇంగ్లీషు వాళ్ళు.

వ్యాపార సరుకులు తీసుకువచ్చి, తీసుకెళ్ళే నావికుడి ఉద్యోగం కోసం ఇంతమంది ఇంగ్లీషువారు ప్రాణత్యాగం చెయ్యాలా... ఇలాంటి ప్రాణహాని కల్గిన ఉద్యోగాల్లో ఇండియన్లని వేసుకోవాలిగాని, ఇంగ్లీషువాళ్ళని నియమించడం ఏమిటా... అంటూ పెద్ద దుమారం చెలరేగింది. ఒక్క సంవత్సర కాలంలో కనీసం 30మంది ఇంగ్లీషు నావికులు కేవలం సుఖవ్యాధులు కారణంగానే మంచం పట్టారట. రకరకాల వాతావరణాల కారణంగా అనేక ఇతర వ్యాధులు సోకి మరణశయ్య నెక్కినవాళ్ళు ఇంకా చాలా మంది వున్నారు.

1790 జులై 8, కలకత్తా గెజిట్‌లో ఒక కోర్టు ఉత్తర్వుని ప్రచురించారు. ఇలా రోగాలపాలై మంచం ఎక్కి విధులకు రాలేకపోతున్న 22 మంది యూరోపియన్ నావికుల పేర్లు రాసి వీళ్ళందర్నీ తక్షణం ఇంగ్లాండ్ వెళ్ళి పోవలసిందిగా ఆజ్ఞాపిస్తున్న ఉత్తర్వు అది. ఆ 25మందిబెంగాల్‌లోగాని, ఇండియాలోఎక్కడవున్నా సరే, వెంటనే ఇంగ్లాండ్ వెళ్ళకపోతే, వారిని లైసెన్స్ లేని వ్యక్తులుగా పరిగణించడం జరుగుతుందని హెచ్చరించారు. 1991 జులై9, గెజిట్‌లో ఇలాంటిదే మరో ఉత్తర్వు ఇస్తూ, ఈసారి మరో 25మంది ఇంగ్లీషు నావికుల పేర్లు ప్రకటించారు. ఇది ఆనాటి పరిస్థితి.

ఇంగ్లాండ్ ఆ రోజుల్లో "నెపోలియన్ యుద్ధాల"తో తలమునకలుగావుంది. రాయల్ నేవీ యుద్ధానికి పరిమితం కావడంతో ఓడ కళాసీలు (సైయిలర్స్)అవసరం ఎక్కువైంది. యుద్ధం ఎక్కడో జరుగుతుంటే, ఇక్కడ వ్యాపారాలు ఆగకూడదు కదా.

నావికులకుమూడు రకాలు ఉద్యోగాలుండాలి. 1. ఓడను నడిపే చాకచక్యం 2. ఓడ దొంగల్ని ఎదిరించిపోరాడే నేర్పు. 3. అన్నిరకాల వాతావరణాలను తట్టుకోగల్గిన శరీర దారుఢ్యం. ఆ రోజుల్లో నడిసముద్రంలో నావకు దిక్కులేని స్థితి వుండేది. ఎన్ని ఓడలు అదృశ్యమైపోయాయో లెక్కలేదు. బయల్దేరిన ఓడ వెళ్ళి. వెనక్కి సజీవంగా వస్తేనే కదా... అది వచ్చినట్లు జమ!

1813లో ఈస్టిండియా కంపెనీ ఛార్టర్‌ని పొడిగించారు. ఇండియాలో వ్యాపారం చేసుకొనేందుకు, వీలైనంతమేర అధికారాన్ని కైవసం చేసుకునేందుకు, ప్రత్యేకమైన ట్రేడింగ్ రైట్స్ కూడా ఇచ్చారు. ఈ పొడిగింపు తర్వాత ఇంగ్లీషేతర నావికులతో వ్యాపారపరమైన ఓడల్ని నడుపుకోవడానికి కంపెనీ పాలకులకు కొన్ని ప్రత్యేకమైన అధికారాలు వచ్చాయి.

1815లో నెపోలియనిక్ యుద్ధాల నుండి ఇంగ్లాండ్ కూడా బైటపడి వ్యాపార విషయాల మీద దృష్టిని పెట్టడం ప్రారంభించింది. సంవత్సరానికి 3వేల టన్నుల షిప్పింగ్‌ని వ్యాపారవసరాలకు నిర్వహించాలని లక్ష్యంగా పెట్టుకున్నారు.

ఇండియాలో తయారైన ఓడలు బెంగాల్, మద్రాసు, మచిలీపట్నం, బొంబాయ్ ఓడ రేవుల్లో 14,955 టన్నుల వ్యాపారాన్ని చెయ్యసాగాయి. అంతకు పూర్వం ఇంగ్లీష్

నావికుడికి భారతీయ నావికుడికన్నా 60-70 శాతం ఎక్కువ చెల్లించవలసి వచ్చేదట. ఆ విధంగా ఇంగ్లీషు వాళ్ళకి చావు తప్పింది ఖర్చు తగ్గింది.

అన్ని విధాలా బ్రిటిష్ నావికులన్నా అధికమైన ఈ ఇండియన్ నావికుల్ని 'లస్కర్'లుగా వ్యవహరించడం మొదలు పెట్టారు. ఆరునెలల జీతం అడ్వాన్సుగా ఇంట్లో యిచ్చి లస్కర్‌లను ఓడమీద నియమించడం మొదలు పెట్టారు.

ఓడ యజమానులకు తనకు నచ్చిన లస్కర్‌లను నియమించుకనే అదికారాన్ని అనుమతించారు. 'ఘాట్ సరంగులు' పేరుతో వీళ్ళంతా 'గ్యాంగ్' లేదా ముఠాగా వుండేవారు, ఈ ముఠా నాయకుడితో మాట్లాడుకొంటే, ఆ ముఠాలోని వాళ్ళంతా ఒక ఓడకు నావికులుగా వెళ్ళే వారన్నమాట!

ఘాట్ సరంగుల పేరిట ఒక ఏజెంట్ ఇంగ్లాండ్‌లో వుండి, ఓడ యజమానుల నుండి రావల్సిన జీతభత్యాలు బకాయిలు వసూలుచేసి నావికుల ఇళ్ళలో అందజేయడం, ఇంగ్లాండ్ అధికారుల ఆదేశాల్ని ఓడలోపలి నావికులకు తెలియజేయడం- ఇలాంటివన్నీ ఈ ఏజెంట్ చూసేవాడు. లస్కర్‌లు క్రమశిక్షణతో మెలిగేలా చూసుకోవడం ఈ ఏజెంట్ బాధ్యత.

'బేటాలస్కర్'లని , నదులమీద, సముద్రం మీద లోడింగ్, అన్‌లోడింగ్‌లో పాల్గొనే నావికులు కూడా వుండేవాళ్ళు. వీళ్ళు కూడా ముఠా పద్ధతిలోనే పనికి కుదిరేవాళ్ళు.

ఈ ముఠాలకు -ఓడ యజమానులకు మధ్య బ్రోకర్లుగా పనిచేసే ఏజెంట్లకు రిజిస్ట్రార్ నుండి లైసెన్స్ పొందే నిబంధనలని ప్రభుత్వం 1837లో ప్రవేశపెట్టింది. లైసెన్స్ పొందిన బ్రోకర్ సంతకం చెయ్యనిదే ఓడ కదిలేదికాదు. తన ఓడలో ఎంతమంది లస్కర్‌లను తీసుకెళుతున్నదీ రిజిస్ట్రార్‌కు లెక్క చెప్పే పద్ధతి వుండేది.

1859లో లస్కర్‌ల సంక్షేమం కోసం అనేక పోరాటాల తర్వాత కొన్ని చర్యలు తీసుకున్నారు. బ్రిటిష్ నావికుల కన్నా లస్కర్‌లు మెరుగైన సేవలందిస్తారని బ్రిటిష్ అధికారులకు నమ్మకం బలపడింది. "రిచర్డ్ అల్సగేర్" అనే అధికారి ఇచ్చిన రిపోర్ట్‌లో విశేషాలివి:

భారతీయ నావికులు (లస్కర్‌లు)

1. త్వరగా తెలుసుకుంటారు, నేర్చుకుంటారు.
2. వేగంగా ఓడను నడపగలుగుతారు.
3. ఎక్కువ చురుకుగా వుంటారు.
4. తేలికగా యార్డ్‌లో కదలగలుగుతారు.
5. ఒక బ్రిటిష్ నావికుడు ఒక లస్కర్ కన్నా రెట్టింపు సరంజామా బరువుని వెంట తెచ్చుకొంటాడట. ఓడలో బరువుతోపాటు ఈ నావికుల స్వంత సామాను మరింత బరువును పెంచుతుంది కదా... బరువు విషయంలో ఒక ఇంగ్లీషు నావికుడు ఇద్దరు లస్కర్‌లతో సమానం..ట!

6. అయితే, ఇంగ్లీషు నావికులకన్నా ఇండియన్ లస్కర్‌లు శ్రమని తక్కువగా తట్టుకోవడంతో లస్కర్‌లు ఎక్కువమందిని తీసుకువెళ్ళవలసి వుంటుంది.
7. చలిప్రాంతాల్లోకి వచ్చినప్పుడు ఇంగ్లీషువాళ్ళకన్నా లస్కర్‌లు త్వరగా జలుబు, జ్వరాలకు లోనౌతారు.
8. ఓడ స్టీరింగ్ పట్టుకునే 'హెల్మ్‌మెన్'గా లస్కర్‌లకన్నా ఇంగ్లీషు వాళ్ళు మెరుగ్గా పనిచేయగలుగుతారు.
9. ఓడ ప్రమాదానికి లోనౌతున్నప్పుడు ఇంగ్లీషు వాడు ఆలోచించినంత చురుకుగా ఆలోచించలేరు! లస్కర్‌లు కంగారుపడతారు. ధైర్యం ప్రదర్శించలేరు.
10. లస్కర్‌లకన్నా ఇంగ్లీషు నావికులే చౌకగా వస్తారు.

ఇలా ఇంగ్లీషు సెయిలర్లనీ, లస్కర్‌లనీ పోలుస్తూ ఒక పట్టిక యిచ్చాడు. ఇందులో 1859 నాటి నావికుల నెలవారీ జీతభత్యాల వివరాలున్నాయి.

| పదవి | లస్కర్‌ల జీతాలు | ఇంగ్లీషు నావికుల జీతాలు | |
|---|---|---|---|
| కెప్టెన్ | 400రూపాయలు | 30పౌండ్లు | |
| మొదటి ఆఫీసర్ | 120॥ | 7పౌండ్లు | |
| రెండవ ఆఫీసర్ | 90॥ | 5 ॥ | |
| మూడవ ఆఫీసర్ | 60॥ | 3పౌండ్ల | 10షిల్లింగ్‌లు |
| గన్నర్(బోయ్) | 30॥ | 3॥ | 15 ॥ |
| హెల్మ్‌మెన్(లేదా) బోట్ స్వయిన | 80॥ | 4॥ | |
| సరంగు | 20॥ | 5 ॥ | |

ఇలా చాలా పట్టిక వుంది. ఈ మొత్తాన్ని లెక్కగట్టి చూస్తే, కేవలం ఇంగ్లీషు నావికులతో ఓడ నడిపితే 47పౌండ్లు చిల్లర తక్కువ ఖర్చవుతుందని తేలింది! అయినా లస్కర్‌లకే ప్రాధాన్యత ఇచ్చారు ఎందుకంటే, ఈ ఓడ ప్రయాణాలు రిస్కుతో కూడుకున్నవి. ఓడ దొంగల వలన వాతావరణ పరిస్థితుల వలన ఉప్పెనలు ఉపద్రవాల వలన, అనారోగ్యాలవలన ప్రాణహాని ఎక్కువ. అనవసరంగా బ్రిటిష్ వాడికి ప్రాణహాని ఎందుకు కలగాలి...? అదీ ప్రశ్న!

1808లో 'లూసీ మేరియా' అనే ఓడలో 86 మంది లస్కర్‌లు వెడితే, 22మంది చనిపోయారు. 20మంది జబ్బుపడి ప్రాణాపాయస్థితిలో తిరిగి వచ్చారు. 'సూరత కాజివవ్' అనే ఓడలో 123మంది లస్కర్‌లు వెడితే 36 మంది ఇండియాకు తిరిగి రాకుండానే చనిపోయారు. 45మంది తీవ్రంగా జబ్బుపడ్డారు.

లస్కర్‌ల వ్యవస్థ ఏర్పడడం వెనక ఇదే అసలైన కథ.

# బ్రిటిషర్లు చేసిన చట్టాలలో భారతీయతను సాధించిన సంస్కర్తలు

1793-

ఈస్టిండియా కంపెనీ చార్టర్‌ని కొనసాగించే విషయం బ్రిటన్ పార్లమెంట్‌లో చర్చకు వచ్చింది. ఇవాన్జెలికల్ పార్టీ నాయకుడు 'విల్బర్ ఫోర్స్' ఈ అంశం మీద మాట్లాడుతూ, బ్రిటిష్ ఇండియా'లో ప్రజల్ని విజ్ఞానవంతుల్ని చేసేందుకు స్కూల్ మాస్టర్లని పంపేవిధంగా కంపెనీ డైరెక్టర్లని ఆదేశించాలని ప్రతిపాదించాడు. అందుకు తగిన చట్టం చేయాలని సూచించాడు. దాంతో పార్లమెంటులో పెద్ద దుమారం రేగింది.




'అమెరికాలో ఇలానే స్కూళ్ళు పెట్టి, చివరికి ఆ దేశాన్ని చెయ్యి జార్చుకున్నాం. ఇప్పుడు ఇండియాలో స్కూళ్ళు పెడితే, చేసిన తప్పే చేసినట్లవుతుంది'. అని ముక్తకంఠంతో బ్రిటన్ పార్లమెంట్ సభ్యులు ఆ ప్రతిపాదనని తిరస్కరించారు.

ఇండియన్లకు చట్టాల పరిజ్ఞానం, రాజకీయ చైతన్యం పెరిగితే తమ ఉనికికే ప్రమాదం అని నిస్సిగ్గుగా బ్రిటిష్ పార్లమెంట్ ప్రకటించింది ఆరోజున.

1820-27 మధ్య కాలంలో 'లార్డ్‌మన్రో' మద్రాస్ ప్రోవిన్స్ గవర్నర్‌గా వున్నప్పుడు విద్యావ్యాప్తి కోసం చాలా కృషి చేశాడు. ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లకు ఆయన ఒక ఉత్తరం రాస్తూ, సంవత్సరానికి 50,000 రూపాయలు గ్రాంట్‌గా ఇస్తే, తన ప్రావిన్స్ మొత్తంలో స్కూళ్ళు తెరిచి, యువకుల్ని విద్యావంతుల్ని చేసి, వాళ్ళచేత ఇండ్రస్టీలు పెట్టించి, ప్రభుత్వ ఆదాయం పెరిగేలా చేయగలమని ప్రతిపాదించాడు. పగటికలలు కనవద్దని కంపెనీ పాలకులు ఈ ప్రతిపాదనను తిరస్కరించారు.

1600 డిసెంబర్ నెల ఆఖరిరోజున బ్రిటన్ నుంచి 'గ్లోబ్' అనే ఓడలో ఏజెంట్లు ఇండియాకి బయల్దేరి వచ్చినప్పుడు 1612లో 'థామస్ రో' అనే రాయబారి మొఘల్ చక్రవర్తి జహంగీర్ ని సూరత్‌లో స్థావరం కోసం అభ్యర్థించినప్పుడు, స్థానికంగా వున్న రాజుల్ని, జమిందారుల్ని వాణిజ్య స్థావరాలు(ఫ్యాక్టరీలు) నెలకొల్పుకోదానికి దేబిరించినప్పుడు,

ఆనాటి ఇండియన్ కోర్టుల పరిధిలోనే, ఇండియన్ చట్టాలకు అనుగుణంగానే నడుచుకుంటామని వాగ్దానాలు చేశారు-కంపెనీ పాలకులు. కాలం మారింది. మూటలు మోసుకొచ్చిన వారికి అధికారాలు వచ్చిన తర్వాత ఇచ్చిన మాటలు మరిచిపోయారు.

21-08-1772న ఈస్టిండియా కంపెనీ ఒక రెగ్యులేషన్ ద్వారా మొదటి'రూల్ ఆఫ్ లా' చేసినట్లు రికార్డులు చెప్తున్నాయి. 05-07-1781న హిందువులూ, ముస్లింల కోసం విడివిడిగా చట్టాలున్నప్పటికీ, అందరికీ సమానమైన న్యాయం, ధర్మం అనే సూత్రం ముసుగులో, తమ ఇష్టానుసారం తీర్పు చెప్పే అధికారం కోర్టులకు దాఖలు పరుస్తూ మరోచట్టం చేశారు.


ఈశ్వరచంద్రవిద్యాసాగర్

1792లో లార్డ్‌కార్న్‌వాలీస్ మతపరమైన అంశాల్ని చట్టపరమైన అంశాల్ని చట్టపరమైన పరిభాషలోంచి నిషేదించాడు. ఇదంతా జరుగుతున్నా, తమ తమ మతాల జోలికి రాకుండా వుంటే, ఏ ప్రభుత్వం ఎలాంటి చట్టాలు చేసుకున్నా తమకు అభ్యంతరం లేదన్నట్లు మిన్నకుండిపోయారు. పోయారు మత పెద్దలు. ఇది కర్రపెత్తనానికి మరింత వూపునిచ్చింది.

1807లో ప్రావిన్స్‌ల గరర్నర్లకి తమ ఇష్టం వచ్చిన చట్టాలు చేసుకునే అధికారాలు కల్పించారు. కనీసం పాతికేళ్ళ పాటు గవర్నర్లు ఇష్టారాజ్యంగా పాలించారు. ఆ తర్వాత 1833లో ఈ విచక్షణాధికారాల్ని 'గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్' కు కట్టబెట్టి, దేశం మొత్తాన్ని ఒక వ్యక్తి గుప్పెట్లో కేంద్రీకరింపచేశారు. ప్రభుత్వ నిర్ణయాలు ఏవైనా అవి దేశం అంతా అమలయ్యే అవకాశం ఇందువలన ఏర్పడింది. అయితే సామాజికమైన సంస్కరణలను చట్టరూపంలో తీసుకురావడానికి ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని ఆనాటి సంస్కర్తలు భావించారు. 'ఏ బ్లెస్సింగ్ ఇన్ డిజ్‌గైజ్" లాంటి పరిస్థితి ఇది.

1828లో రామ్మోహన్‌రాయ్ బ్రహ్మసమాజాన్ని వ్యవస్థాపించి పోరాడటం ద్వారా సతీసహగమనాన్ని నిషేధింపచేయగలిగారు. 1875లో దయానంద సరస్వతి ఆర్యసమాజం, 1834-1886 మధ్యకాలంలో రామకృష్ణ పరమహంస రామకృష్ణమిషన్, 1875లో బ్లావట్‌స్కే కల్నల్ ఆల్కాట్ వ్యవస్థాపించిన థియొసాఫికల్ సొసైటీ 1887లో ఇండియన్ నేషనల్ సోషల్ కాన్ఫరెన్స్, 1892మద్రాస్ హిందూ సోషల్ రిఫార్మ్ అసోసియేషన్, 1892 మద్రాస్ అదిద్రావిడ మహాజనసభ, 1901 మద్రాస్ మహ్మడియన్ ఎద్యుకేషనల్ అసోసియేషన్,1873లో వై.ఎం.సి.ఎ.. ఇలా ఎన్నో సంస్థలు సంస్కరణల కోసం ఏర్పడి బ్రిటిష్ పాలకుల మెడలు వంచి కొన్ని విజయాలు సాధించగలిగాయి.

1855లో ఈశ్వర చంద్ర విద్యాసాగర్ పట్టుదల ఫలితంగా విధవాపునర్వివాహ చట్టాన్ని లార్డ్ డల్‌హౌసీ ప్రవేశపెట్టాడు. 1891-96 మధ్యకాలంలో మద్రాస్ గవర్నర్‌గా

వున్న వెన్‌లాక్ 'యాంటీ నాచ్' బిల్లు తీసుకొచ్చాడు. దేవాలయాలలో దేవదాసీ వృత్తిని నిషేధింపచేయాలని, మద్రాస్ హిందూ సోషల్ రిఫార్మ్ అసోసియేషన్ చేసిన పోరాటం ఈ చట్టాన్ని సాధించింది.

మద్యపాన నిషేధం మీద కూడా అనేక సంస్థలు ఉద్యమించాయి. 30-04-1889న బ్రిటిష్ పార్లమెంట్‌లో శామ్యూల్ స్మిత్ అనే సభ్యుడు ఆబ్కారీ ఆదాయం కోసం మన ప్రభుత్వం విచ్చలవిడిగా మద్యం అమ్మకాల్ని ప్రోత్సహించి అక్కడ ఇండియన్లని బలహీనుల్ని చేయడం అన్యాయం, అమానుషం, అని వాదించాడు. తీవ్ర వాదోపవాదాల తర్వాత ఓటింగ్ జరిగింది. ఇండియాలో సంపూర్ణ మద్యనిషేధానికి అనుకూలంగా 113మంది, వ్యతిరేఖంగా 100మంది ఓటు వేశారు. 13 ఓట్లతో తీర్మానం నెగ్గింది. కానీ, లండన్ ప్రభుత్వం సాధకబాధకాల పరిశీలన కోసం ఒక కమిషన్‌ను బ్రిటిష్ పార్లమెంట్ చేసిన వేసి ఈ తీర్మానాన్ని చెత్తబుట్టలోకి నెట్టేసింది.

1865లో మద్రాస్ నేటివ్స్ అసోసియేషన్ పక్షాన గాజుల లక్ష్మీనరసుచెట్టి, బి. రంగయ్యనాయుడు, పి. ఆనందాచార్యులు, సుబ్రహ్మణ్య అయ్యర్, విజయరాఘవాచారియర్, ప్రభృతులు చేసిన పోరాటాల ఫలితంగా దేశంలో స్థానిక స్వపరిపాలన (లోకల్ సెల్ఫ్ గవర్నమెంట్స్) విధానాన్ని ఒక చట్టం ద్వారా ప్రవేశపెట్టడం జరిగింది.

1833 చార్టర్ చట్టం, 1860లో ఇండియన్ పీనల్ కోడ్ అమలులోకి వచ్చాయి. 1862లోనే మున్సిపల్ వ్యవస్థని ఏర్పరిచారు. 1870లో లార్డ్‌మేయో ప్రావిన్షియల్ ఫైనాన్స్ పద్ధతిని ప్రవేశపెట్టాడు. విద్య, ఆరోగ్యం, పరిశుభ్రత పబ్లిక్ వర్క్స్ కోసం లోకల్ ఫండ్స్ ఏర్పరిచేందుకు ఇది దోహదపడింది. 1929లో రావుసాహెబ్ హర్ బిలాస్ శారద అనే సంస్కర్త సెంట్రల్ లెజిస్లేచర్‌లో ప్రైవేట్ బిల్లుగా 'చైల్డ్ మ్యారేజ్ రిస్ట్రయింట్ యాక్ట్' ప్రవేశపెట్టారు. ఇదే శారదాచట్టం పేరుతో అమల్లోకి వచ్చింది. ఆడపిల్లకు 14ఏళ్ళు, మగపిల్లలకు 18 ఏళ్ళు వివాహానికి కనీస వయసుగా ఈ బిల్లులో ప్రతిపాదించడం జరిగింది.

1850లో 'కేస్ట్ డిజెబిలిటీస్ రిమూవల్ చట్టం' 1866లో 'ది నేటివ్ కన్వర్ట్స్ మ్యారేజ్ డిజల్యూషన్ చట్టం' 1870లో 'ది హిందూ విల్స్ చట్టం'... ఇవన్నీ సంస్కరణ వాదుల కృషి ఫలితంగా సాధించుకున్న విజయాలకు కొన్ని సాక్ష్యాలు మాత్రమే!

1889 కాంగ్రెస్ సెషన్‌లో 'ది హిందూ' దినపత్రిక ఎడిటర్ సుబ్రహ్మణ్య అయ్యర్, 13వ ఏటనే వైధవ్యం పొందిన తన కూతురికి మళ్ళీ పెళ్ళి చేసి సంస్కరణలు అనేవి చెప్పే నీతులు కావు-చేసే నీతులని నిరూపించాడు.

పశ్చిమ భారతదేశంలో రఘునాధదాస్, ఉత్తరభారతదేశంలో మహాదేవ గోవింద రనడే, దక్షిణ భారతదేశంలో దివాన్ రఘునాధరావు, కందుకూరి వీరేశలింగం... ఇలాంటి సంస్కర్తల్ని ప్రొద్దున్న లేస్తూనే స్మరించుకోలేకపోతే, అంతకన్నా కృతఘ్నుత ఇంకొకటి ఉండదు.

# అగ్రవర్ణాలకే పరిమితమైన బ్రహ్మ సమాజం


రామ్మోహనరాయ్

భారతీయుల్లో రెండు వర్గాల మనుషులున్నారు. ఒకళ్ళు అంటుకోదగినవాళ్ళు. ఇంకొకరు అంటరాని వాళ్ళు. ఈ రెండు తెగల్నీ ఏకం చెయ్యగలిగే ఉద్యమం ఏదీ ఈనాటికీ ప్రారంభం కాలేదు. వేమన, వీరబ్రహ్మం లేకపోతే, కులాల మూలాలను కుళ్ళగించే పరిస్థితి తెలుగు నేలమీద ఏర్పడేదా అనేది సందేహం. 16వ శతాబ్దపు తొలి దశాబ్దాల్లో బ్రహ్మసమాజం పరిమితంగానే అయినా, కొంతవరకూ హిందూ సమాజాన్ని కదల్చగలిగింది.

రామ్మోహనరాయ్ నుంచి వీరేశలింగం దాకా సాగిన నూరేళ్ళ బ్రహ్మ సమాజ ఉద్యమంలో లబ్ధిదారులు ఎవరనేది ముఖ్య ప్రశ్న.

హిందువుల్ని రాజకీయ ప్రయోజనాలు పొందే విధంగా సన్నద్ధుల్ని చేయడం కోసం హిందూ మతంలో కొన్ని మౌలిక మార్పులు తీసుకురావాలని ఆశించారు. బ్రహ్మ సమాజం ఆలోచనల వెనక బెంగాలీ సామాజిక వ్యవస్థ ఉంది. కొత్తగా ధనికులైన (Elite) భూస్వామ్యవర్గం, మధ్యతరగతి మేధావులూ వున్నారు. పాశ్చాత్య నాగరకత, ఆధునిక యుగపు ఆలోచనాధోరణి, ఇంగ్లీషు విద్య, పారిశ్రామిక విప్లవం, అప్పుడే వ్రేళ్ళూనుకుంటున్న సోషలిజం భావనల ప్రభావాల్లోంచి బ్రహ్మసమాజం పుట్టింది.

1862లో మొదటి కులాంతర వివాహం జరిపించారు. కేశవ్‌చంద్రసేన్ అనే బ్రాహ్మణేతరుడు పురోహితుడిగా మారాడు. వేద పరిజ్ఞానం వున్న ప్రతి ఒక్కరూ వైదిక కర్మలకు పురోహితులుగా వుండవచ్చనే వాదన బయల్దేరింది. కాలక్రమంలో బ్రహ్మసమాజ పద్ధతిలో అనుష్టానాలు, వివాహంలో ఏడడుగులు నడవడం, శ్రాద్ధకర్మల్లో బ్రాహ్మణేతరులను సహపంక్తి భోజనానికి పిలవడం, జంధ్యాన్ని విసర్జించడం... ఇవన్నీ గొప్ప తాత్త్విక విప్లవాలుగా గుర్తింపు పొందాయి. ప్రతి కులమూ తమకూ పౌరోహిత్యం జరుపుకునే అవకాశాల కోసం తిరుగుబాట్లు చేశాయి. కొత్తగా ధనవంతులైన వారికి సోషల్ స్టేటస్ కోసం వారి కులాలను బ్రాహ్మణ కులంతో సమానం చెయ్యాలనే ఆలోచనలు మొదలయ్యాయి.

అయితే 19వ శతాబ్ది చివరి పాదం వరకూ ఇవన్నీ ఒట్టి కులాల కుమ్ములాటలే! వీటిలో సంస్కరణలపాలు ఏమీ లేదు. లబ్ధిదారులు కేవలం అగ్రకులాలవారే! భారతీయ సమాజంలో రెండవ పార్శ్వాన వున్న దళితులకు ఈ సంస్కరణల్లో ఏమాత్రం పాత్ర కల్పించబడలేదు. వివేకానందుడొక్కడే 1893లో మద్రాసు వచ్చినపుడు సంస్కరణవాదుల కుహనా దేశభక్తిని ఎండగట్టాడు. మనుషులందరూ సమానమే అనే వ్యవస్థ కోసం పోరాడండి. అదే అసలైన సంస్కరణ అన్నాడు. దళితులకు సమాన సామాజిక హోదాని కల్పించాలని పోరాడవలసిందిగా ఉద్బోధించాడు.

దేవేంద్రనాథ్ ఠాగూర్, కేశవ్ చంద్రసేన్, రాజ్‌నారాయణ్‌బోస్, శివనాథశాస్త్రి... వీళ్ళు బ్రహ్మసమాజంలో ఆనాటి జాతీయస్థాయి నాయకులు. ఈ నల్గురి మధ్య ఏర్పడిన వ్యక్తిగత వైషమ్యాలు, ఇగో తేడాలు బ్రహ్మ సమాజాన్ని అనేక మార్గాలు పట్టించాయి. అయినా, ఏ ఒక్క మార్గమూ దళితుల సమానత్వం వైపు సాగలేదు.

1828లో సతీసహగమన నిరోధ చట్టం తర్వాత 1866లో హిందూ వివాహ చట్టం సాధించడంలో కేశవ్‌చంద్రసేన్ గణనీయమైన పాత్ర పోషించాడు. కానీ, తన స్వంత కుమార్తెకు ఇంకా పెద్దమనిషి కాకమునుపే కుచ్ యువరాజ్‌కిచ్చి పెళ్ళిచేసి సంస్కరణలన్నీ చెప్పేటందుకు మాత్రమే ఉపయోగించే నీతులుగా నిరూపించాడు.

అనేక కారణాల వలన బ్రహ్మసమాజాన్ని అనేకసార్లు చీల్చి, దాని నాయకులు ఎవరికి వాళ్ళు సొంత కుంపట్లు పెట్టుకున్నారు.

ఉపాసనా సమాజం, ఆది బ్రహ్మసమాజం, భారత్ వర్ష బ్రహ్మసమాజం, సాధారణ బ్రహ్మసమాజం, ప్రార్థనా సమాజం... ఇవన్నీ బ్రహ్మ సమాజంలోంచి ఏర్పడిన పీలికలే!

అయితే బ్రహ్మ సమాజం దళితుల కోసం కొంత పరిశ్రమించకపోలేదు.

1850లో ఇండియాలో బళ్ళు పెట్టి చదువు నేర్పించడానికి ఈస్టిండియా కంపెనీ ససేమిరా అంగీకరించనప్పుడు స్కూళ్ళ నిర్వహణ విషయంలో బ్రహ్మ సమాజం గణనీయమైన పాత్ర నిర్వహించింది.

రాజమండ్రిలో జి.ఎన్.టేలర్ సబ్ కలెక్టర్‌గా వున్నప్పుడు, 1852లో 'రేట్ స్కూల్స్' అనే పేరుతో నర్సాపూర్, పాలకొల్లు, పెనుగొండ, ఆచంట... ఈ నాలుగు ఊళ్ళలో నాలుగు స్కూళ్ళు పెట్టించాడు. స్థానిక ప్రజలు చందాలు వేసుకొని ఉపాధ్యాయుల జీతభత్యాలు భరించారు. దీని విషయమై ప్రభుత్వానికి సంజాయిషీ యిచ్చుకుంటూ, రైతులొచ్చి తామే స్కూలు నడుపుకుంటాం అంటే, ప్రభుత్వానికి ఖర్చులేదు కదా... అని

సరేనన్నట్లు చెప్పుకున్నాడు. ఈ రేట్ స్కూళ్ళ ప్రతిపాదన ప్రభుత్వానికి నచ్చింది. ఇదే పద్ధతిని దేశం అంతా అమలు చేయాలని నిర్ణయించారు. అలా ప్రజలు తమకు తాము నడుపుకునే స్కూళ్ళని "టేలర్ సిస్టమ్ స్కూళ్ళు" అని పిలిచారు. రాజమండ్రి సిస్టమ్ ఆఫ్ స్కూలింగ్ అని కూడా వ్యవహరించారు. దేశంలో ఆనాటి అన్ని ప్రావిన్స్‌ల్లోనూ టేలర్ స్కూళ్ళు వెలిశాయి. అస్పృశ్యులకు వీటిలో ప్రవేశం కల్పించారు.

1862లో టేలర్ స్కూళ్ళకు మ్యాచింగ్ గ్రాంట్స్ ఇచ్చింది ప్రభుత్వం. 1871లో లోకల్‌ఫండ్స్ ఏర్పరిచారు. ACT III పట్టణాలకోసం, ACT IV గ్రామాలకోసం వర్తింపజేశారు.

1877లో మద్రాస్ ప్రావిన్స్‌లో మొదటి గ్రేడ్ కాలేజీలు ప్రారంభమయ్యాయి. 1882 నాటికి ఆంధ్ర ప్రాంతంలో నాలుగు కాలేజీలున్నాయి... రాజమండ్రి, విజయనగరం, విశాఖపట్నం, మచిలీపట్నం!! 1884లో పిఠాపురం రాజా, కాకినాడలోనూ, 1885లో ఎవాంజెలికల్ లూథర్ కమిషన్ గుంటూరులోనూ కాలేజీలు పెట్టారు. కానీ వీటిలో చేరిన అస్పృశ్యుల సంఖ్య 2 శాతం కన్నా తక్కువగా వుంది.

1883-84 నాటికి, విద్యావంతుల శాతం ఈవిధంగా ఉంది:

బ్రాహ్మణులు : 72.21%, కాపులు, రెడ్లు : 9.55%, వైశ్యులు : 60.46%, దళితులు, ఇతరులు : 2.75%, బలిజలు : 20.12%

ఈ చదువుకున్న వాళ్ళలో భూస్వాముల పిల్లలు 38.4%, అధికారుల పిల్లలు 28.5%, చిన్న ఉద్యోగుల పిల్లలు 11.8%, వ్యాపారుల పిల్లలు 7.0%, ఇతరులు 14.3% వున్నారు.

1882లో ఎడ్యుకేషన్ కమిషన్ ముందు పి.చెంచలరావు అనే బ్రహ్మ (బ్రహ్మసమాజం) ఇచ్చిన వాంగ్మూలంలో, వెనకబడిన కులాలవారూ, దళితులూ తమ పిల్లల్ని స్కూల్‌కు పంపలేని స్థితిలో వున్నారని, ఇల్లు గడవడం కోసం కూలి పనులకు పంపుకుంటున్నారనీ చెప్పాడు. ప్రతి గ్రామంలోనూ ఒక స్కూల్ ఏర్పాటు చేయవలసిందిగా ఆయన ప్రభుత్వాన్ని కోరాడు.

బ్రహ్మ సమాజం అగ్రవర్ణాల సమస్యలకు ప్రాధాన్యతనిచ్చి పోరాడుతుంటే, క్రైస్తవ మిషనరీలు దళితుల్ని రెచ్చగొట్టి వాళ్ళని తమ మతంవైపుకు ఆకర్షించుకొనే పనిలో కూరుకునివున్నాయి.

1869లో చెంబేటి శ్రీధరలునాయుడు స్థితిమంతుడు కాకపోయినా బ్రహ్మసమాజం ప్రచారం భుజాన వేసుకున్నాడు. దక్షిణభారత దేశంలో అనుష్ఠాన కర్మలు నిర్వహించడం

మొదలుపెట్టిన మొదటి బ్రాహ్మణేతరుడు ఈయనే. కడలూరుకు చెందిన తెలుగువాడు ఈ శ్రీధరలునాయుడు. తమిళదేశంలోని పరియా దళితుల గురించి పోరాడింది ఈయనే. 1874లో యాక్సిడెంట్‌లో మరణించాడు.

కృష్ణాజిల్లాలో మన్నవ బుచ్చయ్యపంతులు అనే స్కూలు మాస్టారు తన బడిపంతులు ఉద్యోగం వదిలేసి బ్రహ్మసమాజంలో చేరాడు. జంధ్యం వదిలేసిన మొదటి బ్రాహ్మణుడు ఈయనే! రఘుపతి వెంకటరత్నం నాయుదుని బ్రహ్మసమాంలోకి లాంగిదీ ఈయనే.

కోకా వెంకటరత్నం నాయుడు, పిల్లరిసెట్టి సీతారామయ్య, ఆదిపూడి సోమనాధరావు, దేశిరాజు పెదబాపయ్య, ఆర్.వెంకటశివుడు, రొక్కం బాలకృష్ణారావు, వరాహగిరి జోగయ్యపంతులు వీళ్ళంతా ప్రముఖ బ్రహ్మ సామాజికులు ఆ రోజుల్లో.

బ్రహ్మసమాజం జాతీయ నాయకుడు శివనాధశాస్త్రి ఆంధ్ర పర్యటనకు వచ్చినపుడు, ఒకసారి టైఫాయిడ్ జ్వరం పడ్డాడు. అది అంటువ్యాధి అని భయపడి బ్రహ్మసమాజం తెలుగు నాయకులు దూరం దూరంగా జరిగారట. మంచానపడిన ఆయనకు సేవలు చేయడానికి ఒక పాకీ వృత్తిలో వున్న వ్యక్తిని సేవకుడిగా నియోగించారట.

శివనాధశాస్త్రి ఈ విషయం రాస్తూ, ఆంధ్రలో బ్రహ్మసమాజికులు ఇంకా హిందూ మతంలోనే వున్నారు- అన్నాడు.

1870 తర్వాత దళితులు క్రైస్తవ మతంలోకి వెళ్ళడం చాలావరకూ ఆగింది. బ్రహ్మ సమాజికులు తాము చేసిన కృషి వల్లనే ఇది సాధ్యం అయ్యిందని చెప్పుకున్నారు. పట్టాభిసీతారామయ్య మాత్రం ఇందుకు కారణాలు వేరే విశ్లేషిస్తూ, 1870 తర్వాత పంటలు బాగా పండడం కారణంగా క్రైస్తవ మతంలోకి వలసలు ఆగాయి. 1895లో మళ్ళీ కొంతమేర కరువు ఏర్పడడంతో ఒకటీ అరా మొదలయ్యాయి అన్నారు. ప్రభుత్వం దాన్ని పరిశీలించమని జి.ఎన్.ఎడ్డీతో ఒక కమిటీని నియమించింది. రఘుపతి వెంకటరత్నంనాయుడు బ్రహ్మసమాజ బోధనల కారణంగా దళితులు క్రైస్తవులుగా మారకుండా ఆగినట్లు ఆయన తన నివేదిక అందించాడు.

బ్రహ్మ సమాజికులు క్రైస్తవుల ఏజెంట్లని హిందువులూ, హిందూ అనుకూలురని ప్రభుత్వమూ క్రైస్తవ మిషనరీలూ అనుమానించడంతో, రెంటికి చెడ్డ రేవడి అయ్యారు. 1920 తర్వాత బ్రహ్మ సమాజం కనుమరుగైపోయింది.

# స్వాతంత్రోద్యమం తొలకరి చినుకులు

1885లో భారతీయ కాంగ్రెస్ ఏర్పడటానికి ఇంకా ముందుగానే, 1884మే 16న మద్రాసులో తెలుగువారి నాయకత్వంలో "మద్రాసు మహాజన సభ" ఆవిర్భవించడం ఉద్యమ చైతన్యాన్ని రగిలించిన ఒక గొప్ప అంశం. ఈ సభకు పి.రంగయ్య నాయుదు అధ్యక్షుడు. పి. ఆనందాచార్యులు కార్యదర్శి. ఈ సభకి తెలుగు ప్రాంతాలనుంచి చాలా మంది ప్రతినిధులు హాజరుఅయ్యారు. ఇలాంటి చైతన్యాన్ని తమ ప్రాంతాల్లోకూడా కల్గించాలనే ఉత్సాహాన్ని పొందారు. కాకినాడ సాహితీ సభ ఇలాంటి ప్రేరణతోనే ఆ రోజుల్లో ఏర్పడింది.


1885 భారతజాతీయ కాంగ్రెస్ ఆవిర్భావ సభలకు హాజరైన ప్రతినిధులు

ఈ లోగా 1885లో బొంబాయిలో భారతజాతీయ కాంగ్రెస్ ఆవిర్భావ సభలు జరిగాయి. తెలుగు ప్రాంతం నలుమూలల నుంచి ప్రతినిధులు బొంబాయి వెళ్ళారు. బందరు, బెజవాడల నుంచి కూడా వెళ్ళారు.

ఆ వెంటనే 1886లో కలకత్తాలో కాంగ్రెస్ రెండో సభ జరిగింది. దానికీ తెలుగు ప్రతినిధులు హాజరుఅయ్యారు. 1891 నాగపూరు సభకి పి.ఆనందాచార్యులు అధ్యక్షులయ్యారు. పి. రంగయ్యనాయుడు, ఎ.సి. పార్థసారధి నాయుడు (ఆంధ్ర ప్రకాశిక సంపాదకులు) న్యావతి సుబ్బారావు ప్రభృతులు మొదటినుంచీ భారత జాతీయ కాంగ్రెస్ కోసం పనిచేస్తున్న ప్రముఖులు. ఈ సభలలో వీరు ముఖ్యపాత్ర పోషించారు. నాగపూర్

సభలు తెలుగు వారికి జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు తెచ్చాయి. బహుశా ఇదే మన వాళ్ళకి కల్గిన మొదటి మంచి అవకాశం గుర్తింపు పొందడానికి!

1892లో శనగపల్లి రామస్వామి గుప్త భారత జాతీయ కాంగ్రెస్‌కు కృష్ణాజిల్లాశాఖని ఏర్పాటు చేసి దానికి జాతీయ కేంద్రంగా గుర్తింపు సాధించాడు. కాంగ్రెస్‌కు ఒక జిల్లాస్థాయి శాఖ ఏర్పడడం ఇదే మొదటిసారి. ఈ ఘనత దేశంలో కృష్ణాజిల్లాలోనే ముందుగా దక్కింది. 1892 జులైలో ఈ భారత జాతీయ కాంగ్రెస్ కృష్ణాజిల్లాశాఖ మొదటి మహాసభ గుంటూరులోనూ, 1893 జూన్‌లో మచిలీపట్నంలోనూ, 1894 జూలైలో ఏలూరులోనూ జరిగాయి. 1904 వరకూ ఈ మూడు ప్రాంతాలూ కృష్ణా జిల్లాగానే వుండేవి. కృష్ణా జిల్లాని మచిలీపట్నం డిస్ట్రిక్ట్ అని కూడా తొలి రోజుల్లో వ్యవహరించారు.

రూపాయికి పావలా వంతున పెంచిన నీటితీరువాకు వ్యతిరేకంగా ఉద్యమించడానికి ఈ సభలు ఉపయోగపడ్డాయి.

1905 వందేమాతరం ఉద్యమం, తిలక్ సృష్టించిన జాతీయతా వాదం, జారు చక్రవర్తి ఆధీనంలోని రష్యాపై తిరుగుబాటు చేసి జపాన్ స్వాతంత్ర్యం పొందడం వంటి అంశాలు కృష్ణాజిల్లాలో సంచలనాత్మకమైన ఉత్తేజాన్ని కల్గించాయి.

ఆదిపూడి సోమనాథరావు అనే సంస్కర్త జపాన్‌వీరగాథని తెలుగులో రాసి కృష్ణాజిల్లా మునగాలరాజుకు అంకితం చేశాడు. జపాను సైన్యాధిపతి "తోగో" పేరునీ, అలాగే నావికా దళాపతి"నోగి" పేరునీ మునగాలరాజా తన ఇద్దరు కొడుకులకీ పెట్టుకున్నాడంటే స్వాతంత్ర్య పోరాట కాంక్ష ఈ శతాబ్దపు తొలిరోజుల్లో ఎంత బలీయంగా నాటుకొని వున్నదో అర్థం చేసుకోవచ్చు.

1906లో తెలుగు ప్రముఖులు కొందరు ఇండస్ట్రియల్ అసోసియేషన్ పేరుతో ఒక సంస్థను స్థాపించి, జపాన్ సాంకేతిక పరిజ్ఞానంలో శిక్షణ పొందేందుకు కొందరు విద్యార్థుల్ని స్పాన్సర్ చేసి జపాన్ పంపించారు. వారి ద్వారా ఇక్కడ పరిశ్రమల్ని వ్యవస్థాపించాలనేది లక్ష్యం!

1907 లో బిపిన్ చంద్రపాల్ రాజమహేంద్రవరం, మచిలీపట్నంలతోపాటు బెజవాడని సందర్శించాడు. "స్వదేశీ ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం" అనే అంశంపై ప్రసంగించాడు. మునగాలరాజు ఆయనకు ఆతిథ్యం ఇచ్చారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు అప్పుడు టీచర్ ట్రెయినింగ్ పొందుతున్నాడు. ట్రెయినింగ్ కాలేజీ ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ ఆజ్ఞను ధిక్కరించి, రాజమండ్రిలో బిపిన్ చంద్రపాల్ సభకు స్వాగతోపన్యాసం చేశాడాయన. మొత్తం 222 మంది విద్యార్థుల్లో 138 మంది సర్వోత్తమరావుగారిని ఎక్కడా టీచర్ ఉద్యోగంలోకి తీసుకోకుండా బ్లాక్‌లిస్ట్‌లో పెట్టించాడు. మద్రాసులో ఎం.ఎ. చేసిన విద్యావంతుణ్ణి ఈ విధంగా శిక్షించింది ప్రభుత్వం.

వందేమాతరం ఉద్యమ కార్యక్రమాలకు హాజరైనకారణంగా చదువుకునే అవకాశాలు కోల్పోయిన విద్యార్థులకోసం బందరులో కోపల్లె హనుమంతరావు ఒక జాతీయ పాఠశాలని, ఆ తర్వాత ఒక జాతీయకళాశాలనీ స్థాపించి నడిపించారు. ఆ రోజుల్లో 'బందరు'అంటే, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలు ఒంగోలులో సహా వున్న ప్రాంతం- కృష్ణాజిల్లాకు ముఖ్యపట్టణం.

ఈ ఉద్యమం రోజుల్లో మనుషులు హల్లో, హాయ్ అనిపిలుచుకునేవారు కాదు. "వందేమాతరం" అని పలకరించుకునేవాళ్ళు. అదీ ఉద్యమ స్ఫూర్తి అంటే!

హరి సర్వోత్తమరావు గారు తన పూర్తి కెరీర్‌ని కోల్పోయిన తర్వాత బెజవాడ వచ్చి ప్రజాజీవితంలోకి ప్రవేశించారు. గ్రంథాలయోద్యమానికి, వయోజన విద్యా వ్యాప్తికీ, సంస్కరణ కార్యక్రమాలకీ అంకితమై పనిచేయడం ప్రారంభించాడు.

1908 ఏప్రిల్ 20న బందరులో డాక్టర్ పట్టాభిసీతారామయ్య మట్నూరి కృష్ణారావు కలిసి, ఆంధ్రసంస్కరణవాదుల మహాసభ జరిపారు. వీరేశలింగం గారిని బందరుకు ఆహ్వానించారు. త్రిపురనేని రామస్వామిచౌదరి స్వాగత పద్యాలు సమర్పించారు. కానీ, ఛాందసవాదులకు ఇది గిట్టలేదు.

నాదెళ్ళ పురుషోత్తమ కవి స్త్రీలకు ఉన్నత విద్యలు, వృత్తి విద్యలు నేర్పించే విషయమై "స్త్రీల మీటింగు నేటి హరికథానాటకం"పేరుతో ఒక వ్యంగ్యరచని ప్రచురించి సంస్కరణ వాదుల్ని హేళన చేశాడు. దానిపై సంస్కరణ వాదులు తీవ్రంగా ఆగ్రహించారు. చెరుకువాడ వెంకటనరసింహం. అవటపల్లి నారాయణరావు, కౌతా శ్రీరమణమూర్తి ప్రభృతుల మీద క్రిమినల్ కేసులు పెట్టేదాకా అప్పట్లో ఈ వివాదం వెళ్ళింది.



హరి సర్వోత్తమరావు 1908 జూలై 18 న "స్వరాజ్య" పత్రికని బెజవాడలో స్థాపించారు. అప్పటికే కృష్ణా పత్రికవుంది. ఇదే బాటలో బందరులో "నవయుగ", గుంటూరులో "దేశాభిమాని", రాజమండ్రిలో 'ఆంధ్రకేసరి' పత్రికలు ప్రారంభం అయ్యాయి. కొమర్రాజు లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథమాలని 'పుస్తకాల దేవాలయం'గా ప్రజలు భావించుకున్నారు.

చూస్తుండగనే ఆనాటి కృష్ణా జిల్లాలో ఇంతరాజకీయ చైతన్యం పెరగడంతో బ్రిటిష్ ప్రభుత్వం నిప్పులు తొక్కింది.

ఆనాటి కృష్ణా కలెక్టర్ "మారిస్" సౌమ్యుడు. ఆయన్ని బదిలీచేసి 'స్కాట్' అనే క్రూరుణ్ణి కలెక్టరుగా పంపించారు.

అదే రోజుల్లో ఆలహాబాద్ నుంచి బ్రిటిష్ అనుకూలంగా నడుస్తున్న పయొనీర్ పత్రిక"కృష్ణాజిల్లాలో రాజద్రోహ ప్రచారం" పేరుతో ఒక వార్తకథనాన్ని ప్రచురించింది. కృష్ణా పత్రిక ఈ సంగతిని పసిగట్టి, రానున్న ప్రమాదానికి ఈ వార్తా కథనం ఒక హెచ్చరికలాంటిదని రాసింది.

ఈ లోగా స్కాట్ దొరగారు హిందువులైన దేశభక్తులమీద లాఠీలు ఝుళిపించడానికి 300మంది మహ్మదీయ రిజర్వ్ పోలీసుల్ని అధికారికంగా పిలిపించాడంటే, అందులో అంతరార్థం వూహించుకోవచ్చు. అనుకున్నట్లుగానే, బోడినారాయణరావునీ, హరిసర్వోత్తమ రావునీ నిర్బంధించారు. 1908 బెజవాడ రాజద్రోహం కేసుగా ఇది ప్రసిద్ధి చెందింది.

అయ్యదేవర కాళేశ్వరరావు. పింగళి లక్ష్మీనారాయణ, కాశీనాథుని వీరమల్లయ్య, సూరినరసింహం ప్రభృతుల ఇళ్ళు సోదాచేసి, కుటుంబసభ్యుల్ని, చుట్టు పక్కల ప్రజల్ని భయభ్రాంతుల్ని చేశారు. దక్షిణ భారతదేశంలో సంస్కరణలకోసం, స్వాతంత్ర్యం కోసం జైలు శిక్ష అనుభవించిన మొదటి స్వాతంత్ర్య యోధుడుగా గాడిచర్ల హరిసర్వోత్తమరావు తెలుగువారి ఆత్మీయతకు పాత్రులయ్యారు. ఈ ఊరువాడు కాకపోయినా, బెజవాడ కేంద్రంగా తన ప్రజాజీవితాన్ని ప్రారంభించిన సర్వోత్తమరావుకి ఈ నాటికీ బెజవాడ శిరసువంచి నమస్కరిస్తూనే వుంది.

బెజవాడ కేంద్రంగా ప్రారంభమైన గ్రంథాలయోద్యమానికి ఊపిరి పోసిన వాడు సర్వోత్తమరావు. ఊరూరా ఈ ఉద్యమ జ్యోతిని స్వాతంత్ర్యయోధులు రగిలించారు. స్వాతంత్ర్యోద్యమానికి మాత్రమే కాదు, అస్పృశ్యతా నివారణ, పంచములదేవాలయ ప్రవేశం, వయోజన విద్య, వరకట్నం, కన్యాశుల్కం నిషేధం వంటి సంస్కరణలకు గ్రంథాలయోద్యమం ఒక వేదికగా నిలిచింది. ఒక సాధనంగా, ఒక ఆయుధంగా కూడా ఉపయోగపడింది.

శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రి (కవిగారు)అచ్చతెనుగులో కొన్ని పదాలను వాడుకలోకి తెచ్చారు. లైబ్రరీ అనే మాటకి ఆయన పెట్టిన పేరు "పొత్తముల గుడి" అని! పుస్తకాల దేవాలయంలోకి స్వాతంత్ర్య పిపాసులు ప్రవేశించడం బెజవాడలోనే మొదలయ్యింది ఇలా!

# సాంస్కృతిక పునరుజ్జీవనానికి పురుడుపోసిన బెజవాడ రామ్మోహన గ్రంథాలయం

చారిత్రకంగా బెజవాడ గత వైభవాన్నంతా అలా వుంచితే, 18వ శతాబ్ది చివరినాటికి ఈ వూరు ఒక మారుమూలనున్న తీర్థయాత్రా స్థలం. అంతే!

బ్రిటిష్ ఏలుబడి కాలంలో రాజకీయంగా గానీ, సాంస్కృతికంగా గానీ మచిలీపట్నానికున్న ప్రాధాన్యత ఆనాటి బెజవాడకు లేదు.

క్రీ.శ. 1871లో బెజవాడ జనాభా 9,3336 మంది మాత్రమే! బందరులో అదే సమయంలో 35,056 మంది వుండేవారు. బెజవాడ కన్నా ఆనాటి బందరు మూడు రెట్లు పెద్దనగరం. గుంటూరు కూడా బెజవాడకు రెట్టింపు నగరం. 19,646 మంది జనాభా వుండేవారు. అందాకా దేనికీ, ఆనాటి జగ్గయ్యపేటలో బెజవాడకన్నా వెయ్యి మంది జనాభా ఎక్కువ. కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్‌లో ఈ వివరాలున్నాయి.

వీళ్ళల్లో గుణింతాలు, కూడికలు, తీసివేతలు నేర్చినవాళ్ళూ, భాషా పరిజ్ఞానం కొంతమేర కలిగిన వాళ్ళూ అడపాదడపా ఏదో ఒక ప్రభుత్వ ఉద్యోగంలో కుదురుతుండే వారు. మిగిలిన వారిలో అక్షరాస్యులు తక్కువ. మహావేద పండితుల్లో కూడా సంతకం చేయగల్గినవారు అరుదుగా వుండేవారంటే పరిస్థితిని అర్థం చేసుకోవాల్సిందే.

పుస్తకాలకు ఖచ్చితమైన పాఠకులు వీళ్ళే ఆనాటికి ! అక్షరాల్ని చదవడం కన్నా అక్షరాల్ని వినడానికే అవకాశం వుండేది. ఒకరు చెప్తోండగా, తక్కినవారంతా ఆనాటి సాహిత్యానికి "వినేపాఠకులు" గా వుండేవారు. ఈ "వినే పాఠకులు"గుర్తుంచుకునేందుకు అనుకూలంగా వుండే సాహిత్యాన్ని కోరుకునే వారు. పద్యసాహిత్యంలోనే ప్రబంధాలు పెరగడానికి ఇది ముఖ్యకారణం.

19వ శతాబ్ది మొదలయ్యే కాలం వరకూ ఇదే పరిస్థితి. ఆ తర్వాతే సామాజికంగా బెజవాడలో చాలా మార్పులొచ్చాయి. 24-10-1881 న కృష్ణానది మీద ఇంద్రకీలాద్రి, సీతానగరం కొండలమధ్య ఆనకట్ట నిర్మాణం పూర్తయిన తర్వాత, బెజవాడ మౌలిక స్వరూపమే మారిపోయింది. గొప్పవాణిజ్య కూడలిగా అది ఎదగసాగింది. రాజకీయ పరంగా, సాంస్కృతిక పరంగా తెలుగువారి రాజధానిగా మరోసారి ఎదిగే ప్రయత్నాలు కూడా చేయసాగింది... ఆనాటి బెజవాడ!

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, బెజవాడలోనే నివసిస్తున్న గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రభృతులు 19వ శతాబ్ది తొలినాళ్ళల్లో తెలుగువారి సాంస్కృతిక పునరుజ్జీవనానికి బెజవాడని కార్యస్థానం, కేంద్రస్థానం, జన్మస్థానం కూడా చేయగలిగారు.

ఇది ఇలావుండగా, ఆంగ్లవిద్య, సంస్కరణోద్యమాలు, జాతీయతాభావం... ఇవి విద్యావంతులలో ఆధునిక భావాలకు అంకురార్పణ చేశాయి. ప్రజల్లో విజ్ఞానవంతులు పెరగసాగారు. 'వినే పాఠకుల'కు బదులుగా 'చదివే పాఠకుల' సంఖ్య కూడా పెరగసాగింది. ముఖ్యంగా "వచన సాహిత్యం" ప్రముఖ స్థానాన్ని పొందడం మొదలయ్యింది.

కందుకూరి, గురజాడ, గిడుగురామ్మూర్తి ఒక తరం అయితే, కొమర్రాజు లక్ష్మణరావు తిలక్ ప్రభావాన జాతీయవాదిగా ఎదిగి, బెజవాడకు స్ఫూర్తిని కల్గించినవ్యక్తి. తెలంగాణాలో కూడా సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఆయన పాటుపడ్డారు. హైదరాబాద్‌లో కృష్ణదేవ రాయాంధ్ర భాషానిలయాన్ని, విజ్ఞానచంద్రికామండలి ప్రచురణ సంస్థనీ స్థాపించారాయన.

ఇలాంటి అనేక నేపథ్యాలలోంచి, మొట్టమొదటిసారిగా 1914 జూన్ నెలలో ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమం ప్రథమ మహాసభ బెజవాడలో జరిగింది. ఈ ఉద్యమాన్ని తెలుగునాట ఊరూరా వ్యాపింపచేయాలని నిర్ణయించారు.

సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యంకివెంకటరమణయ్య, గోపరాజు బ్రహ్మానందం ఇంకా అనేకమంది కార్యవర్గంతో గ్రంథాలయోద్యమం ప్రారంభమయింది.

పునరుజ్జీవితమైన సాహితీ చైతన్యాన్ని ఈ ఉద్యమం ముఖ్యంగా గ్రామీణ ప్రజలలోబాగా రగిలించ గల్గింది. అయ్యదేవర కాళేశ్వరరావు, బొడ్డపాటి వెంకటప్పయ్య, దంటు సుబ్బావధాని ఈ ఉద్యమానికి ఊపిరిపోసిన బెజవాడ ప్రముఖులు.

రాజకీయచైతన్యం, దేశాభిమానం, దేశసేవాభిలాష పాఠకుల్లో పెంపొందించడం వీరిలక్ష్యం. మంగిపూడి వెంకటశర్మ, ఉమ్రాలీషాకవి, బసవరాజు అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు ఈ ఉద్యమస్ఫూర్తితోనే పనిచేసిన తొలితరం ఆధునిక కవులలో ముఖ్యులు. అందరూ ముప్పయ్యేళ్ళల్లోపు వారే! అయినా అప్పటికే ప్రసిద్ధులు.

ఆడవారిలో పుస్తక పఠనాభిలాష పెంచడం కోసం పుస్తకాల్ని ఇళ్ళకు పంపే ఏర్పాట్లుచేయడం, పంచముల పిల్లలకోసం గ్రంథాలయాలలో రాత్రి పాఠశాలలు నడపడం ప్రధానకార్యక్రమాలుగా వుండేవి.

1914 నాటికి, సాహితీ సంస్థలు అంటే, గ్రంధాలయ సంస్థలేనని అర్థం. ఈ గ్రంథాలయోద్యమ యజ్ఞానికి ఆజ్యం పోసినమొదటి గ్రంథాలయ సంస్థ బెజవాడ రామమోహన్ గ్రంథాలయమే.

బెజవాడలోని జాతీయవాదులైన కార్యకర్తలు 1911లో చేసిన చిన్న ప్రయత్నం ఈ రామ్మోహనగ్రంథాలయం అవతరణ ! గవర్నర్ పేటలో ఈనాటి అరండల్ కాంప్లెక్స్ స్థానంలో వున్న అరండల్ సత్రంలో ఒక గదిలో ఈ గ్రంథాలయాన్ని ప్రారంభించి, 1913లో రిజిష్టర్ చేయించారు.

బందరులాకుల దగ్గర 2,197 చదరపు అడుగుల స్థలాన్ని మున్సిపాలిటీ వారు వేలానికి పెడితే, 3,324 రూపాయిలకు ఈ గ్రంథాలయం పేరుతో పాడడం జరిగింది. అయితే అంతసొమ్ము కార్యవర్గంలో ఎవరిదగ్గరా లేకపోవడంతో, బొడ్డపాటి వెంకటప్పయ్యగారి దగ్గర కొంత, గుంట వెంకటపిచ్చయ్య అనే వ్యాపారిదగ్గర కొంత ప్రామిసరీ నోట్లురాసి అప్పుతెచ్చి స్థలం దక్కించుకున్నారు.

ముందు అప్పుతీరాలి. తర్వాత భవననిర్మాణం జరగాలి. ఈలోగా మున్సిపల్ ఎన్నికలొచ్చాయి. అయ్యదేవర కాళేశ్వరరావు వార్డు కౌన్సిలర్‌గా పోటీచేస్తూ గెలిచే స్థితిలో ఉండికూడా, తన ప్రత్యర్థిదగ్గరకు వెళ్ళి, రామమోహన గ్రంథాలయానికి రూ.500/- విరాళం ఇస్తే తాను పోటీనించి తప్పుకొంటానని చెప్పి విరమించుకున్నారు. అలాగే, వెంట్రప్రగడ దివాను గారి స్వంత కేసులో కోర్టుబయట పరిష్కారం సాధించినందుకు ఆయనచేత 2,500/- రూపాయలు విరాళం ఈ గ్రంథాలయానికి ఇప్పించారట కాళేశ్వరరావు. తన జీవితచరిత్ర 'నవ్యాంధ్రం' లో ఈ వివరాలు రాశారు. అలా తీరింది స్థలం అప్పు.

1916లో మొదటి సారిగా, ఈ గ్రంథాలయంలో పంచములకోసం రాత్రి పాఠశాలని ప్రారంభించారు. అందరూ జాతీయవాదులేగాని, పంచములప్రవేశం విషయంలో కొందరు కమిటీ సభ్యులు అందుకు తమ తీవ్ర వ్యతిరేకతని తెలియజేశారు. కాళేశ్వరరావు, సూరి నరసింహశాస్త్రి అయ్యంకి వెంకట రమణయ్య, గోపరాజు బ్రహ్మానందం, వగైరాప్రముఖులు పంచముల్ని గ్రంథాలయం లోపలికి రానివ్వాలని పట్టుబట్టారు. వాళ్ళు వస్తే గ్రంథాలు మైలపడతాయని ఛాందసవాదులు వ్యతిరేకించి శంకరాచార్య గ్రంథాలయం పెట్టుకుంటామంటూ రాజీనామా చేసి వెళ్ళిపోయారు.

ఆవిధంగా రామ్మోహన గ్రంథాలయంలో సంస్కరణ వాదుల గెలుపు సాంస్కృతిక పునరుజ్జీవనానికి మరింతగా దోహదపడింది.

1944లో సింగరేణిలో అఖిలాంధ్ర గ్రంథాలయమహాసభ జరిగింది. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పాతూరి నాగభూషణం వంటి ప్రముఖులు అఖిలాంధ్ర గ్రంథాలయోద్యమానికి సారథ్యం వహించారు.

సాహితీ సంస్థలు సమాజానికి అందివ్వగల్గిన స్ఫూర్తి ఎలా వుండాలో బెజవాడ రామ్మోహనగ్రంథాలయ సంస్థ తన చేతులలో నిరూపించింది. గ్రంథాలయోద్యమానికి సారథ్యం వహించింది.

నేటి విజయవాడ నగరంలో నిద్రాణంగా వున్న సాహితీ చైతన్యాన్ని మరింతగా రగిలించేందుకు ఈ మహాసంస్థ చేయవలసింది, చేయగలిగిందీ ఎంతో వుంది. అందుకోసం బెజవాడ ఆత్రంగా ఎదురుచూస్తోంది. !!

# రాజకీయ చైతన్యాన్ని రగిలించిన బెజవాడ రాజద్రోహం కేసు

1885-1990 మధ్యకాలంలో జీవించిన మేధావుల ఆలోచనల్లో కొన్ని ముఖ్య విషయాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి.

1. 1885 లో బ్రిటిష్ రాణి ఇండియాపై పాలనాధికారాన్ని ఈస్టిండియా కంపెనీ నించి తప్పించి, తానే స్వయంగా పాలనా బాధ్యతలు స్వీకరించినప్పుడు చేసిన వాగ్దానాలేవీ అమలుకు నోచుకోలేదు. అమలు జరిగినవి కూడా కన్నీటి తుడుపులుగానే వున్నాయి.
2. బ్రిటిష్ రాణి బ్రిటన్‌ని ఒకరకంగానూ, ఇండియాని ఇంకొక రకంగానూ పాలించసాగింది.
3. దేశంలోని పేదరికం, అజ్ఞానం, మూఢనమ్మకాలు బ్రిటిష్‌పాలన కారణంగా పెరిగాయే గానీ తగ్గలేదు.

వీటిపట్ల నిరసనగా కొత్త తరం నాయకత్వం పుట్టుకొచ్చింది. నిజానికి అప్పటిదాకా సామాజిక నాయకత్వం ప్రభువులచేతుల్లోనూ ప్రభుత్వంలో ముఖ్య భూమిక వహించిన అధికారుల చేతుల్లోనూ వుండేది.

సుస్థిర పాలన అందించారని బ్రిటిష్‌పాలకులపట్ల విధేయులుగానూ, కృతజ్ఞతలు గానూ వున్న ప్రజల్లో క్రమేణా తాము దోపిడీకి బలౌతున్న గ్రహింపురావడం ప్రారంభం అయ్యింది.

ఈ గ్రహింపు మొదటగా మధ్యతరగతి మేధావులైన యువకుల్లో మొదలయ్యింది. ఒక ఉద్యమ స్ఫూర్తితో ఈ మధ్యతరగతి యువకులు జనచైతన్యం కోసం పాటుపడటం మొదలుపెట్టారు. అందువలన పెత్తందార్ల చేతుల్లోంచి పెత్తనం మధ్యతరగతి యువకుల చేతుల్లోకి మళ్ళింది. సామాజిక నాయకులుగా మధ్యతరగతి మేధావులు దూసుకురాసాగారు.

చరిత్రగమనంలో ఈ పరిణామాన్ని విశ్లేషకులు తేలికగా అంచనా వేశారు. ఈ మధ్యతరగతి మేధావుల్లో ఎక్కువమంది ఒకే కులానికి చెందిన వారు కావడాన, కొంతమంది దీనికి కులం రంగుకూడా పులిమారు.

నిజానికి ఈ కులంరంగు పులమడం మొదలుపెట్టింది ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వమే! ఒక ఉదాహరణచెబుతాను. 1907లో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చిన సందర్భంగా ఆయన సభలో పాల్గొన్న నేరానికి గాడిచర్ల హరిసర్వోత్తమరావుతో సహా 130మంది టీచర్ ట్రెయినింగ్ పొందుతున్న విద్యార్థుల్ని పరీక్షలు రాయనీకుండా ప్రిన్సిపాల్ సస్పెండ్ చేసిన సంగతి మనం

ఇంతకు మునుపు చర్చించాం. ఈ సంఘటనపై ఒక సి.ఐ.డి. ఆఫీసర్ ఇచ్చిన రిపోర్టులో ఇలావుంది..."ఈ 130 మంది విద్యార్థుల్లో ఎక్కువమంది బ్రాహ్మణ కుటుంబాలకు చెందిన వాళ్ళే వున్నారు. కంచుమర్తి రామచంద్రరావు ఒక్కడే శూద్రుడు. ఇలాంటి వాళ్ళమీద కఠినచర్య తీసుకున్నందుకు బ్రాహ్మణేతరులు, మహమ్మదీయులు చాలా సంతోషంగా వున్నారు. వారు ప్రభుత్వాన్ని ప్రశంసిస్తున్నారు!" అని!



అప్పటి రాజమండ్రి సబ్‌కలెక్టర్‌గా వున్న ఆంగ్లేయుడు, "ఈ జాతీయ వాదం అనేది కేవలం బ్రాహ్మణుల కుట్ర- Brahmin Conspiracy" అని ప్రభుత్వానికి నివేదించాడు. స్థూలంగా ఇదీ ఆనాటి పరిస్థితి (ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్: మా॥ వెంకటరంగయ్య - 31, 32)

దీనికంతటికీ పూర్వరూపం 1906 డిసెంబర్‌లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభ! ఏమైనా సరే, ఈ సమావేశంలో "స్వరాజ్యం" కావాలని తీర్మానం చేయించేందుకు లాలా లజపతిరాయ్, బాలగంగాధర్‌తిలక్, బిపిన్ చంద్రపాల్, అరవింద ఘోష్ వంటి ఒక వర్గం గట్టి ప్రయత్నాలు చేస్తోంది. వీళ్ళు తమని జాతీయ వాదులుగా ప్రకటించుకున్నారు. వీళ్ళని అతివాదులుగా ముద్రవేసి మరోవర్గం తమని మోడరేట్స్‌గా ప్రకటించుకొంది.

సురేంద్రనాథ్ బెనర్జీ, ఫిరోజ్‌షా మెహతా, దాదాభాయ్ నౌరోజీ, గోపాల కృష్ణగోఖలే, మదన మోహన మాలవ్యా, న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు...వీరంతా

ఆనాటి మోడరేట్లు. స్వరాజ్య తీర్మానం చేస్తే, బ్రిటిష్ వాళ్ళు రెచ్చిపోయి కఠినచర్యలు తీసుకుంటారనీ, బ్రిటిష్ వారిని మంచిగా బుజ్జగించి ప్రజారాజ్య హక్కుల్ని సంపాదించడం మంచిదనీ వీరి వాదన.

నేషనల్ కాంగ్రెస్‌లో 1906 కలకత్తా రాజకీయ తీర్మానం - దానిపైన జరిగిన చర్చలు దేశచరిత్రలో ఒక మలుపు. ఇంచుమించుగా అతివాదులు మితవాదుల వర్గాలుగా కాంగ్రెస్ రెండుగా చీలిపోయే పరిస్థితి మొదటిసారిగా ఏర్పడింది ఆనాడు!

ఏమైతేనేం స్వరాజ్యతీర్మానం ఆమోదం పొందింది. వందేమాతరం గీతాన్ని జాతీయ గీతంగా ప్రకటించి గానం చేశారు. ఈ ఉద్యమానికి "వందేమాతరం ఉద్యమం" అని పేరుపెట్టారు. అంతా సవ్యంగానే జరిగింది.

కానీ, కలకత్తా కాంగ్రెస్‌లో తీర్మానించిన "స్వరాజ్యం" అంటే ఏమిటి? అతివాదులైన జాతీయవాదులు చెప్పిన అర్థం ఇది:- బ్రిటిష్ వారితో సంబంధం లేకుండా స్వతంత్రదేశంగా భారతదేశం వుండాలని! మోడరేట్లు చెప్పిన అర్థం ఇంకొకటి : 'డొమినియన్ స్టేటస్' అంటే, బ్రిటిష్ చక్రవర్తి ఆధీనానికి లోబడి మనల్ని మనం పరిపాలించుకోవడం...అని!

ఈ రెండు రకాల భాషల్లో, సంపూర్ణ స్వరాజ్యం కోరినవారు బ్రిటిష్ వారికి శత్రువులు గానూ, డొమినియన్ స్టేటస్ కోరినవారు బ్రిటిష్ వారికి కొంతమేరకు మిత్రులుగానూ మారారు.

ఈ నేపథ్యంలో 1907 ఫిబ్రవరిలో బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రప్రదేశ్ పర్యటనకు వచ్చాడు. ఆయన మొదట విశాఖపట్నం, విజయనగరం, కాకినాడల్లో ప్రసంగించి రాజమండ్రి వచ్చాడు. రాజమండ్రిలో ఇంతకుమునుపు మనం చెప్పుకున్న గాడిచర్ల హరి సర్వోత్తమ రావుని శిక్షించిన సంఘటన జరిగింది. అక్కడ్నించి బెజవాడ వచ్చాడు. బెజవాడలో మాడపాటి వెంకటేశ్వరరావు పురమందిరం (తారా పేట గూడ్స్‌షెడ్ ఎదురుగానున్న మాడపాటి క్లబ్) లో రెండుసార్లు ప్రసంగించాడు. ఆయనతో కలిసి గాడిచర్ల బెజవాడకువచ్చి ఇక్కడే స్థిరపడిపోయారు.

కృష్ణా తీరంలో రాజకీయచైతన్యానికి బిపిన్ చంద్రపాల్ రాక ఒక గొప్ప ఊపునిచ్చింది. స్వరాజ్, బాయ్‌కాట్, నేషనల్ ఎడ్యుకేషన్... ఇవి మూడూ తారకమంత్రాలుగా ప్రచారం చేశాడు పాల్. ఆ తర్వాత బందరులో కూడా ఉపన్యసించాడాయన. ఈ ప్రేరణతోనే బందరులోనూ, రాజమండ్రిలోనూ, జాతీయకళాశాలలు ఏర్పడ్డాయి. దాదాపుగా ఒక సంవత్సరంకాలం బిపిన్ చంద్రపాల్ ఆంధ్రులతో సన్నిహితసంబంధాలు ఏర్పరచుకుని జాతీయవాదం వైపు, స్వరాజ్యం వైపు, ఇంగ్లీషు వస్తువుల బహిష్కరణవైపు తెలుగువాళ్ళని నడిపించాడు. అత్యధిక సంఖ్యలో తెలుగు యువకులు సంపూర్ణ స్వరాజ్యాన్ని కోరుకునే జాతీయవాదంవైపే నడిచారు.

1908లో తెనాలిలో కృష్ణా, గుంటూరు కాన్ఫరెన్స్ జరిగినప్పుడు మోడరేటర్‌గా ముద్రపడిన దేశభక్తి కొండవెంకటప్పయ్య సభాధ్యక్షత వహించారు. 'స్వరాజ్యం' విషయంలో వాడిగా చర్చలు జరిగాయి. సభలో మూడు వంతుల మంది రహస్యపోలీసులున్నారు. అయినా

భయపడకుండా జాతీయవాదులు బ్రిటిష్ దోపిడీ పాలనని ఎండగట్టి సంపూర్ణ స్వరాజ్యం కావాలని ప్రసంగించారు. ఓటింగ్ జరిగితే 174 మంది అనుకూలంగానూ, 19మంది వ్యతిరేకంగానూ ఓటుచేశారు. మెజారిటీ తెలుగు వాళ్ళు ఇలా జాతీయవాదులుగా మారడంతో బ్రిటిష్ పాలకుల ఈ ప్రాంతంమీద ప్రత్యేక దృష్టినిసారించవలసివచ్చింది. దాని పర్యవసానంగా ఎన్నో సంఘటనలు జరిగాయి. ముందుగా అరెస్ట్ చేసింది. బిపిన్ చంద్రపాల్‌ని.

కాశీనాథుని వీరమల్లయ్యగారికి ఆ రోజుల్లో బెజవాడలో ఒక ప్రింటింగ్ ప్రెస్ వుండేది. ఈయనతోనూ, పింగళి లక్ష్మీనారాయణ, బోడినారాయణరావులతోనూ కలిసి గాడిచర్ల హరిసర్వోత్తమరావు "స్వరాజ్య" అనే పత్రికని పునరుద్ధరించి నడపడం ప్రారంభించారు. గాడిచర్ల ప్రొప్రయిటర్‌గానూ బోడినారాయణరావు ఎడిటర్ పబ్లిషర్‌గానూ, వీరమల్లయ్య ప్రింటర్‌గానూ దాదాపు పదహారు సంచికలు వెలువరించారు. మార్చి 12, 1908 న జాతీయవాది బిపిన్ చంద్రపాల్‌ని విడుదల చేసిన సందర్భాన్ని పురస్కరించుకుని మొదటి సంచికని తెచ్చారు.

ఆషు అనే తిరునెల్వేలి డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్‌ని కాల్చిచంపిన సంఘటన దరిమిలా చిదంబర పిళ్ళే అనే జాతీయ వాదికి కఠినకారాగార శిక్ష విధించడం, అక్కడ గుమికూడిన జనం మీద ఒక యూరోపియన్ అధికారి విచక్షణారహితంగా కాల్పులు జరపడం, ఇద్దరు అమాయకులైన పౌరులు మరణించడం... ఈ వార్తా కథనం అంతా మార్చి 26 సంచికలో ప్రచురించారు. దాంతోపాటు, "అరే అరే ఫిరంగి క్రూర వ్యాఘ్రమా...ఇద్దరు భారతీయులను పొట్టన పెట్టుకొంటివిరా... అంటూ ఒక వ్యాసం వ్రాశారు గాడిచర్ల.

అయ్యదేవర కాళేశ్వరరావు ఈ వ్యాసంలో భాషని కొంతదిద్ది ప్రచురణకిచ్చారట. కానీ, సంపాదకుడు బోడినారాయణరావు ఆ దిద్దుబాట్లు లేకుండా యథాతథంగా అచ్చువేశారు. అయ్యదేవర కాళ్ళేశ్వరరావు తన జీవిత కథ "నవ్యాంధ్రంలో"లో ఈ వివరాలు రాశారు."ది ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్" గ్రంథంలో మామిడిపూడి వెంకట రంగయ్య గారుకూడా కాళేశ్వరరావుగారి జీవిత చరిత్రలోని అంశాల్నే 'కోట్'చేశారు.

నిజానికి బోడి నారాయణరావు జనాన్ని ఉత్తేజితం చేయగల గొప్పవక్త. ఆయన అంతకు మునుపు ఒక సభలో జట్కాబండి వాళ్ళని ఉద్దేశించి ప్రసంగిస్తూ డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్‌కు గానీ, ఆయన కోర్టు ఉద్యోగులకు గానీ బండికట్టవద్దని పిలుపు నిచ్చారట. పి.డబ్ల్యూడి ఉద్యోగులు మంచినీటి పైపుల్ని పీక్కుపోయి నాలుగంగుళాల ట్యూబులు వేస్తున్నారు. కోర్టు కాబట్టి వాళ్ళ తలకాయలు పగలగొట్టమని కూడా పిలుపునిచ్చారట.

బోడినారాయణరావుని శిక్షించడానికి ఈ వ్యాసం బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక ఆసరాగా దొరికింది. అరెస్ట్ వారెంట్‌లు విడుదల అయ్యాయి. అది తెలిసి పింగళి లక్ష్మీనారాయణ పాండిచ్చేరికి తప్పించుకున్నారు. ప్రింటర్ వీరమల్లయ్య అప్రూవర్‌గా మారేందుకు అంగీకరించారు. గాడిచర్ల వారినీ బోడి నారాయణరావు గారినీ అరెస్ట్ చేశారు.

హరి సర్వోత్తమరావు పక్షాన బెజవాడలో చింతకింద సూర్యనారయణమూర్తి, బందరు సెషన్స్‌కోర్టులో జె.డి. శామ్యూలు, రామాచార్యులు వాదించారు. గవర్నమెంట్ పక్షాన మద్రాసునించి కళ్ళె నారాయణరావు అనే తెలుగువాడు ప్రత్యేకంగా వచ్చి వాదించాడు. మునగల రాజా గాడిచర్ల వారి వైపు సాక్ష్యం చెప్పారు.

కెర్షాన్స్ ఐ.సి.ఎస్. అనే డిస్ట్రిక్ట్ జడ్జి జాతీయవాదుల మీద సానుభూతి ప్రదర్శించి, బోడినారాయణరావుకి 9నెలలు, గాడిచర్లకు 6నెలలు సాధారణ జైలు శిక్షలు మాత్రమే విధించాడు.

ఇక్కడితో ఈ కథ ఆగలేదు. ప్రభుత్వం రివిజన్ పిటీషన్ పెట్టి, శిక్షని పెంచాలని కోరింది. దాంతో గాడిచర్ల హైకోర్టుకు అప్పీల్ చేశాడు. హైకోర్టులో ఇద్దరు న్యాయమూర్తులు విచారించి. కిందికోర్టు ఈ కేసుని చాలా తేలికగా తీసుకొందని భావించారు. బోడినారాయణరావు 9నెలల సాధారణ ఖైదీని కఠిన కారాగార శిక్షగానూ గాడిచర్ల 6నెలల ఖైదుని 3 సంవత్సరాలు కఠిన కారాగార శిక్షగానూ పెంచుతూ తీర్పుచెప్పారు.

ఆ రోజుల్లో కఠినకారాగార శిక్ష ఎలా వుండేదో కాళేశ్వరరావుగారు రాశారు. తలకు మురికిటోపి, కాళ్ళకు ఇనుప కడియాలు , తగిలించడం, మట్టిలాగూలు తొడగడం, గొంగట్లో పడుకోవడం, మట్టిచిప్పలో పప్పు పులుసు అన్నం ముద్ద తినడం జైలుపనులు చేయడం... ఇదీ కఠినకారాగార శిక్ష అనుభవిస్తున్న రాజకీయ ఖైదీ పరిస్థితి.

బందరు కోర్టులో సాధారణ ఖైదు తీర్పుచెప్పిన డిస్ట్రిక్ట్ మెజిస్ట్రేట్ కెర్షాన్స్ ఐ.సి.ఎస్. పార్శీవాడు. ఆయన్ని జిల్లా జడ్జి పదవినించి సబ్‌కలెక్టర్ పదవికి తగ్గించి నరసారావుపేటకు బదిలీచేశారు. దీంతో సానుభూతి పరుణ్ణికూడా శిక్షించినట్లయ్యింది.

బెజవాడ, బందరు తదితర ప్రాంతాల్లో వందేమాతరం ఉద్యమం పర్యవసానంగా జరిగిన ఈ "బెజవాడ రాజద్రోహం" కేసు దేశ వ్యాప్తంగా సంచలనాన్ని కల్గించింది. "ది హిందూ"పత్రిక ఘాటుగా ప్రతిస్పందించింది.కూడా! విద్యావంతులైన మధ్యతరగతి యువకులు మొదట బ్రహ్మసమాజం పట్ల ఆకర్షితులై రామమోహనరాయ్ ప్రభావంతో బైటకు వచ్చారు. బిపిన్‌చంద్రపాల్ "వేదాంతం-స్వాతంత్ర్యం" అనే అంశం మీద బెజవాడలో ప్రసంగించాడు. సంస్కరణల ఉద్యమంలో ముందుకొచ్చిన యువకుల్ని బెజవాడలోను, బందరులోనూ ఆయన స్వరాజ్య ఉద్యమం వైపు నడిపించాడు. దాని ప్రభావాన అనేక సంఘటనలు జరిగాయి. బెజవాడ, ఘంటశాల ఇంకా అనేకచోట్ల రామ్మోహన గ్రంథాలయాలు ఏర్పడటం ఒక ఎత్తయితే బెజవాడ రాజద్రోహం కేసులు వంటివి జరగడం ఇంకొక ఎత్తయ్యింది. క్రమేణా జాతీయవాదుల కేంద్రస్థానంగా బెజవాడ మారసాగింది. 1909 నాటికి ఇదీ సంగతి..

# సానుభూతే తప్ప
# సమానత్వం కోరని సంస్కరణలు

క్రీ.శ. 1880 నాటికి, ఆంధ్రరాయలసీమ ప్రాంతాలన్నీ బ్రిటిష్‌వారి హస్తగతం అయ్యాయి. ఈస్టిండియా కంపెనీకి ఎదురులేని పరిస్థితి అది. రాచరిక పాలనలోంచి వలసపాలనలోకి మళ్ళింది సమాజం. థామస్ మన్రో విధానాల కారణంగా, భూమిమీద హక్కు సంపాదించుకున్న భూస్వాములు గ్రామీణ ప్రాంతాలమీద పెత్తందార్లుగా మారారు. జమీందార్లు, రాజులు నామమాత్రం పాలకులై ఆర్థికంగా చితికిపోయారు. ఎస్టేట్లను చేజార్చుకుని అంతరించిపోయారు. కొత్తగా ధనవంతులైన (New Elite) ధనిక భూస్వామ్య వర్గాలు తమ తమ కులాలకు సోషల్‌స్టేటస్ కోసం ఆరాటపడ్డాయి. ఇందుకు ప్రధాన ప్రతిబంధకం అయ్యింది బ్రాహ్మణ వ్యవస్థ.


థామస్ మన్రో

భారతదేశంలో అత్యున్నత సామాజికవర్గం బ్రాహ్మణులే! వేదవేదాంగాలపై ఆధిపత్యం, వేద విధులపై అధికారం ఈ కులానికే పరిమితమైంది. ఆ అధికారం తమకూ కావాలని వివిధ సామాజిక వర్గాలు బ్రాహ్మణులపై చేసిన తిరుగుబాట్లే సామాజిక సంస్కరణలు రూపుదిద్దుకోవడానికి ముఖ్య భూమిక వహించాయి.

1. నియోగి బ్రాహ్మణశాఖవారు యజ్ఞయాగాది క్రతువులపైన తమకూ అధికారం వుందని తిరుగుబాటు చేశారు. వైదికులకూ, నియోగులకూ మధ్య ఈ వివాదం పెద్ద అగాధాన్ని సృష్టించింది. తిరుపతి వెంకటకవులు, కొప్పరపుకవులు ఈ కక్షలకు ఆజ్యం పోసి అగ్ని రగిలించారు.
2. వైదిక కర్మలమీద తమకూ అధికారం కావాలని వైశ్యులు కూడా తిరుగుబాటు చేశారు. ఆత్కూరి లక్ష్మీనరసింహం అనే బెజవాడ వైశ్య ప్రముఖుడు యజ్ఞంచేసి 'సోమయాజి' అయ్యాడు.
3. విశ్వబ్రాహ్మణులు బ్రాహ్మణులతో సమానహక్కులకోసం సుదీర్ఘపోరాటాలు చేశారు.
4. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో కొందరు కమ్మవారు, రెడ్డికులస్థులు తమకూ వేదాధ్యయన అధికారం వుందని ఉపనయాలు జరిపించుకుని వేదాలు చదువుకోవడం మొదలుపెట్టారు. విశ్వబ్రాహ్మణులు, వైష్ణవులు, నియోగులు వీరికి బాగా ఈ విషయంలో సహకరించారు.

ఇవన్నీ సంస్కరణల పేరుతో చెలరేగిన కులాల కుమ్ములాటలుగా అప్పట్లో ఎవరూ భావించక పోవడమే ఇక్కడి ముఖ్య విషయం!

వేదావేదాంగాలు అందరికోసమేగాని, ఒక్కబ్రాహ్మణులకోసమేననడాన్ని అందరూ వ్యతిరేకించారు. అలా వ్యతిరేకించిన కులాలతో ఘర్షణపడి ఛాందసవాద వర్గాలు బ్రాహ్మణ వ్యతిరేకత పెరిగేందుకు బాధ్యులయ్యారు.

20వ శతాబ్దపు తొలిరోజులనాటి జాతీయయోద్యమ కాలంలో ఈ బ్రాహ్మణద్వేషం అనేక రాజకీయ పరిణామాలకు దారితీసింది. ద్రవిడ రాజకీయ ఉద్యమాలు తమిళనాడులో ఆరోజుల్లో రూపొందడానికి ఇదే ముఖ్యకారణం.

19వ శతాబ్దిలో మచిలీపట్నం కేంద్రంగా రఘుపతి వేంకటరత్నంనాయుడు నడిపిన బ్రహ్మసమాజ ఉద్యమానికీ, 20వ శతాబ్దపు త్రిపురనేని రామస్వామిచౌదరి నడిపిన బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమానికి మౌలికమైన తేడా ఇక్కడేవుంది.

రామ్మోహనరాయ్ నుంచి రామస్వామి చౌదరి దాకా సంస్కర్తలంతా ఛాందసవాదుల మీద ముప్పేట దాడులుచేసి, సతీసహగమన నిషేధం, బాల్యవివాహాల నిషేధం, దేవదాసీల నిషేధం, వంటి చట్టాలు ఏర్పడటానికి కారకులయ్యారు. ఆ విధంగా వారు పాత్రః స్మరణీయులే! హిందూయిజాన్ని వీళ్ళు తెగనాడే వాళ్ళు కాబట్టి, అప్పటి బ్రిటిష్ ప్రభుత్వమూ, అనేక క్రైస్తవ మిషనరీలూ వీరిని బాగా ప్రోత్సాహిస్తూఉండేవికూడా! ఈ కారణంగా, బ్రహ్మ సమాజికులు మిషనరీల ఏజెంట్లు అనే ముద్రని భరించవలసి వచ్చింది!

అయితే, 1828 సతీసహగమన నిషేధ చట్టంనుంచి, 1929 శారదా (హిందూ వివాహ) చట్టందాకా ఈ నూరేళ్ళ సంస్కరణల యుగంలో ఏ ఒక్క సంస్కర్తా ప్రభుత్వం దగ్గర తమ పలుకుబడిని వినియోగించి అస్పృశ్యతను నిషేదించే చట్టాన్ని తీసుకు రావడానికి ప్రయత్నించినట్లు కన్పించదు. అలాగని సంస్కర్తలకు దళిత ప్రజలమీద సానుభూతి లేదని వ్యాఖ్యానించడం కూడా తొందర పాటే! కానీ, వంచితులైన దళితులకు ఉన్నత వర్గాలతో సమాన ప్రతిపత్తిని కల్పించే కార్యక్రమాలకన్నా. అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని అణచివేయడానికి ఎక్కువ ప్రాధాన్యత నివ్వడం వలన ఈ దీనజన సముద్ధరణ వెనకబడిపోయింది.

1892లోనూ, 1897లోనూ వివేకానందుడు మద్రాసు వచ్చినపుడు ఈ బ్రహ్మ సమాజికుల కుహనా సంస్కరణల విధానాల్ని అనేక వేదికల మీద గట్టిగా ఖండించాడు. "వీళ్ళు స్వల్ప విషయాలని మాత్రమే సంస్కరించాలని చూస్తున్నారు. నేనుమూలాల్ని, శాఖల్ని కూడా సంస్కరించాలంటున్నాను. వారితో నా విభేదం విధానపరమైంది. వారిది విధ్వంసవాదం. నాది నిర్మాణ మార్గం" అన్నాడు వివేకానందుడు. "మానవులంతా సమానంగావుండే నవభారత నిర్మాణమే నిజమైన సంస్కరణ" అని ప్రకటించాడాయన.

1904లో కందుకూరి వీరేశలింగంతో వ్యక్తిగత విభేదాల కారణంగా విడిపోయి న్యాపతి సుబ్బారావు అన్నీబీసెంట్‌తో చేతులు కలిపి, మద్రాస్ హిందూ అసోసియేషన్‌లో చేరాడు. సనాతన సాంప్రదాయాల్ని వర్ణాశ్రమ ధర్మాల్ని కాపాడేందుకు ఈ సంస్థ పని చేసింది. వ్యక్తిగత రాగద్వేషాలతో నమ్మిన సిద్ధాంతాల్ని ఇలా పణంగా పెట్టారు కొందరు మేధావులు.

1907లో బిపిన్‌చంద్రపాల్ వందేమాతరం ఉద్యమం పేరుతో జాతీయతా స్ఫూర్తిని రగిలిస్తూ ఆంధ్రాలో పర్యటించినప్పుడు, వీరేశలింగం గారితో వున్న సంస్కరణవాదులంతా మూకుమ్మడిగా జాతీయోద్యమంలో చేరిపోయారు. ఆ విధంగా వీరేశలింగం వంటరి వాడయ్యాడు. సంస్కరణోద్యమం మందగించింది. జాతీయోద్యమంముందు అది పస లేనిదిగా మిగిలిపోయింది.

నిజానికి, దళితులకోసం స్కూళ్ళునడపడం, హాస్టళ్ళు నెలకొల్పడంవంటి చర్యల్ని మొదటగా చేపట్టింది బ్రహ్మసమాజికులే! ఉన్నవలక్ష్మీ నారాయణ, అయ్యదేవర కాళేశ్వర రావు, కాశీనాథుని నాగేశ్వరరావు ప్రభృతులు ఈ కారణంగా "కులవెలి" ని ఎదుర్కొన్నారు కూడా! జాతీయోద్యమం ఉధృతం అయ్యేకొద్దీ సంస్కరణలు కూడా ఆ ఉద్యమంలో భాగంగా కలిసిపోయాయి. 1921 బెజవాడలో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం ఎజెండాలో అస్పృశ్యతానివారణ, హరిజన దేవాలయ ప్రవేశం అంశాల్ని చేర్పించి, వాటిని కాంగ్రెస్ కార్యక్రమాలుగా చేయడంలో కాళేశ్వరరావు ప్రభృతులు చేసిన కృషి గొప్పది. ఇది దీనజనోద్ధరణ కోసం 20వ శతాబ్దిలో సాగిన ముఖ్య ఉద్యమం. దళితులపట్ల సానుభూతి చూపించడంద్వారా తమగొప్పని ప్రదర్శించుకునే వారే ఈ ఉద్యమకాలంలో ఎక్కువ మంది కన్పిస్తారు. గాంధీయుగం తర్వాత ఇదే సానుభూతి వాదాన్ని హేతువాదులూ, అభ్యుదయవాదులూ కొనసాగించారుగానీ, దళితులకు సమానంగా దక్కవలసిన సోషల్ స్టేటస్ గురించి ఊసెత్తలేదెవ్వరు.

20వ శతాబ్దపు జాతీయోద్యమ కాలంలోనే విచ్చలవిడిగా కులసంఘాలు ఏర్పడ్డాయి. మతంకన్నా కులమే గొప్పదయ్యింది. ఎవరి కులం కోసం వాళ్ళు పని చేసుకోవడం కులతత్త్వం ఎంతమాత్రమూ కాదనే భావన గాంధీ రోజుల్లోనే మొదలయ్యింది. 21వ శతాబ్దికి అది వారసత్వంగా సంక్రమించింది. ఇప్పుడు సంస్కరణల ఊసెక్కడా కన్పించదు విన్పించదు. ఎందుకంటే, కోరలు కోల్పోయి ఛాందసవాదులు కనుమరుగైనా, భూస్వామ్య ధనికవర్గాల ఆధిపత్యం యధేచ్ఛగా కొనసాగుతోంది కాబట్టి! అగ్రవర్ణాలవారి అధికారానికి ఇప్పట్లో ముప్పేమీలేదు కాబట్టి!

# ఏనాడో భారత్‌పై
# అమెరికా కన్ను

కొన్ని వందల సంవత్సరాలుగా ప్రపంచంలో ముఖ్యమైన జాతులు అనదగినవి ఎన్నో ఇండియా మీదకి ఎగబడి ఎవరికి అందింది వాడు దండుకొంటుంటే, అంత పెద్దదేశం-అమెరికా వాడికి ఈ ఆలోచన ఎందుకు కలగలేదనేది ముఖ్యమైన ప్రశ్న! పరిశీలకులు ఈ సమాధానాలు చెప్తారు.

1) అమెరికాకి అన్ని వనరులూ వున్నాయి. ఉత్పత్తి ప్రధానదేశం అది.

2) ఉత్పత్తులకు కావలసిన ముడిసరుకుల కోసం కూడా దానికి ఇండియా లాంటి దేశం మీద ఆధారపడవలసిన పని లేదు.

3) ఉత్పత్తుల అమ్మకానికి, అతిపెద్ద యూరోపియన్ మార్కెట్ వుండగా, ఇండియా లాంటి బడుగుదేశపు ఎంగిలిమెతుకుల మీద బతకాల్సిన అవసరం దానికి లేదు.

4) నాణ్యమైన ఉత్పత్తులకు కావలసిన వాతావరణ అనుకూలతతో పాటు ప్రజాస్వామ్యయుతమైన, స్వేచ్ఛాపూరితమైన సామాజిక వ్యవస్థ వారికి వుంది. అయినా నిజమైన వ్యాపారి ఎప్పుడూ చిన్నపాటి అవకాశాన్ని కూడా వదులుకోవడానికి ఇష్టపడడు. ఇండియాని మాత్రం అమెరికా ఎందుకు వదులుకోవాలి...??

6-9-1834న అప్పటి మచిలీపట్నం కలెక్టర్, ప్రభుత్వానికి పంపిన ఒక రిపోర్ట్‌లో కొన్ని ముఖ్య విషయాలు ప్రస్తావించాడు.

★ ప్రత్తి, పొగాకుల్ని అమెరికా వారి నాణ్యతకు మించి ఇండియాలో ఉత్పత్తి చేయించలేకపోతున్నాం.

★ ఇక్కడ దిగుబడి బావుంది గానీ, అంతర్జాతీయ మార్కెట్‌లో దీని నాణ్యత చాలడం లేదు.

★ అందుకని అమెరికన్ పత్తి, పొగాకు విత్తనాల్ని తెప్పించి, నిడదవోలు కాజ పరగణాలలో ప్రయోగాత్మకంగా నాటించి చూశాం. ఇండియాలో ఈ విత్తనాలు అమెరికాని మించి నాణ్యతనిస్తాయని ఆశించాం.

★ కానీ పండే పంట కూడా పండకుండా పోయింది.

"ఈ తెలుగు రైతులు వట్టి దద్దమ్మలనీ, అమెరికా రైతు పండించగా లేనిది తెలుగు రైతు ఎందుకు పండించ లేకపోతున్నాడు-" అని చిరాకు పడ్డారు బ్రిటిష్ అధికార్లు.

ఇదంతా గమనిస్తున్నాడు అమెరికన్ వ్యాపారి.

1848లో అమెరికన్ సెక్రటరీ ఆఫ్ స్టేట్, డేనియల్ వెబ్‌స్టర్ పూనుకొని, 1881 జనవరి 18న బొంబాయిలోనూ, 1852 మే నెలలో కలకత్తాలోనూ రెండు అమెరికన్

కాన్సులేట్ కార్యాలయాన్ని తెరిపించి వ్యాపారాంశాలు పరిశీలించే బాధ్యతని ఈ కార్యాలయాలకు అప్పగించాడు. బొంబాయికి కాన్సుల్ జనరల్‌గా నియమితుడైన 'ఎడ్వర్డ్ ఎలీ' అనేక ముఖ్య విషయాలు అమెరికన్ ప్రభుత్వానికి రిపోర్ట్‌ల ద్వారా పంపాడు. ఇది 150 ఏళ్ళనాటి సంగతి-

1) బొంబాయి ఓడరేవులో అమెరికన్ ఉత్పత్తులకు గిరాకీలేదు.
2) బొంబాయిలో జీవించడం ఖరీదైన అంశం. సంవత్సరానికి 300 డాలర్లు పెడితే గానీ ఆఫీసుకు అద్దె ఇల్లు దొరకడం లేదు.
3) బోస్టన్ నుంచి నెపోలియన్ అనే ఓడలో బొంబాయి ఓడరేవులో దిగిన తర్వాత ఈస్టిండియా కంపెనీ, వీరికి ఏ విధంగానూ తోడ్పడలేదు. ఓడలోని ఉద్యోగులు 21-06-1854న తిరుగుబాటు (మ్యూటినీ) చేసినా, ఆఖరికి ఓడలో హత్య జరిగినా పట్టించుకోలేదు.
4) విదేశీయుల వారినెవరినీ ఇండియాలోకి అనుమతించడానికి కంపెనీ పాలకులు ఇష్టపడడం లేదు. ప్రభుత్వాల స్థాయిలో అవగాహన కుదిరినా అధికారులు సహకరించడం లేదు.

"ఎడ్వర్డ్ ఎలీ" ఇండియాలో అమెరికన్ కన్సులేట్ దుస్థితి గురించి తన గోడును వెళ్ళబోసుకున్నాడు. ఇతర దేశాల ఏజెంట్లకు ఆరువేలనుంచి పదివేల రూపాయలు జీతాలిస్తున్నారని, తమ అమెరికన్ ప్రభుత్వం తనను సరిగా చూడలేదనీ బాధపడి, ఉద్యోగానికి సెలవు పెట్టి అమెరికా వెళ్ళిపోయాడు. అక్కడ ఆరోగ్యం చెడి త్వరలోనే మరణించాడు. వెడుతూ, 'దోరీభాయి మేర్వాన్‌జీ' అనే భారతీయ పార్శీని వైస్-కాన్సుల్ జనరల్‌గా నియమించి వెళ్ళాడు. "ఎడ్వర్డ్ ఎలీ" అమెరికన్ ప్రభుత్వానికి చెప్పిన సంగతుల్లో ఆశ్చర్యకరమైంది.

బొంబాయి ఓడరేవులో అత్యున్నత ప్రమాణాలు కల్గిన ఓడలు వందలకొద్దీ తయారవుతున్నాయిట! మలబార్ టేకుతో నిర్మించిన రెండువందల అరవై ఒక్క ఇండియన్ ఓడల్ని క్రీ.శ.1852లో ఆస్ట్రేలియా వాళ్ళు ఆర్డరు పెడితే 255 ఓడల్ని మాత్రమే తయారుచేసి ఇవ్వగలిగారట. ఆ సంవత్సరకాలంలో మొత్తం 383 ఓడలు బొంబాయి ఓడరేవులో తయారయ్యాయని ఎడ్వర్డ్‌ఎలీ రిపోర్టు చేశాడు.

ఒక ప్రశ్నకు సమాధానం రాస్తూ, అమెరికన్ ఓడల్ని తెచ్చి బొంబాయి ఓడరేవులో అమ్మడానికి మన ఓడలకు ఇక్కడ ఏమాత్రం గిరాకీ లేదని చెప్పాడు. ఇండియన్ వెస్సల్స్ పెద్దవిగా వుంటాయి. విశాలంగా వుంటాయి. ఎక్కువ సరుకు పడుతుంది. పైగా వేగంగా ప్రయాణిస్తాయి అని, అవి అమెరికన్ ఓడలకన్నా ఎలా మెరుగైనవో 'ఎలీ' వివరించాడు.

అమెరికా తన పత్తినీ, పొగాకునీ, ఇక్కడ కొంతమేర అమ్ముకొని బదులుగా గోనె సంచులు, గోనెపట్టాలు, ఆముదం, దున్నపోతుచర్మాలు, పంచదార- వాటిని కొనుక్కొని తీసుకుపోయేవాళ్ళు.

ఏమైనా ఈస్టిండియా కంపెనీ చాలా తెలివిగా అమెరికన్లని ఇండియాకు దూరంగా వుంచగల్గింది. 19వ శతాబ్దినాటికి, అమెరికాకు ఇండియా మీద ఏ ఆశలూ లేని స్థితి ఏర్పడింది.

కానీ, అమెరికా ఒక స్వేచ్ఛా వాణిజ్య సామ్రాజ్యం అనే ప్రచారం మాత్రం బాగా జరిగింది. స్వేచ్ఛ కోసం ఆశగా అమెరికా చేరసాగారు చాలామంది భారతీయులు. మొదట్లో వారికి ఆదరణ బాగానే లభించింది కూడా! మితవాద పత్రికల్లోనూ, వేదికలమీద లాలాలజపతిరాయ్ వంటివారికి ప్రముఖ స్థానం ఇచ్చేవాళ్ళు.

1916లో మొదటి ప్రపంచ యుద్ధం మొదలైంది. ఈ యుద్ధంలో తటస్థంగా వుంటామనే హామీ మీద ఉడ్రోవిల్సన్ అమెరికా అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. కానీ, ఆరు నెలల కాలంలోనే "తటస్థం" అనేది లాభసాటి కాదని ఉడ్రో విల్సన్ ఆ విధానానికి స్వస్తి చెప్పాడు. ఈ వాతావరణంలో అమెరికా, బ్రిటన్, రష్యా, ఫ్రాన్స్‌లు దగ్గరయ్యాయి.

భారత స్వాతంత్ర్య పోరాటం జరుపుతున్న నాయకులు చెప్తోన్న బ్రిటిష్ వ్యతిరేక అంశాల్ని అమెరికన్ పత్రికలు జర్మనీ అనుకూల విషయాలుగా వక్రీకరించడం ప్రారంభించాయి. జాతీయవాదుల్ని జర్మనీ ఏజెంట్లుగా అమెరికన్లు భావించసాగారు. ఉడ్రోవిల్సన్ నిర్దాక్షిణ్యంగా జాతీయవాదుల్ని ఏరివేశాడు. లాలాలజపతిరాయ్, ఎం.ఎన్.రాయ్ లాంటివాళ్ళని అమెరికా నుంచి బహిష్కరించాడు.

ఒకప్పుడు బ్రిటిష్ వలస పాలనకు వ్యతిరేకంగా పోరాడి స్వాతంత్ర్యం పొందిన అమెరికా ఇలా భారత వ్యతిరేక చర్యలు తీసుకోవడం అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. థియొడోర్ రూజ్‌వెల్ట్, ఉడ్రోవిల్సన్ వంటి అమెరికన్ అధ్యక్షులు ఆ రోజుల్లో ఏ కొద్దిగా తోడ్పడినా స్వాతంత్ర్యం రాక వేరుగా వుండేది. రెండో ప్రపంచ యుద్ధం మొదలయ్యేవరకూ ఇంచుమించుగా అమెరికా ఇదే ధోరణిలోనే వుంది.

రెండో ప్రపంచయుద్ధ కాలంలో ప్రెసిడెంట్ ఫ్రాంక్లిన్ డి రూజ్‌వెల్ట్ గాంధీని, జాతీయ వాదాన్ని సమర్థిస్తూ, చర్చిల్‌తో నేరుగా భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చే విషయం మాట్లాడాడు. గత అనుభవాల రీత్యా, ఇండియాలో బ్రిటిష్‌వారు అధికారం వున్నంత కాలం ఒక బలమైన ఆసియా దేశం మీద తనకు ఆధిపత్యం దక్కదని రూజ్‌వెల్ట్‌కు తెలుసు. 1933 అట్టావా అగ్రిమెంట్ వలన ఇండియా ఆఫ్రికా వంటి వలస దేశాలు వెనకబడి పోయాయని, బ్రిటిష్ వస్తూత్పత్తులు మాత్రమే ఇండియాలో అమ్మాలనడం అన్యాయం అని రూజ్‌వెల్ట్ చర్చిల్‌తో అన్నాడు. రెండో ప్రపంచ యుద్ధం ముంచుకువచ్చాక

స్టాలిన్, చర్చిల్, రూజ్‌వెల్ట్ త్రయం నిర్వహించిన పాత్ర మనకు తెలిసిన కథే. పెరల్ హార్బర్ సంఘటన తర్వాత అమెరికా పూర్తిస్థాయిలో యుద్ధానికి దిగి జపాన్‌ని దెబ్బతీయడానికి తమ శక్తినంతా కూడదీసుకోవడం తప్పనిసరి అయింది. జపాన్ బర్మాని జయించి ఇండియా మీద తుపాకులు ఎక్కుపెట్టి నుంచుంది.

ఈ దశలో ఇండియాతో మంచిగా వ్యవహరించి, ఇండియన్ లీడర్లు జపాన్ వెనక వెళ్ళకుండా "నిలపడం" అవసరం. ముఖ్యంగా అమెరికాకి! అప్పటికే సుభాస్‌చంద్రబోస్ జపాన్‌కు స్వాగతం పలికి, బహిరంగంగానే సహకరించడం మొదలుపెట్టాడు. అమెరికన్ సెక్రటరీ ఆఫ్ స్టేట్, "కార్డెల్ హుల్" జాతీయవాదుల్ని, ముఖ్యంగా గాంధీ, నెహ్రూల్ని బ్రిటన్, అమెరికాలకు అనుకూలంగా వుండేలా సమ్మతింపజేయడానికి కృషి చేయసాగాడు. యుద్ధం ముగియగానే స్వాతంత్ర్యం ఇప్పిస్తామని వాగ్దానం చేశాడు. ఈ పరిణామాల ద్వారా, అమెరికా చిరకాల వాంఛలు అనేకం తీరబోతున్నాయి.

1) పైకి కేవలం బ్రిటన్‌కు సాయపడుతున్నట్లు కన్పిస్తున్నా, ఇండియా వ్యవహారాల్లో తలదూర్చేందుకు అమెరికాకు అవకాశాలు కల్పివచ్చాయి. అమెరికా చెప్పినట్లు బ్రిటన్ నడుచుకునేలా మారిపోయింది రంగం.

2) బ్రిటన్ వ్యాపార ప్రయోజనాలతో సమానంగా అమెరికా వ్యాపార ప్రయోజనాలు కూడా ఇండియాలో నెరవేరే అవకాశం ఏర్పడింది.

3) స్వాతంత్ర్యం తర్వాత ఇండియాకు బ్రిటన్ శత్రు దేశంగానూ అమెరికా అత్యంత ప్రాధాన్యత కల్గిన మిత్రదేశంగానూ మారబోతోంది.

ఆనాటి రూజ్‌వెల్ట్ మాటల్లో ఈ ఆలోచనలు స్పష్టంగా కన్పిస్తాయి.

"నియంతృత్వం బానిసత్వాలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్నాం గానీ, వలస పాలనకు వ్యతిరేకంగా మిత్రదేశాల కూటమి ఏమీ మాట్లాడడం లేదు–" అన్నాడు రూజ్‌వెల్ట్. చర్చిల్‌కు అది తగలరానిచోట తగిలింది, రూజ్‌వెల్ట్ ఊహించినట్లే గ్రేట్‌బ్రిటన్ బ్రిటన్‌గా మారి కోరలు పీకిన పాములా మిగిలిపోయింది. అమెరికా, బ్రిటన్, రష్యాలను అధిగమించి ఏకైక అగ్రరాజ్యంగా అందనంత ఎత్తుకు ఎదిగిపోయింది. ఇప్పుడు ఇండియాని కబళించడానికి, ఒకనాడు ఇంగ్లండు వేసిన ఎత్తుగడల్నే వేస్తోంది. దాని ప్రభావానికి లోనైన దేశభక్తులు తమని సంస్కరణవాదులుగా చెప్పుకొంటున్నారు. విదేశీ శక్తులకు పేను పెత్తనం ఇస్తే ఏం జరుగుతుందో గుర్తు చేయడమే ఈ పుస్తకం ఆశిస్తోన్న ప్రయోజనం.

# "జెంటూ" అంటే తెలుగుభాషే!

12-3-1640 ఈనాటి మద్రాసు ఓడరేవు అప్పట్లో డీలర్ల స్థావరంగా ఉండేది. ఆ రోజున సముద్రంలో ఎన్నడూ కనీవినీ ఎరుగనంత ఉద్ధృతమైన తుఫాను చెలరేగింది. సముద్రంలో తమ ఓడను లంగరు వేసుకొని కొందరు ఈస్టిండియా కంపెనీ అధికారులు ఒడ్డు మీదకు పడవల్లో వచ్చారు. అక్కడ స్థానికంగా వున్న నల్లవాళ్ళైన "జెంటూ"లను కూలీలుగా మాట్లాడుకుని ఓడలోని సామాన్లను ఒడ్డున సురక్షితంగా ఉండే చోటుకు తరలించుకు రావడానికి సాయంగా తీసుకెళ్ళారు. అందరూ ఓడ మీదకు చేరిన సమయానికి తుఫాను ఉధృతం అయ్యింది. బలమైన గాలులకు ఓడ అదుపు తప్పి మూడు రోజులు పాటు సముద్రంలో దిక్కు లేకుండా తిరిగింది. ఓడలో వున్న 'జెంటూ' నల్ల జాతి కూలీలు, ఇంగ్లీషు వాళ్ళూ ప్రాణాలు అరిచేతిలో పెట్టుకొని ఓడలోనే గడిపారు. చివరికి ఓడ చెంగల్పట్టు జిల్లా మధురాంతకం తాలూకాలో అలంపరై అనే సముద్ర తీర గ్రామానికి చేరుకొంది.

తుఫాను వెలిశాక, ఒడ్డుకు వెళ్ళి తినడానికి ఆహారం దొరుకుతుందేమో చూడవలసిందిగా జెంటూల్ని కోరారు. వాళ్ళు అందుకు నిరాకరించారు. ఇది మలబార్ల ఊరు మమ్మల్ని చూస్తే వాళ్ళు చంపేస్తారు"- అన్నారు. ఈ కథని బట్టి మలబార్లు, జెంటూలు, వేర్వేరని తెలుస్తోంది. వీళ్ళిద్దరూ ఒకరి స్థావరాల్లోకి ఇంకొకరు రాకుండా కట్టడి ఉండేది కాబోలు. మద్రాసు నగరంలో బ్రిటిష్ వాళ్ళు కాళ్ళూనడానికి ముందు జరిగిన సంఘటన ఇది. ఈ కథ గురించి చెన్నపట్నం తెలుగువారిదే అనే వ్యాసంలో వివరంగా రాశాను. చూడండి.

1645లో చంద్రగిరిని పాలిస్తున్న ఒక జెంటూ రాజు చెన్నపట్నంలో కొంతభాగాన్ని "ఫోర్ట్ సెయింట్ జార్జి"ని కట్టుకోవడానికి, మద్రాసు నగరాన్ని నిర్మించుకోవడానికి అనుమతించినట్లు రాబర్ట్ ఓర్మి 1782లో రాసిన "హిస్టారికల్ ఫ్రాగ్మెంట్స్ ఆఫ్ మొగల్ ఎంపైర్" గ్రంథంలో పేర్కొన్నాడు.

ఈ రెండు సంఘటనల్లోనూ కన్పించిన జెంటూలు తెలుగువారేననడానికి ఎటువంటి సందేహం లేదు. తెలుగు వాళ్ళని 'జెంటూ' అనడం ఏమిటి?

1780 మే 20న బెంగాల్ గెజెట్‌లో ఏప్రియల్ 28న మద్రాస్‌లో జరిగిన ఒక సంఘటనని పేర్కొన్నారు. సోమవారం నాడు గురవప్ప అనే "జెంటూ"కు ఉరిశిక్ష అమలు పరిచారు. వెంకటమ్మ అనే ఎనిమిదేళ్ళ పిల్లను హత్య చేసిన నేరానికి ఆరుగురు యూరోపియన్ న్యాయమూర్తులు ఆరుగురు జెంటూ న్యాయమూర్తులూ కలిసి ఇచ్చిన తీర్పు ఆ రోజున అమలు అయ్యింది.

1783 డిసెంబర్‌లో "ది యూరోపియన్ మేగజైన్ "ఆనాటి మద్రాసు ఓడరేవు-" ఫోర్ట్ సెయింట్ జార్జి" గురించి వర్ణించింది. "ఈ ప్రాంతం రెండు నగరాలుగా వుంది. ఒకటి

బ్లాక్‌టౌన్. ఇక్కడ జెంటూలైన నల్లజాతి ప్రజలు మహమ్మదీయులు, పోర్చుగీసులు, ఆర్మేనియా క్రైస్తవ మతాన్ని స్వీకరించిన క్రిస్టియన్లు నివసిస్తున్నారు" ఈ వివరాల్ని బట్టి చెన్నపట్నం, మద్రాసు రెండు వేర్వేరు నగరాలనీ, చెన్నపట్నంలో కొంతభాగాన్ని చంద్రగిరినేల్తున్న తెలుగురాజు (జెంటూకింగ్) ఇంగ్లీషు వాళ్ళకి ఇచ్చాడనీ, ఆ రెండో భాగం జెంటూ జాతీయులు నివసించే మద్రాస్ అయి ఉంటుందనీ అర్థం అవుతోంది. మద్రాస్‌లో పూరి గుడిసెల్లో నివసించిన జెంటూ నల్లజాతి ప్రజలు తెలుగువారేననేది సుస్పష్టం.

కైఫీయత్తులు సేకరించిన కెప్టెన్ కోలిన్ మెకెంజి "పగోడా ఆఫ్ మల్లెకార్జీ" గురించి 1794లో రాసిన ఒక వ్యాసంలో ప్రస్తావించాడు. ఈ మల్లెకార్జీ గుడి ఇనవాద (గుంటూరు జిల్లా)కు 65 మైళ్ళ దూరంలోనూ, కనౌల్ (కర్నూలు)కు ఆగ్నేయంగా 63 మైళ్ళ దూరంలోనూ, హైదరాబాదుకు దక్షిణంగా 103 మైళ్ళ దూరంలోనూ వుందని పేర్కొన్నాడు. ఇది ఖచ్చితంగా శ్రీశైల మల్లికార్జున గుడి గురించిన వర్ణనేనంటూ, ఇక్కడ జెంటూ లేక తెలింగ భాషలో రెండు శాసనాలున్నాయని రాశాడు. గ్రామ చరిత్రలు సేకరించిన మెకెంజీకి ఆనాటి తెలుగు ప్రాంతాల గురించి స్పష్టమైన అవగాహన వుంది. ఆయన జెంటూ పదాన్ని తెలుగు భాషకు పర్యాయపదంగా ప్రయోగించాడు.

1801లో కడప, కర్నూలు, అనంతపురం, వగైరా దత్తమండలం ప్రాంతాలకు కన్వీనర్‌గా వచ్చిన థామస్‌మన్రో తాను ప్రవేశపెట్టిన గ్రామ పాలనా వ్యవస్థకు సంబంధించిన రెగ్యులేషన్స్‌ని జెంటూభాషలో ప్రకటిస్తే అతిసామాన్యుడు కూడా అర్థం చేసుకోగలుగుతాడని పేర్కొన్నాడు. 1800 నాటి ఇంగ్లీషు వారు తదితర యూరోపియన్లు తెలుగుని భాషాపరంగానూ, జాతిపరంగా కూడా జెంటూ అనే పిలిచారనేది వాస్తవం.

1816లో కేంప్‌బెల్ తెలుగు వ్యాకరణం ప్రచురించాడు. స్థానిక భాషలు నేర్చుకుని, ఆ భాషని భారతదేశంలో బ్రిటీష్ వారి ప్రాబల్యం ఉన్న ప్రాంతాల్లోని క్రైస్తవమిషనరీలకు బోధించడం కోసం ఈ కేంప్‌బెల్ వంటి ఇంగ్లీషు మేధావులు తెలుగు, తమిళం, కన్నడం భాషలకు వ్యాకరణాలు తయారుచేశారు.

కేంప్‌బెల్ తన తెలుగు వ్యాకరణానికి A Grammer for the Teloogoo Language, Commonly termed the gentoo, Pecuiliar to Hindoos of the north eastern Provinces of the Indian Peninsula. అని పేరు పెట్టాడు. యూరోపియన్లు తెలుగుభాషని జెంటూ అనడం 'Improper' అని ఈ గ్రంథంలో పేర్కొన్నాడు. సంస్కృత పండితులు ఆంధ్రం అంటారని, త్రిలింగ, తెలింగ, తెలుగు, తెనుగ పేర్లతో వ్యవహరించబడ్తోందనీ స్పష్టీకరించాడు.

విలియం బ్రౌన్ (WB) తెలుగు ఇంగ్లీషు డిక్షనరీ 1818లో వెలువడింది. "జెంటూ & ఇంగ్లీషు" నిఘంటువు ఇది. సమకాలీన జెంటూ ప్రజలు వాడుతున్న జెంటూ మాటల్ని ఇందులో ఉదాహరణగా చూపించినట్లు విలియం బ్రౌన్ పేర్కొన్నాడు. ఆ తర్వాత కొన్నేళ్ళకు యూరోపియన్ తెలుగు పండితుడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ జెంటూ పదాన్ని తెలుగు భాషకు ఆపాదించిన యూరోపియన్ల

విధానాన్ని నిర్ద్వంద్వంగా ఖండించి తెలుగులో ఏ పదమూ జెంటూ ఉత్పత్తికి సంబంధించింది లేదన్నాడు. "మునుపు హిందూ అనకుండా తప్పుగా జెంటూ అని అంటూ వచ్చినారు" అని వివరించాడు. హిందూస్తాన్ దేశపు అనాదికాపు (An aboriginal inhabitant of Hindustan) ఒక తెలుగు వాడు, ఆంధ్రము, తెలుగు, తెలుగుభాష అనే అర్థాలిచ్చాడు జెంటూ పదానికి.

ఈ వివరాల్ని బట్టి స్పష్టంగా తెలుస్తున్నదేమంటే యూరోపియన్లు ఎక్కడికక్కడ స్థానికంగా వున్న హిందువుల్ని జెంటూ పేరుతో పిలిచేవాళ్ళు అని!

చాంబర్స్ 20వ సెంచరీ డిక్షనరీ 'జెంటూ' పదానికి 'హిందువు' అని స్పష్టమైన అర్థాన్నిచ్చింది. "Jen-too" గా ఈ "Gentoo" పదాన్ని పలకాలని సూచించింది. పోర్చుగీసు పదం 'జెన్టియో'లోంచి ఈ పదం ఏర్పడిందని 'జెంటైల్' అనే మాటకి నేషన్, జాతి (Tribe) అర్థం అనీ రాసింది.

పోర్చుగీసులు మొట్టమొదటగా భారతదేశానికి ఒక చేత్తో బైబిల్ని, ఒకచేత్తో కత్తినీ పుచ్చుకొని, వ్యాపారాల పేరు చెప్పుకొంటూ భారతదేశంలో క్రైస్తవ మతాన్ని స్థాపించడం కోసమే వచ్చారు. ఇక్కడ అధికారాన్ని చేజిక్కించుకొంటే భారతీయుల్ని, క్రైస్తవులుగా మార్చడం 'తేలిక' అనే భావనతో వ్యవహరించారు. అందుకని క్రైస్తవుడు కాని వేరొక జాతీయుడు అనే అర్థంలో హిందువుల్ని మాత్రమే జెంటూలుగా వ్యవహరించారు మొదట పోర్చుగీసులు. జెంటిఫ్, జెంటూ, జెంట్యూ, జెంటైల్, జెన్టియో ఇలా రకరకాల ఉచ్చారణలతో తర్వాత వచ్చిన ఇతర యూరోపియన్ జాతుల వాళ్ళు కూడా ఇదే పోర్చుగీసు "జెంటూ" పదాన్ని హిందువులకు వర్తింపజేస్తూ పిలిచారు.

1502లో "ఫెర్నోలో లోపెజ్ డి కష్టాన్ హెడా" అనే పోర్చుగీసు రచయిత పశ్చిమ సముద్రతీర ప్రాంతానికి వచ్చినప్పుడు జెంటూ భాష గురించి మొదటిసారిగా ప్రస్తావించాడు. అతనికి అప్పట్లో పశ్చిమ సముద్రతీర ప్రాంతంలో తారసపడింది! కన్నడ భాషా ప్రజలే భారతదేశంలో ప్రజలు కన్నడ భాష మాత్రమే మాట్లాడతారని అతను భ్రమపడి, జెంటూ పదాన్ని హిందువులు అనే అర్థంలో కన్నడిగుల గురించి మొదట ప్రయోగించాడు.

1514లో కృష్ణదేవరాయలుతో పోర్చుగీసు పాలకుడు ఆల్బుకేరక్ సంబంధాలు నెలకొల్పుకున్నాక పోర్చుగీసులకు తెలుగుభాష గురించి మొదటిసారిగా తెలిసింది. మరాఠా కోరమండల్ మలబార్ ప్రాంతాల్లో అనేకమంది రాజుల్ని చూసిన మీదట కృష్ణదేవరాయలు ఆస్థానంలో తెలుగు అధికారులు చాలా పెద్దమనుషులుగా వ్యవహరించడం వాళ్ళకి కనిపించింది.

అందుకని "పెద్ద మనుషులు" అనే అర్థంలో తెలుగువారిని "Gentile" Gentoo అని వ్యవహరించడం ప్రారంభించారు మొట్టమొదటగా పోర్చుగీసులు!

1. జెంటూలు నల్లగా వుంటారు.
2. పెద్దమనుషులుగా వర్తిస్తారు. మోసగాళ్ళు కాదు.

3. ఎంతటిపనినైనా సాధించుకొస్తారు.

4. మహమ్మదీయులు, మూర్లు మాదిరిగా కాకుండా తేలికగా కలిసిపోతారు. భేషజాలకు పోరు.

సూరత్ నుంచి శివాజీ దాడుల్ని తప్పించుకోవడానికి ఇంగ్లీషు వాళ్ళు అప్పటికి మురికి కూపంగా ఉన్న బొంబాయి ఓడరేవుని రెట్టింపు ఖర్చు పెట్టి అభివృద్ధి చేశారు. ఈ ఓడరేవులో జెంటూలు సామాన్లు మోయడానికి పోటీపడి పోట్లాడుకునేవాళ్ళని ఎడ్వర్ట్ కార్లెన్ 1697లో తన అనుభవాన్ని రాశాడు. జెంటూ వ్యాపారులతో సూరత్, బొంబాయి ఓడరేవులు ఎప్పుడూ నిండి ఉండేవిట.

మచిలీపట్నంలో నాలుగు రకాల జెంటూలు వాళ్ళకి కన్పించారట.

1. Branchmins (పుస్తకాలు గ్రంథాలకు సంబంధించిన బ్రాహ్మణులు)
2. Raspoots (రక్షకభటులు)
3. Merchant (వాణిజ్యవేత్తలు)
4. Mechanicks (కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, శిల్పకారులు, స్వర్ణకారులు తదితరులు)

వీళ్ళందర్నీ జెంటూలు గానే వ్యవహరించారు పోర్చుగీసులు. అరవవారినీ, బెంగాలీల్ని కూడా ఇలానే జెంటూలుగా వ్యవహరించిన సందర్భాలు కూడా కొన్ని రికార్డుల్లో వున్నాయి.

వారెన్ హేస్టింగ్స్ కాలంలో "కాశ్మీరు శాలువాలు కప్పుకొని బియ్యంతో వండిన అన్నం తింటూ పావురంలాగా ఏమాత్రం అపకారం చెయ్యకుండా మంచినీళ్ళు తప్ప మరేమీ తాగని కేవలం పండితులైన వ్యక్తులు- కావేరి, గోదావరి, నర్మద, బ్రహ్మపుత్ర నదీ తీరాలలో నివసించేవారే జెంటూలంటే-" అనే అభిప్రాయం బలంగా వుండేది.

కాశీలో కొంతమంది ఇలాంటి జెంటూ పండితుల్ని కూర్చోబెట్టి- నాథానియేల్ హోల్వెడ్ అనే యూరోపియన్ సంస్కృత పండితుడు 'జెంటూ కోడ్' పేరుతో ఒక గ్రంథాన్ని తయారు చేయించి ప్రచురించాడట! లార్డ్‌క్లైవ్‌కు "జెంటూ" అనే తెలుగువారికి సంబంధించిన ఆచార వ్యవహారాల మీద పూర్తి అవగాహన ఉండేదని 'చార్లెస్ కర్రార్కియోలి' అనే రచయిత క్లైవ్ పైన వెలువరించిన పుస్తకంలో రాశాడు. క్లైవ్‌ని అనుసరించి సహాయకులుగా తెలుగు ప్రాంతం నుంచి వెళ్ళిన కొందరు జెంటూ సైనికులు కలకత్తాని క్లైవ్ కైవసం చేసుకుంటున్న సమయంలో ప్రాణాలకు తెగించి పనిచేశారు.

క్లైవ్‌కు జెంటూ తెలుగు వాళ్ళంటే ప్రత్యేకమైన అభిమానం ఉండటానికి ఇది కారణం కావచ్చు. జెంటూ పదం తెలుగు వారికి రూఢ్యర్థంగా మిగలడానికి కూడా ఇది కారణం కావచ్చు.

ఈ వివరాలన్నీ 'జెంటిల్‌మాన్' అనే అర్థంలో తెలుగువారు 'జెంటూలు'గా వాసికెక్కారనే మనకు తెలియజెప్తున్నాయి. ఇంగ్లీషు వాళ్ళు జంతువులని తెలుగువారిని పిలిచారనే వాదన అపోహ మాత్రమే!

'జెంటూ' అంటే సహృదయులైన తెలుగు వారు సహృదయంతో మాట్లాడే స్వచ్ఛమైన తెలుగు భాష అనే అర్థం స్థిరపడింది. సి.పి.బ్రౌన్ వరకూ (1840) ఈ అర్థం కొనసాగింది కూడా!!

# జలియన్ వాలాబాగ్ నరమేధం-వాస్తవాలు



"నో వకీల్
నో దలీల్ (ఆర్గ్యుమెంట్)
నో అప్పీల్"

1919 సంవత్సరంలో భారతదేశ వ్యాప్తంగా నిరసన పెల్లుబికేలా చేయగలిగిన వ్యాఖ్య ఇది!... ఈ మూడు మాటల వ్యాఖ్య చేసిన వాడు గాంధీ. చేసింది రౌలత్ చట్టం మీద.

దేశంలో తీవ్రవాద కార్యకలాపాలను అణచివేసేందుకు నియమించిన జస్టిస్ రౌలత్ కమిషన్ 1918లో ఒక నివేదిక సమర్పించింది! ఈ నివేదిక ప్రకారం 1918 క్రిమినల్‌లా ఎమెండ్‌మెంట్ బిల్లుని ప్రవేశపెట్టారు. 1919 మార్చి నెలలో రౌలత్ చట్టంగా అది అమల్లోకి వచ్చింది. ఒక వ్యక్తిని అరెస్టు చేయడానికి గానీ, డిటెన్షన్‌లో వుంచడానికి గాని బ్రిటిష్ ప్రభుత్వానికి అసాధారణ అధికారాలు ఇస్తోంది ఈ రౌలత్ చట్టం.

ఎలా పుట్టిందో తెలియదు గానీ, రౌలత్ చట్టం ద్వారా ప్రజల వ్యక్తిగత జీవితాల్లో ప్రభుత్వం జోక్యం చేసుకుంటుందనే పెద్ద పుకారు పుట్టి, దేశాన్ని గగ్గోలు పెట్టింది. పెళ్ళికి ముందు అబ్బాయి, అమ్మాయిలకు శీలపరీక్షలు జరుపుతారనీ, ఒక రైతుకు ఒక నాగలి రెండు ఎడ్లు మాత్రమే వుంటారనీ... ఇలాంటి భయాలు జనంలో బాగా వ్యాపించాయి. దానికి తోడు నిరుద్యోగం, అభద్రత, అధిక ధరలూ... ఇవన్నీ జనం అసహనాన్ని బాగా రెచ్చగొట్టాయి.



సౌతాఫ్రికా నుంచి తిరిగి వచ్చిన తర్వాత వార్తల్లో వ్యక్తిగా గాంధీ ప్రముఖంగా కన్పిస్తున్నప్పటికీ, దేశ నాయకత్వాన్ని చేపట్టడానికి ఒక మంచి అవకాశం కోసం ఎదురుచూస్తున్న సమయం అది.

ఆయన ఇదే అదనుగా ప్రభుత్వానికి సహాయ నిరాకరణ ప్రకటించవలసిందిగా దేశ ప్రజల్ని కోరాడు గాంధీ. తన ఉద్యమానికి సత్యాగ్రహం అని పేరు పెట్టాడు. మేథావులు ఎక్కువై ఏకనాయకత్వంలేక అప్పటి జాతీయ కాంగ్రెస్ అనేక వర్గాలుగా కొట్టు మిట్టాడుతున్న దుస్థితిలో నడుస్తోంది. బ్రిటిష్ అనుకూల మితవాదులు తమని మోడరేట్లు, లిబరల్స్ అని వ్యవహరించుకోసాగారు. మోతీలాల్ నెహ్రూ, సురేంద్రనాథ్ బెనర్జీ, ఫిరోజ్‌షా మెహతా, దాదాభాయ్ నౌరోజీ, తెలుగు వాళ్ళు న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు.... వీరంతా ఆనాటి ప్రముఖ మోడరేట్లు.

లాలా లజపతిరాయ్, బాలగంగాధర తిలక్, బిపిన్‌చంద్రపాల్, అరవిందఘోష్, జవహర్‌లాల్ నెహ్రూ... వీరంతా అతివాద వర్గం. వీరు తమని నేషనలిస్టులుగా చెప్పుకున్నారు. 1906లో మొదలైన ఈ విభేదాలు పుష్కరకాలం గడిచేసరికి ముదిరి, ఒకరి సభలకు మరొకరు వెళ్ళని స్థితి వచ్చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం మితవాదుల్ని తమ అక్కున చేర్చుకొని కార్యం సుకరం చేసుకోసాగింది. లార్డులు, సర్‌లు, నైట్ హుడ్‌లు, రావు బహద్దూర్‌లు మితవాదులకు తాయిలాలుగా వేయడానికి ఉపయోగపడ్డాయి. రాజద్రోహం కేసులు, జైలు శిక్షలు, ప్రవాసాలూ అతివాదులకు తప్పనిసరి అయ్యాయి.

రోజురోజుకీ కాంగ్రెస్ రాజకీయాలు మొద్దుబారి, బంకసాగుడు తప్ప పసలేని స్థితి ఏర్పడిన స్థితిలో "సత్యాగ్రహం" అనే గాంధీ పిలుపు మొదటిసారి విన్పించగానే తాను పులకించి పోయానని చెప్పుకొన్నాడు నెహ్రూ తన ఆత్మకథలో. రౌలత్ చట్టం దేశానికి గాంధీని వరంగా



ప్రసాదించింది. గాంధీ తనకు అందివచ్చిన అవకాశాన్ని సద్వినియోగ పరుచుకొన్నాడు. పరిస్థితిని గమనిస్తోంది ప్రభుత్వం.

గాంధీ సత్యాగ్రహం ప్రారంభించగానే దేశంలో చాలా చోట్ల అలజడులు మొదలయ్యాయి. ఏప్రియల్ 6న దేశవ్యాప్త హర్తాళ్‌కు పిలుపు నిచ్చాడు. "హర్-తాళ్" అంటే అన్నిచోట్లా తాళాలు వెయ్యడం అని! ఊహించని రీతిలో ఈ కార్యక్రమం విజయవంతంగా జరిగింది. రోజురోజుకీ ఈ అలజడులు పెరిగి ఒక ఉద్యమ రూపం తీసుకోసాగాయి.

ప్రభుత్వం పునరాలోచనలో పడింది. చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టాలని నిర్ణయించుకొంది. గోళ్ళతో గిల్లితే సరిపోదని, గొడ్డలి పుచ్చుకోవాల్సిందేనని భావించింది. ప్రభుత్వం దృష్టి సారించగా నరహంతకుడిగా నిలవగలిగిన జనరల్ రెయినాల్డ్ డయ్యర్‌కు కబురు చెయ్యడం జరిగింది. అక్కడి నుంచి కథ మరో మలుపు తిరిగింది.

ఏప్రిల్ 9న గాంధీ పంజాబ్, ఢిల్లీ సందర్శించవలసి వుంది. ఆయన్ని ఆ ఉదయాన్నే అకారణంగా అరెస్ట్ చేశారు. గాంధీ అరెస్ట్ వార్త తెలియగానే అహ్మదాబాద్‌లో అలజడి ప్రారంభం అయ్యింది. అలజడి జరగడం కోసమే అరెస్ట్ చేశారు. ఏప్రిల్ 10న అమృత్‌సర్‌లో డా॥ కిచ్‌లీ, డా॥ సత్యపాల్ అనే ఇద్దర్నీ అరెస్ట్ చేశారు. అంటే, పంజాబ్‌లో నరమేధం జరపాలని నిర్ణయించుకున్నారన్నమాట! కానీ, ఈ అరెస్ట్‌ల వలన చిన్నపాటి అల్లర్లు జరుగుతున్నాయి అంతే! పెద్ద చర్య తీసుకోవడానికి ఈ కారణాలు సరిపోవడం లేదు.

జనరల్ డయ్యర్ వ్యూహం మార్చాడు. ఆయన వ్యూహం ప్రకారం- అమృతసర్ యూరోపియన్ కంటోన్మెంట్‌లోకి గుర్తు తెలియని దుండగులు కొందరు దూసుకుపోయి, ఐదుగురు యూరోపియన్ అధికారుల్ని చంపేశారు. ఊళ్ళో రెండు బ్యాంకుల్ని లూటీ చేశారు. రైల్వేస్టేషన్లను తగలబెట్టారు. షేర్‌వుడ్ అనే మిషనరీ స్త్రీని నడివీధిలోకి లాక్కొచ్చి దారుణంగా కొట్టారు.

దేశంలో ఎక్కడా జరగనంత స్థాయిలో ఒక అమృత్‌సర్‌లో మాత్రమే హింసామార్గాన నడిచింది ఉద్యమం. పెద్దపెట్టున హింస జరిగినట్టు లెక్క! ఈ హింసకు కారకులెవరు...? ప్రేరకులెవరు?? అసలు కర్తలెవరు...??? ఈ ప్రశ్నలకు సమాధానం ఒక్క "డయ్యర్"కు మాత్రమే తెలుసు.

1919 ఏప్రియల్ 13న జనరల్ డయ్యర్ జలియన్ వాలాబాగ్‌లో నరమేధం సాగించాడు. 1920 ఏప్రియల్ 20వ తేదీన ది హిందూ దినపత్రిక ఈ సంఘటనకి

సృష్టికర్త. రూపకర్త జనరల్ డయ్యరేనని, టెర్రర్ సృష్టించడానికి డయ్యర్ చేసిన "కాన్స్పిరసీ"-(కుట్ర) ఇదనీ బహిరంగంగానే ఒక వార్తా కథనాన్ని ప్రచురించింది.

1) 1919 ఏప్రిల్ 13 వైశాఖ పండగ రోజు అమృత్‌సర్‌కు జనం తండోపతండాలుగా వస్తారు. కాబట్టి ఆ రోజున ఒక సభను జరిపిస్తే జనాన్ని పిట్టల్ని కాల్చినట్లు కాల్చి పారెయొచ్చు... అని వ్యూహం పన్నాడు డయ్యర్.



2) హంసరాజ్ అనే వాడి తోడ్పాటుతో ఏప్రిల్ 11వ తేదీన ఒక సభ జరిపించాడు. స్వర్ణ దేవాలయానికి రెండు వీధులకు అవతల జలియన్ వాలాబాగ్‌లో 13వ తేదీన మరో పెద్ద బహిరంగసభ జరుగుతోందని ఇందులో ప్రకటించాడు హంసరాజు. ఈ రెండు రోజులూ బాగా ప్రచారం చేశారు కూడా!

3) నిజానికి 11వ తేదీన మొదట సభ జరిపేనాటికే సభల మీద నిషేధాజ్ఞలు జారీ చేశాడు డయ్యర్. కానీ, ఈ నిషేధాజ్ఞలు అతి కొద్ది మందికి మాత్రమే తెలిసేలా అన్ని జాగ్రత్తలూ తీసుకొన్నాడు. ఎందుకంటే రేపు ఆ కొద్దిమందీ సాక్ష్యానికి వచ్చి అనుకూలంగా చెప్పాలి కాబట్టి. అంటే, సభల మీద నిషేధం విధించిన సంగతి హాజరయ్యే ప్రజలకు తెలియకుండా జాగ్రత్త పడ్డాడన్నమాట!

4) 13వ తేదీ జలియన్ వాలాబాగ్‌సభ జరుగుతోంది. వచ్చేందుకూ పోయేందుకూ ఒకటే ద్వారం వుంది. నిరుపయోగంగా పడివున్న ఆ ఇరుకు స్థలాన్ని ఎంచుకోవడంలోనే అసలు కుట్ర వుంది.

5) 150 మంది సైనిక పటాలంతో లోపలికి ప్రవేశించాడు డయ్యర్. రెండు ట్రక్కుల నిండా ఆయుధ సామాగ్రి వుంది. ద్వారానికి అడ్డంగా సైన్యాన్ని నిలబెట్టాడు. లోపలివాళ్ళు బైటకు పోవడానికి గానీ, బైటవాళ్ళు లోనికి వెళ్ళడానికి గానీ అవకాశం లేకుండా చేశాడు. జనం పారిపోవడానికి మరో దారి లేని సభాస్థలి అది!

6) మూడు నిమిషాలలోపు అందరూ ఖాళీ చేసి వెళ్ళిపోవాలని బిగ్గరగా అరిచాడు డయ్యర్. అంతపెద్ద బహిరంగ సభలో ఆ అరుపు ఆయన చుట్టూ వున్న కొద్దిమంది సైనికులకు మాత్రమే విన్పిస్తుంది. వాళ్ళే అందుకు సాక్ష్యులు. డయ్యర్ తమని వెళ్ళిపోవలసిందిగా ఆదేశించిన సంగతి ఆ సభలో వున్న ప్రజలకు గాని, వేదిక మీది ఉపన్యాసకులకు గానీ తెలియదు.

7) మూడో నిమిషం పూర్తి కాగానే ఫైర్ అని అరిచాడు. బుల్లెట్ల వాన కురిసింది. 10–15 నిమిషాలపాటు ఫైరింగ్ కొనసాగింది.

8) గూర్ఖా, బెలూచీ రెజిమెంట్లకు చెందిన నమ్మకమైన 90 మంది సైనికులు ఈ ఫైరింగ్‌లో పాల్గొన్నారు. 1,650 రౌండ్లు కాల్చారు. కనీసం వెయ్యి మందైనా చనిపోయి వుంటారని భావించి తృప్తిగా నిష్క్రమించాడు డయ్యర్.

9) ఆ మర్నాడు, ఏప్రిల్ 14న, మరింత రెచ్చిపోయాడు డయ్యర్. రోడ్డుమీద గుమిగూడిన జనం మీద విమానం మీంచి బాంబులు వేయించి మెషిన్‌గన్స్‌తో కాల్పులు జరిపించాడు.

10) ఈలోగా మిస్ షేర్‌వుడ్ మిషనరీస్త్రీ అనే మీద దుండగులు దాడిచేసారు. ఆ స్థలం దగ్గర వుండే జనాన్ని లాక్కొచ్చి పొట్టమీద పాకించే మిలిటరీ శిక్ష వేశాడు. ఈ "క్రాలింగ్ ఆర్డర్"ని ఏప్రియల్ 26 వరకూ 12 రోజులు పాటు అమలు చేశాడు.

11) డాక్టర్ మనోహర్‌లాల్ అనే పెద్దాయన్ని తెల్లవాడికి సెల్యూట్ చెయ్యలేదని వీధిలో సంకెళ్ళు వేసి నడిపించాడు. (ఆయన ఆ తర్వాత పంజాబ్ ఆర్థిక మంత్రి అయ్యాడు.)

12) ఇండియన్లకు కార్లు, మోటారు వాహనాలు దేనికంటూ సీజ్ చేసి, బ్రిటిష్ అధికారులకు దానం చేశాడు.

13) ఏప్రిల్ 15న మార్షల్‌లా విధించి, అమృత్‌సర్ సహా 5 జిల్లాల్ని తన గుప్పిటలో పెట్టుకొన్నాడు. ఈ చర్యల్ని ఖండిస్తూ దేశీయులు గగ్గోలు పెట్టసాగారు. అతివాదులు జైళ్ళు నింపడానికి సన్నద్ధమయ్యారు. కానీ, మితవాద కాంగ్రెస్‌లో రావలసినంత కదలిక రాలేదు. ఇదంతా అవగాహన ప్రకారమే జరిగింది కాబట్టి!!

ప్రభుత్వం మాత్రం నిస్సిగ్గుగా ఈ సంఘటనను సమర్థించింది. జనరల్ డయ్యర్ సరి అయిన చర్య తీసుకొన్నాడని లెఫ్టినెంట్ గవర్నర్ కితాబు ఇచ్చాడు. వైస్రాయి వ్యతిరేకంగా మాట్లాడలేదు. లండన్‌లో బ్రిటిష్ ప్రధాని లాయడ్ జార్జి, జనరల్ డయ్యర్ పెద్ద తప్పేమీ చెయ్యలేదన్నాడు.

ఎగువసభ (హౌస్ ఆఫ్ లార్డ్స్) మాత్రం డయ్యర్‌ని ఖండించింది గానీ, హౌస్ ఆఫ్ కామన్స్‌లో మెజారిటీ సభ్యులు డయ్యర్‌ని సమర్థించడంతో ప్రభుత్వం గట్టెక్కింది. "లేడీస్ ఆఫ్ ఇంగ్లాండ్" వాళ్ళు డయ్యర్‌ని సన్మానించి, బంగారపు ఖడ్గాన్ని బహూకరించి 25000 పౌండ్లు ఇచ్చారు. ఇది ఇలా వుండగా, రవీంద్రనాథ్ ఠాగూర్ తన నైట్‌హుడ్‌ని ప్రభుత్వానికి

తిరిగి ఇచ్చేశాడు. చర్చిల్ ఈ సంఘటనని ఖండిస్తూ, తీవ్రవాదం అనే జబ్బుకి, బ్రిటిష్ ఫార్మకోపియాలో జనాన్ని భయపెట్టడం అనే ఔషధాన్ని ఎక్కడా చెప్పలేదని వ్యాఖ్యానించాడు. ఠాగూర్, చర్చిల్‌ల వ్యాఖ్యలు ఇండియాలో బ్రిటిష్ అధికారుల మీద 'పెన్నీ' పాటి విలువ కూడా చెయ్యలేదు.



1919 అక్టోబర్‌లో లార్డ్ హంటర్‌తో ఒక రాయల్ కమిషన్‌ని నియమించారు. నలుగురు ఐ.పి.ఎస్.లూ, నలుగురు మితవాద ఇండియన్లు ఇందులో సభ్యులుగా వున్నారు. దాని ముందు డయ్యర్ చెప్పిన అంశాలు ఇవి.

1) బ్రిటన్‌ని వ్యతిరేకించే వాళ్ళయితే, నాకు ఫ్రాన్స్ అయినా ఒకటే, అమృతసర్ అయినా ఒకటే!
2) ఇండియన్లు బ్రిటన్‌ని శత్రువుగా భావిస్తే, ఇండియన్లని నేను శత్రువులుగా భావిస్తాను.
3) శత్రువు శత్రువే! ఎదురైతే నిర్దాక్షిణ్యంగా కాల్చేయడం నా వృత్తి ధర్మం.
4) యుద్ధరంగంలో శత్రువు చేతిలో ఆయుధం వుందా? లేదా? అని చూడం.
5) తిరుగుబాటుదార్లకి అమృతసర్ ఒక గుణపాఠం కావాలి. wide Impression, Moral effectలు కల్గించాలని ఈ నిర్ణయం తీసుకున్నాను.
6) మరోసారి సైనిక తిరుగుబాటు జరగకుండా నిరోధించగలిగాను.

ఇలా సాగింది హంటర్ కమిషన్ ముందు డయ్యర్ ప్రసంగ సరళి. తనకు మించిన బ్రిటిష్ దేశభక్తుడు మరొకడు లేడని సమర్థించుకున్నాడు. లండన్ ప్రభుత్వం అతన్ని నెత్తిన పెట్టుకొని "హీరో"ని చేసింది!

ఈ కాల్పుల్లో మృతి చెందిన వెయ్యి మందిలో కేవలం 480 మంది పేర్లను మాత్రమే గుర్తించగలిగారు. వారిలో 397 పేర్లను హంటర్ కమిటీ అంగీకరించింది. అంటే, మిగతా వాళ్ళు మరణించలేదని అర్థం కాబోలు. 291 మంది హిందువులు, 22 మంది సిక్కులు, మిగిలిన వారు ముస్లింలు, ఇతరులూ వున్నారు. 1200 మందికి పైగా జనం గాయపడి వుంటారని తేల్చారు. "మెజార్టీ రిపోర్ట్" ఇచ్చింది హంటర్ కమిషన్. ముగ్గురు మైనారిటీ రిపోర్ట్‌లు రాశారు. జనరల్ డయ్యర్‌ని ఇండియాలో ఉద్యోగంలోంచి డిస్మిస్ చేసి, లండన్‌లో రెడ్‌కార్పెట్ పరిచి స్వాగతం పలికారు. "బ్రిటిష్ యుగపు సింహం" అని కీర్తించారు.

నెహ్రూ తన ఆత్మకథలో రైలు ప్రయాణం అనుభవం ఒకటి రాసుకున్నాడు. అప్పర్ బెర్త్‌లో తను పడుకొని ప్రయాణిస్తున్నప్పుడు కింది బెర్త్‌లో వున్న జనరల్ డయ్యర్ తోటి సైనికాధికారితో అంటున్నాడట- అమృత్‌సర్‌ని చెప్పుకింద తొక్కిపెట్టి వుంచాను. తల్చుకుని వుంటే భస్మీపటలం చేసేవాణ్ణి. దయతలచి వదిలేశాను" అని! ఈ కథకి ఓ కొసమెరుపు వుంది. 'గాంధీ అండ్ అనార్కి' అనే వ్యాసంలో శంకరన్ నాయర్ ఆనాటి లెఫ్టినెంట్ గవర్నర్ మీద కొన్ని ఘాటైన వ్యాఖ్యలు చేశాడు. లెఫ్టినెంట్ గవర్నర్ పరువునష్టం దావా తెచ్చినప్పుడు శంకరన్ నాయర్‌కు 500 పౌండ్ల జరిమానా విధించారు. "జనరల్ డయ్యర్ మంచి పనిచేశాడు. సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆయన్ని ఉద్యోగం లోంచి డిస్మిస్ చేయడం అన్యాయం" అని వ్యాఖ్యానించాడట తీర్పులో జడ్జిగారు. 1940 మార్చి 18వ తేదీన లండన్ వెస్ట్ మినిష్టర్‌లో ఈస్టిండియా అసోసియేషన్ సమావేశానికి హాజరు కావడానికి వెడుతూ, ఒక భారతీయుడి చేతికి వంటరిగా చిక్కాడు డయ్యర్. ఒక్కక్షణం ఆలస్యం చెయ్యకుండా అక్కడికక్కడే డయ్యర్‌ని కాల్చి తన జాతి కక్ష తీర్చుకున్నాడా భారతీయుడు.

ఇదంతా మర్చిపోయిన గాయాన్ని గుర్తు చేసుకోవడమే కావచ్చు. కానీ, ఇక్కడ మరో కోణంలోంచి చూడవలసిన అంశాలు కొన్ని వున్నాయి.



1) గాంధీని దేశ రాజకీయ పీఠం మీద "తండ్రి" స్థానంలో కూర్చోబెట్టడానికి ఈ పరిణామాలు చక్కని అవకాశం కల్పించాయి.
2) తనకు అందివచ్చిన అవకాశాల్ని గాంధీ తక్షణం సద్వినియోగం చేసుకోగలిగాడు.
3) జలియన్ వాలాబాగ్ తర్వాత మోతీలాల్ నెహ్రూ వంటి కొద్దిమంది మితవాదుల ఆలోచనా ధోరణిలో కొంత మార్పు మొదలయ్యింది. 1919 డిసెంబర్‌లో అమృత్‌సర్ కాంగ్రెస్ సభలకు రావలసిందిగా, సభాధ్యక్షత వహిస్తున్న మోతీలాల్

నెహ్రూ మితవాద కాంగ్రెస్ నాయకుల్ని కోరాడు. గాయపడిన పంజాబ్ హృదయాన్ని స్వాంతన పరుద్దాం రమ్మన్నాడు. కానీ, మోడరేట్లు మోతీలాల్ ఆశించిన స్థాయిలో ప్రతిస్పందించ లేదు. ఇంత జరిగినా వాళ్ళింకా మాంటేగ్- చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల మీదే దృష్టి పెట్టుకుని వున్నారు. మారిన పరిస్థితిని, ప్రభుత్వ దమననీతినీ వాళ్ళు గుర్తించే స్థితిలో లేరు. ఇది అతివాదులు- మితవాదుల మధ్య దూరాన్ని బాగా పెంచింది.

4) 1919 అమృత్‌సర్ కాంగ్రెస్ గాంధీ కాంగ్రెస్‌గా మారిపోయింది. లోకమాన్య తిలక్ స్వయంగా చర్చలన్నింటిలోనూ పాల్గొన్నాడు. మెజారిటీ డెలిగేట్లు గానీ, సభకు హాజరయిన జనసందోహం గానీ గాంధీ నాయకత్వాన్ని కోరుకోసాగారు.

5) 'మహాత్మాగాంధీకి జై' అనేది తారక మంత్రంగా మారింది. జాతీయోద్యమం కొత్తరూపాన్ని సంతరించుకొని కొత్త మార్గాన నడిచేందుకు సమాయత్తమైంది. నిజానికి బ్రిటిషర్లు ఊహించని పరిణామం ఇది.

6) జలియన్ వాలాబాగ్ నరమేథంతో జాతీయోద్యమం చల్లారిపోయి, దేశభక్తులు, తోక ముడుస్తారని అంచనా వేశారు. కానీ, కేవలం పాతిక సంవత్సరాల వ్యవధిలోనే వాళ్ళు అంత త్వరగా ఈ దేశాన్ని ఖాళీ చేసి వదిలి వెళ్ళిపోయే పరిస్థితులు ముంచుకొస్తాయని ఊహించకలేకపోయారు. అదీ సంగతి!



